# విషయ సూచిక

...... ...... ......



## ఇరవై ఒక్క సంఖ్య వినాయకుడికే కాదు వైదిక యజ్ఞాల్లో కూడా....

విఘ్నేశ్వరుడి పూజ విఘ్నాలను తొలగిస్తుంది. అలాగే స్వామికి చేసే ఇరవై ఒక్క ప్రదక్షిణలు.. మీకు రాబోయే విపత్తుల నుండి రక్షిస్తుంది. రాబోయే గండాలకు వినాయకుడే విఘ్నాలను సృష్టించి అటు వెళ్ళకుండా మీ దిశను మారుస్తాడు. ఇరవై ఒక్క ప్రదక్షిణలు, ఇరవై ఒక్క ఫలాల దానం... వినాయకుడికి అత్యంత ప్రీతి. అలాంటి ప్రీతి కలిగించే పూజాదికాల వల్ల మహా ప్రమాదాల నుంచి మిమ్మల్ని రక్షిస్తుంటాడు... ఆ వైపు వెళ్ళకుండా చేస్తాడు. అలాగే మీ పుట్టిన రోజునాడు ఇరవై ఒక్క మందికి చేసే దోసకాయ దానం కూడా మిమ్మల్ని ప్రమాదాల నుంచి కాపాడుతుంది. ఎన్ని పూజలు చేసినా విఘ్నాలు ఎదురవుతుంటే గతజన్మ పాపదోషం అయివుండవచ్చు. అలాంటివారు కర్పగవల్లి మొక్కను నాటి పూజించండి. దైవ వృక్షాల్లో అది ఒకటి. అలాగే వెలగ మొక్క అయితే మంగళవారం నాటండి.

## ప్రాణగండం పోగొట్టేది గీతా గోవిందము

జయదేవుడూ, అతని భార్య పద్మావతిలపై తన భర్త ఎంతో గౌరవం చూపిస్తుండటంతో లక్షనసేన మహారాజు భార్య ఓర్వలేక, తన రాజూ, జయదేవుడూ వేటకెళ్ళినపుడు.. పద్మావతి వద్దకెళ్ళి నీ భర్తకు ప్రాణగండముందని చెప్పింది. అదీ ఈ రోజేనని చెప్పింది. దాంతో పద్మావతి దుఃఖ సముద్రంలో మునిగి స్పృహ కోల్పోయింది. తిరిగివచ్చిన జయదేవుడు పంతొమ్మిదో అష్టపది ఆలపించి నీళ్ళు



చల్లాడు. పద్మావతి నిద్ర నుంచి లేచినట్టు లేచింది. అష్టపదులలో శ్రీకృష్ణ భగవానుడు స్వయంగా వ్రాసిన పంక్తులున్నాయి. కాన జయదేవుడి గీత గోవింద పఠనం.. భక్తి, ముక్తి, రక్తి. ఇంకా ప్రాణగండం వున్నా తొలగిపోతుంది. కష్టాలూ, సుఖాలూ గతజన్మ మరియు ఈ జన్మ పాపదోషాలని బట్టి కలుగుతుంటాయి. ప్రాణగండాలూ, కర్మలని తప్పించేది కృష్ణమర్రి. ఆ మొక్కను నాటితే 'నా ఖర్మ' అని సరిపెట్టుకొనే మహా గండాలు దరిచేరవు.

## ఆడవారి నోళ్ళలో ఆవగింజైనా దాగదు

❀ అది సామెత మాత్రమే. కుంతీదేవికి ధర్మరాజు ఇచ్చిన శాపం ఇది. 'సకల లోకాల్లో ఉండే ఆడవాళ్ళకి రహస్యాలను రహస్యాలుగా కాపాడే శక్తి వారి మనస్సులో లేకుండా పోవుగాక' అని. కానీ నిజానికి స్త్రీ రహస్యం దాయాల్సి వస్తే తన కట్టె కాలిన తర్వాత కూడా ఆ రహస్యాన్ని రహస్యంగా ఉంచగలదు. ఆ శాపం ఈ కలియుగానికి వర్తించదు.

## వ్యాపార, నివాస స్థానాల్లో ఏ మొక్కలు ఏ దిక్కున ఉండాలి

❀ గృహాలకి ఎదురుగా ఏ మొక్కలనీ నాటకూడదు.

❀ తులసి ప్రధానంగా ... అదీ ఉత్తర ఈశాన్యంగా. లేదా గృహానికి తూర్పు వైపు మాత్రమే.

❀ పెద్ద వృక్షాలను దక్షిణ, పశ్చిమ దిక్కుల వైపు నాటాలి.

❀ బాగా పొడవుగా పెరిగే వాటిని ఉత్తరం, ఈశాన్యం, తూర్పు దిక్కుల వైపు నాటకూడదు.



❀ చిన్న చిన్న మొక్కలని తూర్పు వైపు గానూ, ఉత్తరం వైపు గానూ పెంచుకోవాలి.

❀ ముళ్ళకు సంబంధించిన వాటిని పెంచకూడదు.

❀ తప్పనిసరి పరిస్థితుల్లో చెట్టుని తీసెయ్యాలంటే మాఘ భాద్రపద మాసాల్లోనే తీయాలి. ఆ వెంటనే ఆ స్థానంలో ఏదో ఒక మొక్కని నాటితేనే ఆ చెట్టు నరికిన దోషం మీ కుటుంబాన్ని ఆవహించకుండా వుంటుంది.

❀ పెద్ద పెద్ద వృక్షాలుగా పెరిగే మొక్కలను దేవాలయాల్లో నాటాలి. చెట్ల నీడ వీలయినంతవరకు భవనం మీద పడకుండా జాగ్రత్త తీసుకోవాలి.

❀ అనుకోకుండా పెరిగిన విషవృక్షాలు, నాగజెముడు వంటివి మొలిస్తే వాటిని పీకి ఆ స్థానంలో మరో మొక్కని నాటాలి.

❀ వృక్షాలకి హాని చేస్తే, తీసేస్తే రావాల్సిన ధనం మొండి బాకీ కింద అవుతుంది.

## పెళ్ళి నాటి పారాణి ఇలా పెట్టాలి

ఓ గిన్నె తీసుకుని అందులో చిన్న గ్లాసు ఉంచాలి. ఆపై గ్లాసు చుట్టూ ఎండిన కొబ్బరి పలుకులుగానీ, బెల్లం ముక్కలు గానీ వేసి పొయ్యి మీద ఉంచాలి. ఆ గిన్నెపై నీటిని నింపిన మరో గిన్నె ఉంచాలి. అలా వేడి అయి కింద గిన్నెలో వున్న గ్లాసులోకి ఆవిరి రూపంగా గ్లాసులోకి నీటిలా వచ్చేస్తుంది. ఆ నీటికి కుంకుమ కలిపి కొత్త పెళ్ళి కూతురికీ, పెళ్ళి కొడుకుకీ పారాణిగా రాయాలి. అంతేగాని అంగిట్లో దొరికే రసాయనాలని పూయకండి. పారాణి అంటే దేవతా



ముత్తైదువులందరికీ రాయటమే. పెళ్ళికూతురితో శ్రీగంధం మొక్కని నాటిస్తే దాంపత్య జీవితం సుఖమయిమవుతుంది. నచ్చినవాడు.... మెచ్చినవాడు అయిన భర్త వల్ల భోగాలు కలుగుతాయి.

## అపవాదులేస్తున్నారంటే

- మీరు స్వచ్ఛమైన వారేనని పరమార్థం.
- అపవాదులు సృష్టిస్తున్నారంటే అర్థం మీలో దోషాలు లేవని, కనపడటం లేదని, దొరకటం లేదనేగా. ఉత్తమమైన మనిషి తనలో లేని దోషాల్ని ఇతరులు చెప్పుకుంటుంటే నవ్వుకుంటాడు. అపవాదులూ, నాటీపోటీ మాటలంటుంటే... గుసగుసలాడుకుంటుంటే దానికి కారణం అపురూపమైన మీ అందమైనా అయి వుంటుంది లేదా ధనమైనా అయి వుంటుంది. జాతకగ్రహ దోషాలైనా అయి వుండచ్చు. కాన సకల గ్రహదోషాలను పోగొట్టే నల్ల జీడిమొక్కను దూరంగా నాటండి.

## ఆయుష్షుని పెంచే యమళార్జున వృక్షాలు

- అహంకార, కామాలతో దేవఋషిని హేళన చెయ్యటంతో కుబేరుని ప్రియపుత్రులు శాపానికి గురయ్యారు. భూమిపై యమళార్జున వృక్షాలుగా జన్మించారు. ద్వాపర యుగంలో బాలకృష్ణుని వల్ల శాపవిమోచనం అయింది. అట్టి వృక్షాలను నాటితే మీలో మహాశాపాలు అనగా రోగాలూ, దోషాలూ, ధర్మపరుల యెడల చేసిన తప్పులు తొలిగి ఆయుష్షు పెరుగుతుంది.



## వెల్లుల్లి పాయని పాలల్లో మరగ బెట్టి...

రెండూ లేదా మూడు వెల్లుల్లి పాయలని పాలల్లో మరగ బెట్టి సేవిస్తే శృంగార కాంక్ష, వీర్యాభివృద్ధి జరిగి సంతానం కలుగుతుంది. అలాగే విడిగా తినాలనుకుంటే అల్లంతో కలిపి తింటే ఎలాంటి ఇబ్బందులు వుండవు. రెండు వెల్లుల్ని చెంచా నేతిలో వేయించి భోజనంతో పాటు తింటే రోగనిరోధక శక్తి పెరుగుతుంది. అయితే శాస్త్రం మాత్రం వెల్లుల్లి తింటే ప్రాయశ్చిత్తం చేసుకోవాలని చెబుతోంది. తులసి లేని ఇల్లు గబ్బు పట్టిన ఇల్లని సామెత... అలాంటి వారింట తులసి మొక్క ఇచ్చి నాటేలా చేయాలని శాస్త్రం.

## భర్తని అనుమానించే విషయంలో భార్యకి మహా ప్రేమ వుంటుంది

'సుగంధాలు వెదజల్లే పైపూతలు తయారు చేస్తాను... మధిరను అందిస్తాను.. రకరకాల చెండ్లు కడతాను.. సుందరమైన తిలకాలను దిద్దుతాను... మీ కొలువులో పని కల్పించండి' అని అజ్ఞాతవాసంలో విరాటుడి భార్య సుదేష్ణని అడిగింది ద్రౌపది. దానికి సుదేష్ణ 'ఓ అపూరూప సుందరీ... నీ రూపం స్త్రీనైయిన నాకే మరులు గొల్పుతోంది. ఆడవాళ్ళు కూడా నీ నుంచి చూపులు మరల్చటం కష్టం. నా భర్త విరాటుడు నిన్ను చూసి... ఇంక వేరే మాటలెందుకు' అంది. సుదేష్ణ తమ్ముడైన కీచకుడ్ని అనుమానించలేదు. వాడ్ని ఎలా అయినా దారిలో పెట్టవచ్చనుకుంది. తనకన్నా అందమైన వారిని సన్నిహితంగా వుంచలేనంది. అక్కడ భర్తని కాదు అనుమానించింది.... మగవాడి బుద్ధిని. అందుకే చాలామంది ఇంట్లో



పనివాళ్లని సహితం చూసి పెట్టుకుంటారు. భర్తపై అనుమానం ఉండి మాత్రం కాదు. లక్ష్మీతులసి, కృష్ణతులసిలను జంటగా నాటితే మగబుద్ధి వంకరలు పోదు. శ్రీమహాలక్ష్మి తన ప్రతిరూపంగా పంపినదే తులసిచెట్టు.

## ఎవరి బుద్ధి ఎప్పుడు తెలుస్తుంది

పెళ్ళాం గురించి దరిద్రంలో తెలుస్తుంది. మిత్రుడి గురించి విపత్తుల సమయంలో తెలుస్తుంది. అన్నదమ్ములు గురించి పంపకాలప్పుడు తెలుస్తుంది. వెలయాలి గురించి డబ్బులు లేనప్పుడు తెలుస్తుంది. ఈ నాలుగు దరిద్రాలు రాకూడదు. ఏ వక్కటి కలిగినా, బాధపడినా తిరిగి ఆనంద ఐశ్వర్య సుఖాల కోసం కలికల్ప మొక్కని నాటండి. పూర్వ వైభవం వస్తుంది.

## సృష్టిలో అత్యంత రమణీయమైన, సుందరమైన ప్రాణి

స్త్రీ... అనుకుంటున్నారా...? కాదు. పురుషుడు. పూర్వము వెన్నపూస రంగు శరీరం గల రాకుమారికి వర పరీక్ష జరిగింది. కావాల్సిన అన్ని అర్హతలు ముగ్గురిలో ఉన్నాయి. రాకుమారి ముగ్గుర్నీ చూసి ఒకర్ని ఎంచుకుంది. మిగతా వారు అతడ్నే ఎలా ఎంచుకున్నావని అడిగారు.

దానికి రాకుమారి అందానికి ప్రాముఖ్యతనిచ్చే మేము చేసుకునే వాడి విషయంలో ఎంతటి అందానికి ప్రాధాన్యత ఇస్తామో తెలుసా? సృష్టిలో అందమైన ప్రాణి మగవాడు. అలాంటి అందమైన ప్రాణి అయిన మీరు పొట్ట పెంచుకుని.. జుట్టు సంరక్షణ (అనగా వూడిపోయి) లేకుండా వుంటే... మీకు మీరే అంత నిర్లక్ష్యంగా వుంటే..



ఆ స్త్రీని ఏం సుఖపెడతారు. ఆ రెండూ లేకుండా మిమ్మల్ని మీరు అద్దంలో చూసుకోండి. సృష్టిలో అందంగా వుండాల్సింది ఆడది. అందమైనది మగవాడే. కాన పురుష పుంగవులారా.. రాకుమారి చెప్పిన రెండు విషయాల్లో జాగ్రత్త. మగాడు కుబేరునికి ప్రతిరూపమైన మద్ది మొక్కలా వుండాలి. మద్ది మొక్క సంరక్షణ కుబేరప్రీతి కలిగిస్తుంది. శరీరసౌష్టవం కలిగిస్తుంది.

**వటసావిత్రి వృక్షాన్ని పూజించటం, సోమవారం రోజున ఆ మొక్కని నాటడం వల్ల భర్తకి రాబోయే గండాలు తొలగుతాయి. ఈ వృక్ష ఆరాధన వలనే సతీసావిత్రి యముడితో పోరాడే శక్తి సంపాదించింది.**

## దంతధావనమునకు ఏ వృక్షము పుల్లలు శ్రేష్టం

❀ పొన్న... మారేడు.. ఉత్తరేణి.. దిరిసెన.. మామిడి... వేప.

❀ మౌనంగా తూర్పు లేదా ఉత్తరానికి తిరిగి దంతధావనం చేసుకోవాలి. అలా చేసుకునేటప్పుడు కాత్యాయన ముని మంత్రం జపించుకోవాలి.

**ఆయుర్బలం యశోవర్చః ప్రజాః పశువసూనిచ**
**బ్రహ్మ ప్రజ్ఞంచ మేధాం చత్వం నోధేహి వనస్పతే॥**

❀ జన్మదినములందు, వివాహ దినములందు వ్రతదీక్షా దినములందు, ఉపవాస దినములందు, భర్త ఊళ్ళో లేని సమయములందు దంతకాష్టమును చేయరాదు.

అలాగే నిషిద్ధ తిథులయందు కూడా దంతకాష్ఠమున చేయకుండా కేవలం పన్నెండు సార్లు పుక్కిళించాలి. యాజ్ఞవల్క్యముని చెప్పిన ప్రకారం ఇటుక... మట్టి.. రాళ్ళ పొడి.. బూడిదలను వాడరాదు.



## దశవిధ మన్మథావస్థలు

ఆశ్చర్యము... అద్భుతం కలిగిన రూపస్త్రీని చూసినప్పుడు పది విధాలైన మన్మథావస్థలను పురుషుడు పొందుతాడు.

**"దృఙ్మన స్సంగ సంకల్పా జాగరః కృశతా உ రతిః**
**హ్రీత్యాగోన్మాద మూర్ఛాంతా ఇత్యనంగదశా దశ"**

కనులు పెద్దవవ్వటము... మనస్సు దూకటము.. ఎలా అయినా పొందాలన్న నిర్ణయం.. ఎక్కువ సేపు చూడటము... తక్కువవ్వటము.. కనులలో ఆరాధన.. కాదంటే ఉన్మాదంతోనైనా పొందాలను కోవటము... స్థైర్యాన్ని కోల్పోవటము... మూర్ఛ(అనగా కొయ్యబారి పోవటము) చూపులు వెనక్కి తీసుకోలేకపోవటము.... వేటగాడి వలలో పడ్డ జింకలా విలవిలలాడటము.. పై అవస్థలు ఎలాంటి వారికైనా తప్పవు. ఆమె కరుణించకపోతే అదో మహా వేదనాభరితమైన మన్మథావస్థే. ఆ స్త్రీ కోసం ఆ అపరూప సౌందర్యమనే ఉచ్చులో పడి అందం అనే వలలో పడ్డ చేపల్లా గిలగిల లాడిపోతారు. దాన్ని జయించినప్పుడే మీరు దేన్నయినా సాధించగలరు. లేదంటే మహా అయితే ఆ స్త్రీని మాత్రం సాధించగలుగుతారు.

**ఏకాంత సమయంలో భార్య ఎడమకన్ను అదిరితే భర్తకి మహా విజయం ప్రాప్తించబోతున్నదని అర్థం... అలాంటప్పుడు భర్త బయటికి వెళ్ళే సమయంలో భార్య కుడిచేతిని అలవోకగా చిరునవ్వుతో ఎత్తి వెళ్ళి సాధించుకురమ్మని చెప్పాలి.**



## జీవుడు స్త్రీ శరీరంతో .... పురుష శరీరంతో పుట్టడానికి హేతువు

మద, కామ, క్రోధ, అహం తత్త్వాల బేధం వల్ల జీవుడు స్త్రీ, పురుషులుగా జన్మిస్తాడు. స్త్రీ కయినా, పురుషుడికైనా ఇరవై నాలుగు తత్త్వాలు తప్పని సరి. గతజన్మ కర్మ ఫలాన్ని బట్టి స్త్రీ పురుష రూపం ధరించటం జరుగుతుంది. ఆయా జీవులు చేసుకున్న పుణ్యపాపకర్మలని బట్టి సుఖదుఃఖాలు భరించటానికి స్త్రీ పురుషులగానూ, ధనిక.. పేద... నీచ.. నికృష్ఠ... పుణ్య కుటుంబాల్లో జన్మించటం జరుగుతుంది. కర్మఫలం అనుభవించటానికే దేహాన్ని ఎన్నుకుంటాడు. అంతేగాని స్త్రీ పురుష బేధం ఆత్మకు లేదు.

## సమస్యల్నీ, బాధల్నీ తీర్చే మూలికలు

-ఎర్ర కలబంద.. నల్ల పసుపు, తెల్ల ములక... మయూర శిఖి... శ్వేతవాకుడు... శ్వేతశ్రావణి... తెల్ల మోదుగ... హంసపాదు.. సోమలత... విష్ణుకాంత వంటి మూలికల్లో ఏదైనా వక్కటి మీ ఇష్టదైవం పూజలో పెట్టి ఆపై పారే నదిలో కలపటం ద్వారా మీ సమస్యలు కరిగిపోతాయి.

**నూతన వధూవరులకు తొలి రాత్రి నాడు పెద్దలు అక్షింతలతోనే కాక వాటిలో పూలు కలిపి చల్లి ఆశీర్వదించాలి.**

## మన్మథుడి అయిదు బాణాలు

అరవిందం.. అశోకం.. చూతం.. నవమల్లిక.. నీలోత్పలం.. ఈ అయిదు శ్రీహరి పుత్రుడైన మన్మథుని పంచబాణాలు. ఇంత అందగత్తెని పొందని జన్మ వృధా అని అనిపించే స్త్రీ తారసపడినప్పుడు ఆ సౌందర్యం చూసి విరహానికి గురయితే శివుడి కోపానికి దహించబడిన మన్మథుడు అయిదు బాణాలు ఒకేసారి మీమీద వేసినట్టే.



## పెళ్లి కూతుర్ని ఎలా తయారు చేయాలి

❀ తెల్లవారుజామునే లేచి తూర్పువైపు తిరిగి శ్రద్ధగా సరస్వతీదేవిని ప్రార్థించాలి. (అలా చేయటం వల్ల అలంకార శాస్త్రంకి నమస్కరించి ప్రారంభిస్తున్నట్టు)

❀ స్నానపు నీటిలో కొన్ని ముత్యాలు వేసి స్నానం చేయాలి.

❀ చల్లని నీరు, పాలు, పన్నీరు కలిపిన నీటిని బంగారు లేదా ఆ రంగుతో గల చెంబులతో పోస్తూ స్నానం చేయించాలి.

❀ మెత్తటి బట్టలతో ముత్యాల్లా మెరిసే నీటి బిందువులను ఒత్తుకోమని (స్నానం అయ్యాక కొన్ని నిమిషాలు ఆగి) చెప్పాలి.

❀ కురులకు సుగంధ ద్రవ్యాల పొగ పట్టించాలి. పొడవాటి గోళ్ళు వున్న వాళ్ళు జుట్టు చిక్కుని తీయాలి.

❀ తలలో పూలు పెట్టాలి... కనులకు కాటుక దిద్దాలి.

❀ చక్కటి లోలాకుల్ని చెవులకి పెట్టాలి.

❀ ముక్కుకి ముక్కెర.

❀ ఆపై కంఠానికి హారాలని ధరింపచేయాలి. ఆ తర్వాత ఒడ్డాణం.. మిగతా నగలు ధరింపచేసి కాళ్ళకి పారాణి రాయాలి.

❀ నుదుటన చందమామ వంటి బొట్టు పెట్టాలి. ఆపై బుగ్గమీద దిష్టి చుక్క పెట్టాలి.

❀ నిలువటద్దం ముందు నుల్చుని తన ప్రతిబింబాన్ని కన్య చూసుకోవాలి.

❀ పాపిట బిళ్ళ, గాజులు, హారాలు.. అన్నింటిని... అన్ని రకాల నగలను, చీరను సవరించుకుని.. నేరుగా వెళ్ళి తల్లి, తండ్రికి, కుటుంబ పెద్దలకి నమస్కరించాలి. వారి నుంచి అక్షింతలు వేయించుకుని ఆశీర్వాదం తీసుకోవాలి.



## శ్రీరాముని పర్ణశాలలో ఉన్న అయిదు దివ్యవృక్షాలు

⚘ మర్రిచెట్టు... మేడి చెట్టు.. రావిచెట్టు.. సీతాఅశోక... మారేడు. ఈ అయిదు వృక్షాలున్న ప్రతి ప్రదేశం పంచవటే. పంచవృక్షాలున్న చోట సీతారామచంద్రులుంటారు. ఆ ప్రాంతాన్ని సదా రక్షిస్తుంటారు. ఈ అయిదు వృక్షాలు వున్న ప్రాంతంలో పది నిమిషాలు గడిపితే చాలు... మహోన్నతమైన స్థానానికి తీసుకెళ్ళగలిగే ఆలోచినలనిస్తాయి.

## కాముకుడ్ని చూసి (తనకి రక్షణ లేదని తెలిసి) స్త్రీ ఎంత తల్లడిల్లుతుందో తెలుసా....

⚘ ముఖం తెల్లబోతుంది. అనగా నల్లగా అవుతుంది. భయం విపరీతంగా పెరిగిపోతుంది. శరీరం వణికిపోతుంది. నడకలో తడబాటు... సంకోచంతో కూడిన దుఃఖం.. నిశ్చేష్ఠత... సంకటం.. బాధ... అన్నీ ఒక్కసారిగా కలిసి శరీరం మొత్తం దిగులు కమ్మేస్తుంది. దాంతో పట్టరాని చోట కూడా చెమటలు పడతాయి. దురవస్థ దశ అది.... అంతటి భరింపలేని మనోవేదనకి గురిఅవుతుంది స్త్రీ. అలాంటి స్థితికి స్త్రీని తెస్తే అలాంటి స్థితే పురుషుడికి ఏదో ఒకరోజు కలుగుతుంది.



## ఆడదానికి అడది కూడా శత్రువు

'నేను ఏదో రకంగా నీ దగ్గరికి పంపుతాను. నీవు ఆ సమయంలో ఎవ్వరూ లేకుండా చూసుకో... మధ్యలో ఆటంకాలు రాకుండా... ఎవ్వరూ రాకుండా చూసుకో.... తన అవసరాలు తీరుస్తానని చెప్పు... తామేం చేసినా ఎవ్వరికీ తెలీదని నమ్మకం ఆమెకి కలిగించు. కోరిక చెప్పి బ్రతిమిలాడి ఆశ చూపించి ఒప్పించు.. ఇష్టపడేలా చేసి భోగించు...' ఏ పురాణంలో ఏ ఇతిహాసంలో ఎవరు ఎవరితో ఈ మాటలు అన్నారో ఆ విషయం వదిలెయ్యండి. అలాంటి ఆడవాళ్ళు కూడా వుంటారు. నమ్మించి పంపుతారు. సాటి ఆడదే కదాని నమ్మారో.. ఆపై తీరిగ్గా పైసామెతను అనుకొని తృప్తి పడాల్సిందే. వెనుకటికి ఒకామె విజయానికి జిల్లేడు.. విద్యకి ఉసిరిచెట్టు, సంతానం కోసం రావిచెట్టును నాటింది. అయినా ఏం ప్రయోజనం కానరాకపోవటంతో ఓ సాధువు నడిగింది. దానికి ఆయన.... 'నీవు స్నేహం చేసే వ్యక్తులు సరయిన వారు కాకపోతే మొత్తం జీవితమే నాశనమవుతుంది. మహా మూడు భోగాలనిచ్చే మూడు చెట్లని నాటావు. వాటి ఆలనాపాలనా మాత్రం చూడలేదు. వదిలేశావు. అలాగే వృక్షప్రాణశక్తి నిన్నూ వదిలేసింది. కాన బాధ్యత, ధర్మాన్ని మరిచే వారితో స్నేహం, సన్నిహిత్యం సకల పుణ్యాల్ని హరించి వేస్తాయి' అని చెప్పాడు.



## పద్మపురాణం ప్రకారం ఏ మొక్కనాటితే ఏ ఫలం

- మొక్కలు నాటిన వారికి భువిపై అనుకోని ఆకస్మిక సుఖాలు కలుగుతాయి.
- నేరేడు మొక్క నాటితే సంతానం కలగనివారికీ, ఆలస్యం అయినవారికి సంతానం కలుగుతుంది.
- ఇక దానిమ్మ మొక్క నాటితే సౌందర్యవతయిన భార్య వస్తుంది.
- అనారోగ్యం కలవారు, బాధలు పడుతున్నవారు రావిచెట్టుని నాటండి. ఆ ప్రాణశక్తి మీలోని వ్యాధిని పారద్రోలుతుంది.
- చదువులో వెనకబడిన వాళ్ళు మోదుగ (బ్రహ్మ నివాస స్థానం) చెట్టు నాటితే విద్యాసంపత్తి పెరుగుతుంది.
- దగ్గరివారు, అయిన వారు, ఆడపిల్లలు దరిద్రంలో బాధలు పడుతుంటే వేపచెట్టును వారిపేరు మీద నాటండి.
- స్త్రీ సుఖం కోసం ద్రాక్ష నాటాలి.
- చింతచెట్టు మొక్క నాటారంటే అపారసేవకులతో సేవలు చేయించుకునే అదృష్టం లభిస్తుంది.
- కొబ్బరి చెట్టును నాటడం వల్ల భార్య ద్వారా భర్తకీ, భర్త ద్వారా భార్యకి అపార సుఖం.
- ధనం ఆశించేవారు, రావాల్సిన ధనం తిరిగి రావటానికీ గంధం మొక్కను నాటాలి.
- సకల సౌభాగ్యాల కోసం మంగళవతులు సంపెంగను గృహానికి దూరంగా నాటాలి.

ఈ చెట్లను నాటి వదిలేయకుండా వాటి బాగోగుల చూడండి. అప్పుడే నాటిన చెట్టు సంపూర్ణంగా ఎదుగుతుంది... పూర్ణఫలం లభిస్తుంది.



## మనో వికార చేష్టలు

'కామాతురాణాం న సుఖం న లజ్జా'

కామం కలిగినప్పుడు మహా వికారాలొస్తాయి. పదే పదే సౌందర్యాన్ని తలచుకోవటం... అసలు వప్పుకుంటుందా లేదా అని పైకి చూస్తూ ఆలోచించటం.. ఊహించుకొని ఆనందించటము.. కోరికలు పాముల్లా బుసలు కొడుతుంటే, ఆ లక్షణాలతో అటూ ఇటూ తిరగటము..... వెళ్ళి కలవాలనుకోవటం... అలా వెళ్తే ఎవరైనా చూస్తారేమోనని శంకించటము..... వలపు విరహాలతో నిస్సహాయంగా కూలబడటం. ఇవన్నీ మనో మన్మథ వికారాలు. ఆ లక్షణాలు ప్రేమవి కావు... కామానివి. అది తీరితే మళ్ళీ వాళ్ళు గుర్తుకురారు. అందుకే స్త్రీలు పురుషుడ్ని ఎక్కడుంచాలో అక్కడుంచుతారు.

## ఎవరమ్మాయో... ఈమె పేరేంటో.. ఈమె భర్త ఎవరో... ఈమె ఇల్లెక్కడో....?

ఇందులో ఎక్కడైనా అపశృతి తెలుస్తోందా.. లేదా... కానీ వుంది. ఎవరమ్మాయో..? (ఇంతటి అందానికి జన్మనిచ్చిన తల్లీ, తండ్రి ఎవరో..?) ఈమె పేరేమిటో...? (ఈ సుందరి పేరుగా రూపొందటానికి ఆ అక్షరాలు ఎంత ఏ నోము నోచి పుణ్యాన్ని పొందామో), ఈమె భర్త ఎవరో (పూర్వజన్మ ఫలం వల్ల మాత్రమే పొందగలిగే ఆ దివ్య సౌందర్యాన్ని పొందిన అదృష్టవంతుడెవ్వడో) ఈమె ఇల్లెక్కడో...? (మహా సౌందర్య నిధి వున్న ఆ గృహం ఎక్కడో... అక్కడికి వెళ్ళగలనా.. ఆమెను పొందగలనా..) అన్ని అర్థాలుంటాయి..... మగాడి మాటల్లో.



## మత్స్య పురాణం ఆధారంగా
## వృక్షం ఎంత గొప్పది

పది బావులు ఒక దిగుడు బావితోనూ, అలాంటి పది దిగుడు బావులు ఒక చెరువుతోనూ, అలాంటి పది చెరువులు ఓ ఉత్తమ పుత్రుడితోనూ, అలాంటి పది ఉత్తమ పుత్రులతో ఓ వృక్షం సరిసమానం. వివాహానికి ముందు అనగా సంబంధాలు చూస్తున్నప్పుడు శివవిష్ణువులకు ప్రీతికరమైన వృక్షాలను అనగా మొక్కలని శివాలయంలో లేదా విష్ణువాలయంలో నాటించండి. బాగా చూసుకునే వాడూ, మాటవినేవాడూ, అర్థం చేసుకునేవాడూ భర్తగా లభిస్తాడు. ప్రహ్లాదుడు వంటి పుత్రుడు కలుగుతాడు. భర్తని వశం చేసుకోవటానికి వశీకరణాలనీ, గరుడగీతలనీ... వక్రమార్గాలని అన్వేషించకండి. అది ఇరువురికీ అపాయం. పూల మొక్కలని జన్మనక్షత్రం ప్రకారం నాటి పెంచండి. రోజూ క్రమం తప్పకుండా నీరు పోయండి.

## ఆ కాలంలో అలా అప్పగించేవాళ్ళు...

'మా అమ్మాయి ఒక్కరోజైనా మమ్మల్ని విడిచి వుండలేదు. కాపురానికి తీసుకు వెళ్తున్నావు. చిట్టితల్లిని వదలి మేమూ, మమ్మల్ని వదలి తనూ దూరంగా వుండాల్సి వస్తూంది...' అంటూ కన్నీరు పెట్టుకుంటూ ఆడపడుచులకీ, అయినవారికీ అప్పగించటంతో పాటు ఈ మాటలనూ కుమార్తెకి చెప్పాలి...'అమ్మా.. ఇక నీ భర్తే నీ సర్వస్వము. స్నేహితుడు, గురువు, దేవుడూ అన్నీ ఆయనే. అత్తమామల్ని ఆదిదంపతులగా భావించి



పూజించు. నీ శ్రీవారు ప్రేమిస్తే అహం, గర్వం పడకు. కోపిస్తే అలకబూనకు.. బంధువుల్ని భక్తి విశ్వాసంతో చూసుకో. ధర్మం ఆచరించు. తోడికోడళ్ళతో కలసిమెలిసి తలలో నాలుకలా మసలుకో...' అని అప్పగించాలి.

## చెట్లకి నీళ్ళు పోయటమంటే

శాంతిహోమం చెయ్యటమే. భూదేవి శాంతిస్తుంది. శాంతి సిరులను ఇస్తుంది. పెద్దలు అందుకనే పెరటిలో వృక్షాలని నాటేది. కనీసం అలా అన్నా ఆ నీడలో సేద తీరుతారని. రోజుకి ఒక్కసారన్నా ఓ చెంబుడు నీరు పోస్తారని. ఆ చెంబుడు నీళ్ళే సంజీవినిలా మీకూ పనిచేస్తాయి. మీకు ప్రశాంతతను ఇస్తాయి.

## వందేళ్ళు మీకు....

- అలా ఎవ్వరైనా అనగానే 'ఆఁ ఎందుకులెండి' అని నిరాశగా, నిస్పృహగా అనకండి.
- అద్భుతాలు సంవత్సరాల్లో జరగవు. సూర్యాస్తమయం నుంచి చంద్రుడు ఉదయించినంత సేపు కూడా పట్టదు.
- ఆకస్మిక ధనం రావటం ఎంతసేపు (దాన్నే కలిసి రావటమంటారు)
- ఆడది కేవలం కొద్ది సమయంలోనే, నిమిషాల్లోనే తన ప్రేమని వ్యక్త పరుస్తుంది.

ఓ మధ్య తరగతి అమ్మాయిని పెళ్ళిలో చూసి ఓ ధనవంతుడు వివాహం చేసుకున్నాడు. దాంతో ఆమె కోట్లకి అధిపతయ్యింది.

ఓ బలహీన క్షణంలో లొంగిపోయింది. సకల అంతస్తులు



దిగజారి రోడ్డు పక్కన పడేశాయి. అద్భుతం లేదా దురదృష్టం ఎప్పుడూ క్షణాల మీదే జరుగుతాయి. కాన నిరాశ అస్సలు వద్దు. సంవ్సతరాల తరబడి చేసిన న్యాయపోరాటానికి తీర్పు నిమిషాల్లోనే వస్తుంది. ఓపిక.. ఓపిక.. శ్రమ.. ఆలోచన వాటి వల్ల ఎంత అద్భుతమైనా జరిగి తీరుతుంది.

## మర్రివృక్ష పూజ పతిభక్తి పూజతో సమానం

- తమ మాంగల్యం మర్రిచెట్టులా చిరకాలం వుండాలని..
- 'నమో వైవసత్వాయ నమః' అని అనుకుంటూ పదకొండు.. నూట ఎనిమిది ప్రదక్షిణాలు చేసేది తమ భర్తకి శక్తిని ప్రసాదించమని.
- సింధూరం రాసేది దీర్ఘ సుమంగళిగా వుంచమని.
- నూలు దారాలు చుట్టేది తన భర్త తనకీ, తన కుటుంబానికీ నీవలే అనగా మర్రివృక్షంవలే నీడనివ్వమని.
- ఉపవాసం ఉండి సాయంత్రం చంద్రుడ్ని చూసి అల్పాహారం సేవించితే తత్ఫలితం దక్కుతుంది.

## ఈ ఆలయం వద్ద ఆయన భార్యని తలచకూడదు

- వయసు మదంతో, ప్రేమ పేరుతో, తెలిసీ తెలియక తప్పు చేసి వుంటే... రాజస్థాన్ నుంచి ముప్పయి కి.మీ దూరంలో వున్న భర్తృహరి దేవాలయాన్ని దర్శించి మీరు చేసింది మనసులోంచి తుడిచేసుకోండి. అక్కడ భర్తృహరి భార్య పేరు పద్మాక్షిని తలచుకోకండి.. భర్త ఇచ్చిన దివ్య ఫలాన్ని రతి కాంక్షని తీర్చే సఖుడికిచ్చింది... ఆ దోషం వల్ల ప్రాయశ్చిత్తం చెంది వచ్చిన భక్తుల దోషాలని పోగొట్టడానికి అక్కడ వేంచేసి వుంది.



## ఆడవారి చేష్టలకి అర్థాలున్నాయి

❀ కాలిమెట్టెల శబ్దాలతో హాయిని కలిగిస్తూ హంసలా నడిచి వస్తే... ఇష్టాన్నీ, సామీప్యాన్నీ, ఆసక్తినీ ప్రదర్శించి కోరుతుందని.

❀ సుగంధభరిత సువాసనలను పూసుకొని కొద్దిగా పైట జారి వుంచి కమ్మగా పలుకుతూ ప్రతి చేష్టలో వలపు కురిపిస్తూ చేసే ఆ ప్రక్రియ తన తీవ్ర అభిలాషను చెప్పకనే చెప్పటము.

❀ తీగవంటి మేనును మీకు మాత్రమే కన్పించేలా దుస్తులు ధరించి వలపుని చిలికించిన వెన్నని అద్దినట్టు పదాలను పలుకుతుంటే.... పారవశ్యాన్నీ, ప్రీతినీ సమస్త ఇష్టాలనీ తీర్చుకోమని.

అలాంటి లక్షణాలు మీ వద్ద ప్రదర్శించని స్త్రీని కోరితే.. ఆశిస్తే పతనం తప్పదని ఓ సందర్భంలో సుదేష్ణ తన తమ్ముడికి అనగా కీచకుడికి చెప్పింది.

## కల్పవృక్షం కూడా మీ సామర్థ్యాన్ని తిరిగి తీసుకురాలేదు

❀ ఖర్జూర పళ్ళని పాలలో నానపెట్టి మరుసటి రోజు నానిన పళ్ళని ఆ పాలలోనే చిదిమి తేనె, యాలకల పొడి కలిపి తీసుకుంటే తిరుగుండదు.

❀ పిస్తాపప్పు నుంచి తీసిన పాలలో కొద్దిగా తేనె కలిపి తీసుకుంటే వ్యాధి నిరోధక శక్తి పెరగటమే కాక కామశక్తి పెరుగుతుంది.

❀ మొక్కజొన్న కండెపై ఆకులు తొలగించండి. గింజల మధ్యలో సన్నని దారాల్లా పీచు కనిపిస్తుంది. ఆ పీచుతో కషాయం చేయించుకుని తాగితే ఎంతో మంచిది.



⚘ ఇంగువని వేయించి దానికి తేనె, మర్రి చెట్టు బెరడునుంచి తీసిన రసాన్ని సమపాళ్ళలో కలిపి ఓ చెంచా ఉదయం అల్పాహారం అయ్యాక తీసుకుంటే హానిచేసే ఆంగ్ల మందులు వేసుకునే ఖర్మ ఉండదు. సామర్థ్యం కోసం ఆ వైపు వెళ్ళకండి. తాత్కాలికంగా పనిచేసి ఆపై మిమ్మల్ని చేతకాని వాళ్ళలా చేస్తాయి.

⚘ రాత్రి పడుకునే ముందు పాలలో యాలకలపొడి, రెండు చుక్కలు తేనె కలిపి తీసుకోవాలి. (కొత్త పెళ్ళికూతురికి పాలగ్లాసు ఇచ్చి పంపడంలో అంత అర్థముంది. ఆ పనిని రోజూ మీరు చెయ్యండి).

⚘ మాంసాహారులు గొఱ్ఱె వృషణాల నుంచి తయారు చేసిన పదార్థాలని తీసుకుంటే ఇరువురికీ ఉత్సాహం ఎక్కువవుతుంది. పాతరోజులు తిరిగి వస్తాయి.

⚘ అరటి పండు తినటం... అరటి ఆకులో భోజనం చెయ్యటం.. ద్రాక్ష రసంలో ఓ నాలుగు చుక్కలు తేనె వేసుకుని త్రాగటము.. ఇంకా మామిడి పండ్లు వచ్చే కాలంలో వారానికి ఒక్కసారి పండు మామిడి ముక్కలూ, బాదమూ, ఖర్జూరాలు.. తేనెలు కలిపి ఓ గుప్పెడు తీసుకోవటము.

⚘ వేసవిలో బూడిద గుమ్మడి కాయ కూరను తినటము.

⚘ సపోటా పళ్ళను తేనెతో కలిపి తినటము.

⚘ వెలగపండు గుజ్జులో కొద్దిగా యాలకల పొడి, జీలకర్ర, తేనె కలిపి తింటే ఆ అందాలు మరింత అందమవుతాయి.

⚘ మునగకాయలూ, పచ్చిమామిడి కలిపి కూర చేసి కొత్త దంపతులకు పెట్టడం మంచిది.



⚘ గ్లాసు మజ్జిగలో ఎండు ఉసిరిపొడి ఒక స్పూను వేసి కలిపి సేవించటము... ఇత్యాదివాటిని చెయ్యటం ద్వారా శారీరిక ఆ శక్తి పెరుగుతుంది.

ఇవన్నీ కూడా ఎలాంటి వ్యాధులు లేనివారికి చెప్పినవి. ఏమైనా వుంటే వైద్యుని సలహాతో తీసుకోవాలి. కాన శరీరాన్ని, ఆనందాన్ని నాశనం చేసే ప్రకటన మందులు వాడితే కల్పవృక్షం కూడా మళ్ళీ మీ పూర్వశక్తిని తీసుకురాలేదు.

**ఆడదాన్ని పడెయ్యటానికి మగాడు ప్రేమ అనే ఒక్క బాణాన్ని మాత్రమే వెయ్యడు...,**

- ⚘ ఖరీదయిన జీవితం ఎలా వుంటుందో చాలా అమాయకంగా నటిస్తూ చూపిస్తాడు.
- ⚘ కష్టాల్లో తనున్నానని దూరిపోతాడు. చూపుల్లో కూడా అనుమానం రానీయడు. (చూపుల్లో తేడా వుంటే స్త్రీ వెంటనే ఎలక్ట్రానిక్ లేజర్ గీత గీస్తుందని తెలుసు)
- ⚘ పిల్లల చదువులకి, బట్టలకి సహాయం చెయ్యటం...
- ⚘ ఆర్థికంగా స్థితిలేని వాని భర్తకు ప్రోత్సాహం ఇవ్వటం.
- ⚘ భార్యా, భర్తల మధ్య చాలా తెలివిగా గొడవలు పెట్టడం.
- ⚘ కట్టలు.. కట్టల ధనాన్ని చూపించి 'లెక్క' సహాయం చెయ్యమని అడగటం.
- ⚘ ప్రేమికుల మధ్య గొడవపెట్టి అది బ్రేక్ అయ్యేలా చేసి ఆ అమ్మాయి పక్కన సెటిల్ అవ్వటం... ఓ అవకాశాన్ని సృష్టించుకోవటం.



కానీ దేవుడికి ఆడవాళ్ళంటే మహా ప్రేమ. బహుశా బలం తక్కువిచ్చాడనేమో.. లేక పార్వతీదేవి, లక్ష్మీదేవి, సరస్వతీ మాతలు వారి భర్తలని సాధించి మరీ ఆ తెలివి పెట్టించారో గాని.. ఆడది ఎలా పడుతుందో స్త్రీకి తెలుసు. లక్షల్లో వక్క మగవాడికి కూడా స్త్రీకి తెలిసిన విషయం తెలీదు... అలా లక్ష సందర్భాలు మగాడు సృష్టించినా, ఆ విషవలయాల నుంచి తప్పించుకునే ఆలోచనా... అవకాశం స్త్రీలకిచ్చాడు ఆ పరమాత్ముడు. కాన స్త్రీలు దేవుడ్ని ఆ విషయంలో నిందించవద్దు.

**ఈ ఆరు సుఖాలే మహాభోగం**

**అర్థాగమో నిత్య మ రోగితా చ ప్రియాచ భార్యా**
**ప్రియవారినీ చ వశ్యశ్చ పుత్రార్థకరీ చ**
**విద్యా షడ్జీవ లోకస్య సుఖాని రాజన్**

వద్దన్నా డబ్బులొచ్చిపడటం... అనారోగ్యమంటే తెలియకపోవటం... భార్యా లేదా భర్త అత్యంత ప్రేమకలిగి వుండటం.... బ్రతకటానికి పనికి వచ్చిన విద్య.. సంతానానికి వాళ్ళంత పిల్లలున్నా తల్లి, తండ్రి మాట మీరకపోవటం.. బంధుహితులు ప్రియంగా దగ్గరికి రావటం... ఇవన్నింటిలో ఎన్ని మీకు కలిగినా గత జన్మలో వేయి తులసిమొక్కలు నాటితే కలిగే పుణ్యం చేసుకుని వుంటారు. కాన పుణ్యాల ద్వారా సుఖాలు కలుగుతాయి. ఆ సుఖాల కోసం వృక్ష పూజ చేయటమే శాస్త్రం చెప్పిన దారి.



## పరసతీ సమాగమనం సర్వనాశనం....

ఇది చెప్పింది శ్రీమహాభారతము. తనది కాని స్త్రీ పొందుని కోరితే ధనాన్నీ, పేరునీ, గౌరవాన్నీ ఆఖరికి ఆయుష్షును కూడా హరించి వేస్తుంది. ఇవన్నీ పోయినా పర్వాలేదు సుఖమే ముఖ్యమనుకుంటే అది సుఖం కాదు. సుఖం ఇచ్చే పరస్త్రీ తనకి తాళికట్టిన వాడికి తెలుస్తుందేమోనని... తెలిస్తే తన ప్రాణం తీస్తాడనీ, చుట్టు పక్కలవారికీ, బంధువులకీ తెలిస్తే పరువుపోతుందనీ.. ప్రతివాడు రమ్మంటాడనీ, అలా పరి పరి విధాలుగా ఆలోచిస్తూ పురుషుడితో వుంటుంది. పూర్తిస్థాయి ఆసక్తి చూపక అన్యమనస్కంగా చేసే ఆ సాంగత్యం ఇరువురికీ ఉల్లాసం కాదు. అది అసలు సుఖమే కాదు. అదే సుఖమనుకుంటే ఎప్పటికైనా నాశనం తప్పదు ఇరువురికి.

## గృహంలో కరివేపాకుతో పాటు తమలపాకు తీగని కూడా నాటండి

సీతమ్మ తల్లి స్వయంగా హనుమకిచ్చింది తమలపాకుల మాలని.

మారుతికి పారిజాతం.. మల్లి.. సింధూరం... మొగలి పూవులతో పాటు తమలపాకులు అత్యంత ప్రీతికరం.

గృహంలో తమలపాకు తీగ వుంటే గృహంలోకి పీడలు రావు. చెడు వాసనలూ, చెడు మాట్లాడేవారు , చెడు చేసే వారు సహితం మౌనం పాటిస్తారు. అత్తాకోడళ్ళ మధ్య చిచ్చుపెడదామని వచ్చిన వారి నోట మాట రాదు.

శత్రువు కూడా లొంగిపోతాడు. గృహం ఆవరణలో పెరిగిన తమలపాకులను ఒక్కటైనా చేర్చి ఆంజనేయునికి తమలపాకు పూజ చేయిస్తేనే ఆ పూజ సంపూర్ణం అవుతుంది.



## ఇది మీ సుఖాలకి అడ్డం

- వేరుశనగపప్పు.
- పచ్చిమామిడి తిన్న తర్వాత నీళ్ళు త్రాగటం.
- పచ్చిబొప్పాయి కూర చేసుకోవటం.
- సంతానాన్ని కోరుకునే వారు ఆ రోజు దానిమ్మ తినకుండా కలిస్తే మంచిది.
- ఆకుపచ్చగా పుసుపు పచ్చగా వున్న వంకాయలని వండకూడదు. అలాగే ఆహారంలో సాధ్యమైనంతగా వంకాయలని తగ్గిస్తే మంచిది.
- దోసకాయలు పచ్చగా వుండే వాటిని వాడాలి. ఆకుపచ్చగా వుండే వాటిని వాడకూడదు.
- భోజనానికి ముందు కాకుండా భోజనం అయ్యాక నాలుగైదు క్యారెట్ ముక్కలు తినాలి.
- చేమదుంపలను సంవత్సరంలో ఒక్కసారి రెండు సార్లు మాత్రమే వాడాలి.

- ముల్లంగి.. బంగాళదుంప... చిలకడదుంప... పెండలము వంటి దుంప కూరలను, జీడిపప్పును ముప్ఫయి సంవత్సరాల తర్వాత తీసుకోకపోవటము మంచిది. తీసుకోవాల్సి వస్తే తప్పని సరయితే రెండు లేదా మూడు ముక్కలతో సరిపెడితే శరీరాన్ని సుఖపెట్టిన వారవుతారు.

## అలాంటి వాడ్ని కట్టుకుంటే దాని పాట్లు.....

క ॥ వగలాడికి ముసలాతడు
మగడయితే దానిచింత మరియింతింతా
జగదీశుడు తానెరుగును
ఖగపతిబల కుందవరపు కవిచౌడప్పా.

సొగసు లొలికించే సోయగంతో వున్న వయసుకత్తె అయిన వగలాడి అయిన స్త్రీ చేతకాని వాడ్ని చేసుకుంటే ఎన్ని తిప్పలు పడుతుందో ఆ పాట్లు పరమేశ్వరుడికే ఎరుక. నాలుగు గదులు మధ్య వాళ్ళు పడే నరకయాతన ఆ పరమేశ్వరుడు మాత్రం ఏం తీర్చగలడు. కాన వివాహం చేసేటప్పుడు తల్లి, తండ్రి ఎన్ని చూడాలో కూడా అందులో అంతర్లీనమైన పరమార్థం వుంది.

## శ్రీరామాలయంలో తప్పనిసరిగా ఉండాల్సిన మొక్కలు

అశోక వృక్షం... అశోకం అనగా ఆలయానికి వచ్చేవారి శోకాన్ని పోగొడుతుంది.

⚘ శింశుపావృక్షం.. ఎంతటి సమస్యకైనా పరిష్కారం ఆ వృక్ష ప్రాంగణంలో గడిపితే స్ఫురణకి తెస్తుంది.

⚘ సంజీవిని... ఎండిపోయిన కొమ్మకి నీరు తగిలితే ఎలా చిగురిస్తుందో అలా వదిలేసుకున్న ఆశలను నెరవేరుస్తుంది. ఆపై రామదర్శనం... పట్టాభిషేకమంతటి పరమానందం మనవశమవుతుంది.



## ఇరవై ఎనిమిదో రోజు ఆడపిల్ల పుట్టింట్లో వుండకూడదు

నక్షత్రం మళ్ళీ వచ్చేలోగా ఆడపిల్లను భర్త దగ్గరికి నయానైనా, భయానైనా పంపించాలి. చిన్నతనాన పాలు పడతారు, అన్నప్రాశన తర్వాత మెత్తటి అన్నం.. ఆ తర్వాత ఘన పదార్థాలు. అలాగే వివాహం చేసి ఓ అయ్య చేతిలో పెట్టారు. ఆడపిల్ల భార్య అవుతుంది. రాత్రి సుఖాలు తెలుస్తాయి. రుచి కోసం ప్రాకులాడేది నాలుకే కాదు... శరీరం కూడా. అలా ఎక్కువ రోజులయితే శరీరం ఏదో ఒకలా తీర్చుకోమంటుంది. నిగ్రహ శక్తి లేకపోతే... తప్పటడుగు. మెదటి అడుగే తప్పటడుగు... రెండో అడుగు... మూడో అడుగు. అలా అలవాటైపోతుంది ఇరువురికీ. అందరూ బాగానే వుంటారు. పాపపుణ్యాలూ, ధర్మాల విషయం వదిలేస్తే నాశనం అయ్యేది ఆ భార్యా, భర్త, పిల్లలే. అన్నింటికీ మించి ఎక్కువరోజులు తగాదా పడి దూరంగా వున్న భార్యపై కలిగేది అనుమానం. అది వచ్చే వరకూ చెయ్యద్దు. చుట్టూ వున్న వాళ్ళతో సంప్రదింపులు మానేసి ఇద్దర్నీ కలపండి. అశ్వమేధయాగఫలం పొందండి.

## పరుని భార్యని అదేపనిగా పొగడద్దు... కుబేరుడిలా భంగపడాల్సి వస్తుంది

గుణనిధి సప్త వ్యసనపరుడు. తల్లి నగలు కూడా దొంగలించి వ్యసనాలకు ఖర్చు పెట్టాడు. ఆ జన్మ తర్వాత దముడిగా జన్మించాడు. జీవించినంత కాలం శివాలయాల్లో దీపాలు వెలిగేలా చూశాడు. ఆ పుణ్య ఫలంతో వైశ్రవశునిగా జన్మించి శివుని కొరకు



అపారతపస్సును చేశాడు. శివపార్వతులు ప్రత్యక్షమయ్యారు. అనంతమైన దివ్య ప్రకాశంతో వెలుగొందుతున్న శివుణ్ని వదిలేసి పార్వతి వంక చూస్తూ....'ఏమి అందం... ఏంత వైభోగము.. ఈశ్వరుడెంత పుణ్యం చేసుకున్నాడు' అని పొగడసాగాడు. దాంతో వాడి కన్ను పోయింది. తన తప్పు తెలుసుకున్నాక వానిని పార్వతీదేవి క్షమించి 'నీవు కూడా నా బిడ్డవే.. అయినా ఈర్ష్యతో చూశావు గనుక కుబేరుడన్న నామధేయంతో పిలవబడుతావు' 'అలాగే నీ తపస్సు ఫలంగా నవనిధులకు నాయకుడిగా చేస్తున్నానని' ఈశ్వరుడూ వరమిచ్చాడు. పక్కవాడి పెళ్ళాం గురించి పొగిడితే అది దంపతులు కాదు క్షమించి వదిలెయ్యటానికి.

## నక్షత్రం తెలియని వారు ఏ మొక్కను నాటితే దోషాలు పోయి సంపదలు వృద్ధి అవుతాయి

## నాగలింగ వృక్షం

- ఈ వృక్షం పూలు ఈశ్వరునికి ఎంతో ప్రీతికరం.
- పరమేశ్వరునికి కార్తీకమాసంలో ఒక్క నాగలింగం పువ్వు పెడితే వేయి శివలింగాలను ప్రతిష్ఠ చేసినంత పుణ్యం లభిస్తుంది.
- శివాలయంలో నాగలింగం మొక్కని నాటితే కైలాసంలో ఈశ్వర సన్నిధిలో మొక్కని నాటినంత ఫలం.
- అభిషేకాలు... యజ్ఞాలు... తపస్సు... పూజలు... పునస్కారాలు.. దానాల వల్ల వచ్చే ఫలం కన్నా ఈశ్వర ప్రీతికరమైన తమ్మి... అవిశ... మారేడు వంటి మొక్కలను నాటితే ఎక్కువ ఫలం లభిస్తుంది. ఆ నాటిన వృక్షం నుంచి ఉద్భవించే ప్రాణశక్తి మిమ్మల్ని సదా కాపాడుతుందనీ, ఉత్తమ లోకాలు కలుగుతాయని వేదం కూడా తెలవిస్తోంది.



## అయిదుగురు భర్తలని పొందింది ద్రౌపది ఒక్కతే కాదు

అమితమైన కామవాంఛలతో యముడూ, వాయువు.. ఇంద్రుడు, అశ్వనీదేవతల అంశలతో జన్మించిన పాండవులు అయిదుగుర్ని వివాహం చేసుకుంది ద్రౌపది. నల్లకలువల వంటి కన్నులు గల ద్రౌపదికి అయిదుగురు భర్తలతో వున్నా కన్యత్వమూ, పతిసేవా భాగ్యం, అధిక కామాన్ని అనుభవించాలన్న కోరికలు తీరటంతో పాటు ముత్తైదువతనం కూడా వుంటుందని శివుడు వరమిచ్చాడు. అలాగే నితంతుడనే రాజర్షి పుత్రులు సాల్వేయ, శూరసేన, శత్రుసేన.. బిందుసార.. అతిసారులనే అయిదుగురు ఔశీ రాజ పుత్రిక అజతను చేసుకున్నారు. పాండవులవలే విడివిడిగా సంతానాన్ని పొందారు. మాట్లాడితే ద్రౌపది గురించి అలా మాట్లాడద్దు. ద్రౌపది, అనగా యజ్ఞసేన. లక్ష్మీ స్వరూపం. ద్రౌపది గురించి మాట్లాడితే సంసార గొడవలొస్తాయి.

## సాంగత్యంలో అంతిమ సుఖమెవ్వరికి...

పదిమందిస్త్రీలు ఒకేసారి తలలు తిప్పి చూసే అందగాడూ.. పక్క స్త్రీ తల తిప్పుకుంటేనే తనూ తలతిప్పుకుంటానని నిర్ణయించుకుని చూస్తుండిపోయే ఆరడుగుల అందగాడైన ఓ మహారాజుకు నూరుమంది అతిలోక సౌందర్యవతులైన భార్యలున్నారు. ఓసారి ముని శాపానికి గురై ఆతడు స్త్రీగా మారాడు. ఆ స్త్రీగానే మరో యువరాజును చూసి మోహించి వివాహం చేసుకున్నాడు. సకల సుఖాలను పొందాడు. శాపమిచ్చిన ముని వెతుక్కుంటూ వచ్చి 'రాజా నీ స్త్రీ రూపం నుంచి పురుషుడిగా



మళ్ళీ మారుస్తానని' చెప్పాడు. దానికి ఆ స్త్రీ 'వలదు... సాంగత్యంలో మహా సుఖం అనుభవించేది పురుషుడనుకున్నాను. కాదు... స్త్రీ అని తెలిసింది. కాన ఈ స్త్రీ శాపాన్ని శాశ్వతం చేయండి. భర్త ద్వారా స్త్రీ పొందే సుఖం... సకల దేవతల్లో అత్యంత భోగవిలాసాలను పొందిన ఇంద్రుని పదవి అనుభూతి కన్నా గొప్పదని ఆ మునితో చెప్పాడు.

## ప్రేమలో పడితే అందం పోవటం ఖాయం

ముత్యాలని చూస్తే చాలు వాటి విశిష్ఠత తెలుస్తుంది. అలాంటి వ్యక్తుల విశిష్ఠతే ప్రేమలో పడేలా చేస్తుంది. ప్రియురాలు ప్రియుడు ఒకరి గురించి ఒకరు ఆలోచిస్తూ గడుపుతారు. విరహం మరింత ఎక్కువవుతుంది. నిద్రరాదు. దాంతోకనుల క్రింద నలుపు వస్తుంది. పెదాలు తెల్లబడతాయి. మాటి మాటికీ నిట్టూర్పులు. పదిమందిలో ఇబ్బంది.. నిట్టూర్పులూ, ఆలోచనల వల్ల శరీరం వన్నె తగ్గుతుంది. అకాలంలో నిద్రించటం వల్ల అవమానం జరిగినట్టు మొహం మారుతుంది. మనవేమీ నలచక్రవర్తి, దమయంతులము కాదు. రాచకార్యాల వేదన వల్ల వన్నెతగ్గిందనీ, కనుల కింద నలుపు.... నా వజ్రపు ఆభరణాల కాంతి నీడ పడుతుందని తప్పించుకోవటానికి. దమయంతి నలుని ఆలోచనల పరవశంతో లేత అరటి ఆకులపై పయనించేది. చల్లని పైపూతలను పూయించుకునేది. ప్రేమలో పడి లేదా కామంలో పడి అన్ని కష్టాలు తెచ్చుకోవటం అవసరమంటారా?



## అశోకవృక్ష మహత్యం

- ఈ వృక్షం ఉన్న పరిసరాల్లో శోకం వుండదు.
- అశోక వృక్షానికి నమస్కరించినంతనే వరాలనిస్తుంది. జయాలని కలిగిస్తుంది.
- దాని నీడ శరీరం మీద పడినంతనే స్త్రీల ఋతుక్రమమును సరిచేస్తుంది.
- ఆదిపరాశక్తికి ప్రతీక ఈ సీతాఅశోక వృక్షం.
- సంస్కృతంలో ఈ వృక్షం పేరే 'శోకనాశనః'.
- రావణుడి చెరలోనున్న సీతమ్మ తల్లి శోకాన్ని ఈ వృక్షమే తగ్గించి ఆమెని ఓదార్చింది.

**సృష్టి మొత్తంలో అతిమెత్తనైనది దిరిసెన పూవు. అంతకు మించిన సుతిమెత్తనైనది స్త్రీ మనుసు. ఆ మనసును హత్తుకోవాలంటే మగాడి మనసు దిరిసెన పూవంత సుతిమెత్తగా వుండాలి.**

## ధనవృద్ధికి అరటి ఆకు భోజనం

మహాబలశాలి హనుమకి ఆకుపూజ చేయించి, గృహంలో అరటి ఆకుపై పసుపు చల్లి ఆపై వేడి, వేడి అన్నం పెట్టి దానిపై ఆవునేయి వేసి ఆ పక్కనే ఉసిరి పచ్చడిని పెట్టి అయిదు నిమిషాల పాటు మూటలా చేసి ఆపై నైవేద్యం పెట్టి భుజిస్తే ధనవృద్ధి. అలాగే గల్లాపెట్టెలో గచ్చకాయని ఉంచండి. ఎగ్గొట్టేవాడు అప్పు అడగటానికి భీతి చెందుతాడు.



## దమయంతి అందమెంత గొప్పది

- లోకంలోని స్త్రీలందరిలోకెల్లా అందగత్తె.
- ఆమె తల వెంట్రుకలు శివుడు కూడా మెచ్చుకునేలా వుంటాయి.
- ఆమెతో జింకలు పోటీపడి చూసినందుకేమో... జింకలేవీ తమ చూపులు ఒక చోట నిలపి వుంచవు ఇప్పటికి.
- దమయంతిని చూసి చంద్రుడూ కళలను కోల్పోయ్యాడు.
- బ్రహ్మదేవుడు చంద్రబింబంలోని సారాన్నంతటినీ తీసి ఆమె ముఖబింబాన్ని తయారు చేశాడు.
- ఇక కనుబొమలు రతీమన్మథుల వింటివలే ఒయ్యారాలు ఒలక బోస్తుంటాయి.
- కుచములేమో సముద్రంలో ~~ఈదుతున్న~~ కామయౌవనములే.
- నడుము పిడికిలంత.
- కురులు చూస్తే చాలు కౌళీవాంఛలు కెరటంలా లెగుస్తాయి.
- చేతులు కలువతూడుల వంటి కోమలములు.
- పాదాలు పద్మాలే...
- వేయి మాటలెందుకు... అరమగ్గిన దానిమ్మపళ్ళ వంటి ద్వయం గల దమయంతిని వర్ణించటం బ్రహ్మదేవునికైననూ, సరస్వతికైననూ సాధ్యపడదు.
- నలుడితో బంగారు రాజహంస



## కూరగాయల్లో కాకరకాయ రారాజు

క॥ వేయారువగల కూరలు
గాయలనేకములు ధాత్రిగలవందులలో
నాయకములు రాకాకర
కాయలు మరి కుందవరపు కవిచౌడప్పా.

ఎన్ని రకాల కాయగూరలున్నా... కాకరకాయది అగ్రస్థానమే. చూడటానికి ఎలా వున్నా ఆరోగ్యాన్నిచ్చేది కాకరకాయ. అంటే కాకరకాయంటే ఆరోగ్యం.. ఆరోగ్యముంటేనేగా ఏదైనా సాధించేది... పొందేది... ఇచ్చేది.

**మగాడుఎంగిలి పడకుండా.. ఇంద్రుడే వచ్చి భిక్షాందేహి అన్నా భిక్ష పెట్టకూడదు. మగువకు మగని తర్వాతే ఎంత పెద్ద అతిథయినా.**

**- కౌశికుడితో ఓ మహాఇల్లాలు.**

**భర్త తల్లి, తండ్రి అనగా అత్తమామల ఆశీర్వచనం మాంగల్య సంపద చిరకాలం వుండేలా, దాంపత్య సుఖాలని అనుభవించేలా చేస్తుంది.**

**- సావిత్ర్యుపాఖ్యానం నుంచి**

## పుణ్యాంగన అనే స్త్రీ లక్షణాలు

కన్న కొడుక్కి, భర్తకి, భర్త అన్న కొడుకులకి, తన పుట్టింటి వారికి, భర్త ఇంటి తరుపు వారికి ఒకే రకమైన భోజనాన్ని పెట్టే స్త్రీ పుణ్యాంగన అని శాస్త్రం చెబుతోంది.



## సావిత్రి భర్త ప్రాణాలను యమధర్మరాజు నుంచి ధర్మబద్ధంగా (సంతానతిని అవ్వాలని వరమడిగి కాదు) తీసుకుంది.

మొదటి వరం ద్వారా తమ మామగారైన ద్యుమత్సేనుడికి కనులు వచ్చేలా వరం కోరుకుంది.

రెండవసారి సమవర్తి అనగా యముడు సావిత్రిని సత్యవంతుడి ప్రాణం తప్ప ఏ కోర్కె అయినా కోరుకోమన్నాడు... అంతట ఆమె తన మామగారి రాజ్యం తిరిగి లభించేలా చేయమంది.

ధర్మంగల సావిత్రికి యమధర్మరాజు ఇచ్చిన మూడవ వరం ఆమె తండ్రిగారైన అశ్వపతికి వందమంది కొడుకులు కలిగేలా ఇచ్చాడు. అప్పుడు సావిత్రి, సమవర్తితో....

'ఎన్ని వరాలు లభించినా సతికి భర్తను ఆశ్రయించి

ఉండటంలో సరితూగవు. ఏడు మాటలు మాట్లాడితే బంధువులవుతారు. కాన ఓ సమవర్తీ... నీవు బంధువు'వి అనటంతో 'భర్త ప్రాణం తప్ప' అని అనకుండా ఏం వరం కావాలో కోరుకోమంటే... సావిత్రి స్వచ్ఛందంగా 'మగాడి యెడబాటు మగువకు భరింపరానిది. కాన సాళ్వభూపతి పుత్రుడైన నా భర్త సత్యవంతుడి ప్రాణాలు వెనక్కి ఇచ్చేయమని' కోరుతుంది. ఆ క్షణంలోనే యమధర్మరాజు సత్యవంతుడి ప్రాణాలను ఇచ్చేస్తాడు.



## అరటి తోటలో హనుమద్వ్రతము

మార్గశిర మాసంలో శుద్ధ త్రయోదశినాడు అరటి తోటలో ఈ వ్రతం చెయ్యాలి. సమస్యలతో, గొడవలతో, విధివల్ల దూరమైన అన్నదమ్ములూ, భార్యాభర్తలూ, సంబంధించిన వ్యక్తులు దగ్గరవుతారు. విడిపోయిన దంపతులు కలుస్తారు. అన్నదమ్ములు ఏకమవుతారు. శనిదోషాలు పోతాయి. ఈ వ్రతంలో కేవలం పసుపు రంగు దుస్తులు ధరించటమే కాక పుసుపు రంగు పూలతో పూజించాలి. పసుపు రంగు వంటకాలను నైవేద్యంగా పెట్టాలి.

## రెండవ నారాయణుడు

క॥ పరవిత్తము గోమాంసము
పరసతి తనతల్లియనుచు భావించిన యా
నరుడు నరుండా రెండవ
కరివరదుడె కుందవరము కవిచౌడప్పా.

పరాయి సొమ్మును గోమాంసంగానూ, పరస్త్రీని కామంతో చూడక తన రక్తసంబంధీకురాలుగా చూసేవాడు రెండవ నారాయణుడేనని కవిచౌడప్ప పద్యభావము. ఎంత గొప్పది ఆ భావము. మగవాళ్లందరూ అలా ఆలోచిస్తే స్త్రీ ఎంతో సంతోషిస్తుంది.

## ఈ ఆరు చాలు నలుగురి నోట్లో నానటానికి

పొగతాగేవాడి బ్రతుకు... పొగిడినా ఇవ్వని ధనపరుడు.. మగాడు ఏలుకోని ఆడది... ముసలోడిని కట్టుకున్న ఇల్లాలు.. పరపురుషుడితో గంటలకొద్ది మాట్లాడే ఆడది...డబ్బు కోసం చేయి జాపిన ఆడది... తక్కువవ్వటం.. నవ్వుల పాలవ్వటం తప్పదు.



## నూతన వధూవరుల చేత పేర్లెందుకు చెప్పిస్తారు

వధువు పేరు వరుడి చేత, వరుడి చేత వధువు పేరు చెప్పిస్తుంటారు. హారతిలో డబ్బుల కోసమో... ఆట కోసమో కాదు అలా చేయించేది. నూతన వధూవరులే కాదు ఎవ్వరూ కూడా ఎవరి నామధేయాన్ని వారు చెప్పకూడదు. అలా చెబితే పలికితే రతీమన్మథుల పట్ల దోషం ... ఆ దోషం వల్ల కొంత వియోగం ఏర్పడుతుంది.

## అడ్డంగా వెన్ను పూసుంటేనే వావివరుస, సమయాలు మరిచి సంభోగించేది

వెన్ను పూస అడ్డంగా వుండే ప్రాణులు అనగా కుక్క... నక్క.. ఎలుక ఇత్యాదివన్నీ. అవి ఏ మసయంలోనైనా, ఎవరితోనైనా పొందు కోసం ప్రాకులాడతాయి. కానీ ఒక్క మనిషి వెన్ను పూస మాత్రమే నిలువుగా వుంటుంది. అట్టి మనము ఒక్కరితోనే మైథున శృంగార కార్య కలాపాలు చెయ్యాలన్నది శాస్త్రం. అట్లా కాకుండా చేస్తే మళ్ళీ అలాంటి అడ్డంగా వెన్ను పూసుండే జీవుల్లా జన్మించాల్సి వుంటుంది.

## ఒట్టు ఎలా వేయించుకోవాలి

రహస్యాలని కాపాడటం.. వ్యసనాలని మానెయ్యటం.. ధనం తిరిగి ఇస్తానని ఒట్టు వేయటం వంటిది అందరి చేత వేయించుకోకూడదు. తల్లి, తండ్రి, గురువులని అడగకూడదు. ప్రియురాలి దగ్గర మాటే ఒట్టు. భర్త దగ్గర ఒక ఒట్టు వేయించుకోవాలి. ధనం ఇచ్చేవాడి దగ్గర రావిచెట్టును తలచుకుని రెండు ఒట్లు వేయించుకోవాలి. స్నేహితుడి దగ్గర మూడుసార్లు



ఒట్లు వేయించుకోవాలి. చిన్నతనంలో, వివాహం కాకుండా ఒట్టు వేయకూడదు. ఒట్టు వేసేటప్పుడు మనసులో ఒట్టు తీసి గట్టు మీద పెట్టానని లోలోన అనుకుంటూ ఒట్టు వేస్తారు. అందుకే రెండు సార్లు వెంటవెంటనే వేయించుకునేది.

## ఎవరికేం ఇష్టం

- ఇల్లాలికి మొగుడంటే ఇష్టం... ఆపై ఇంటి శుభ్రత అంటే ఇష్టం.
- దాయాదులకి దావాలిష్టం.
- భోజన ప్రియులకి భోజనంలోకి నెయ్యంటే ఇష్టం.
- పాదాలకి చెప్పులిష్టం, కొత్త దంపతులకి రాత్రంటే ఇష్టం.
- ఏకాదశికి ఉపవాసమిష్టం.
- మంచానికి నవారు బిగించి కడితే ఇష్టం.
- ఏనుగుకి దంతాలిష్టం.
- కాంతకి ఆభరణాలిష్టం, పుట్టింటికెళ్ళటం ఇష్టం... (పది నిమిషాల్లో బ్యాగ్ రెడీ.. అదే ఎక్కడకయినా వెళ్దామంటే గంటలే. భర్తకి సర్దే బ్యాగ్‌లో ఒక్కటి కూడా మర్చిపోకుండా పెట్టే స్త్రీ ఎవ్వరైనా వుంటే ఆమెకి నమస్కరించాలని నా కోరిక. అదే పుట్టింటికి వెళ్ళేటప్పుడు తన బ్యాగ్‌లో మొత్తం అన్నీ వుంటాయి. ఒక్కటీ మిస్ అవ్వదు.)
- కొప్పు ముడికి ఊడేంత గాఢంగా ముద్దు పెట్టుకుంటే ఇష్టం.
- స్త్రీకి చమత్కారమంటే ఇష్టం.
- రాగాలకి కాంభోజి రాగమంటే ఇష్టం.
- ఆకలికి అన్నపు గడ్డష్టం.
- వేశ్యలకి ధనమిష్టం.



- శరీరానికి గంధమిష్టం.
- సన్యాసికీ, బ్రహ్మచారికీ, విధవకూ, గుర్రానికీ ఎప్పుడూ మైథునధ్యాసిష్టం.
- ఆడదాని ఎదకు పైటిష్టం.
- పనివాడికి అధికారి మెత్తగా వుండటమిష్టం.
- మగబుద్ధికి అది వయసుకత్తెది కాకపోయినా... ముతకైనా... జారిపోయినా.... ఆడదయితే చాలు.. చెట్టుకి చీరకట్టినా మగబుద్ధికి అనిపిస్తే ఎదురెవరున్నా వాళ్ళకిష్టమే..... (అందరికీ కాదు....)

(కవి చౌడప్ప పద్యతాత్పర్యాల నుంచి)

## కదంబ వృక్షం కింద చేసే జపం...

- శమీవృక్షం పాండవుల ఆయుధాలను భద్రం చేసినట్టు కదంబ వృక్షం కింద జపము ఫలాన్ని పూర్తిగా మీకోసం భద్రపరుస్తుంది.
- కదంబ చెట్టు పూజ, దాని కింద జపము ఎంత ఉన్నతమో, ఎంత పరిపూర్ణమో సౌందర్యలహరీ, శ్రీకృష్ణకర్ణామృతం వంటి పుణ్యగ్రంథాల్లో వివరించారు. కదంబ వృక్షమంటే దేవతలు తమ చైతన్యాన్ని దాచుకునే దివ్యవృక్షం.

**‘కదంబ వనవాసిని కామితార్థ దాయినీ**
**ముదందేహి మునీంద్రనుతే మురహరి సహజాతే’**

పై శ్లోకాన్ని కదంబవృక్షం చెట్టుకి నమస్కరించి పఠించండి. మీలో మహా చైతన్యం కలుగుతుంది.



## సంతానం కలగకపోవటానికి

పూర్వజన్మలో తల్లి, తండ్రికి తగు శ్రాద్ధ క్రియలు చేయకపోవటం వల్ల ఈ జన్మలో ఎంత ప్రయత్నించినా సంతానం కలగకపోవటానికి కారణం కావచ్చు. పితృదేవతల ప్రీతికొరకై తీర్థ యాత్రలు.. విధులు చేయిస్తే ఫలితం వుంటుంది. అష్టమి, చతుర్ధశి, అమావాస్యలలో దైవచింతనతో గడపటం చేయాలి.

**జక్కన పిట్టలకు రాత్రి పూట కనులు కనిపించవు. కామంతో వున్న వాడికి పగలు కూడా కనిపించవు.**

**పురుషుడికి అనేక మంది స్త్రీలపై కామం మాత్రమే వుంటుంది. ప్రేమ వుండదు. అలాగే స్త్రీలకు అనేక మందితో సన్నిహిత్యం ఉన్నా కామమూ, ప్రేమా రెండూ వుండవు. అలాగే పరస్త్రీ వ్యామోహం వున్న పరుషుడ్ని కలవటం కంటే చావటం ఉత్తమం అనుకుంటుంది భార్య.**

**- మనుచరిత్ర నుంచి.**

## అష్టవిధనాయికలు

**స్వాధీనపతిక :** కొంగున ముడేసుకున్న తన భర్త పక్కనే వున్నాడన్న స్వాతిశయం, సంతోషంతో వెలిగిపోయే నాయిక. రతిలో నుదుటిన చెదిరిన తిలకాన్ని కూడా నాయకుని చేత సరిచేయించుకునేది స్వాధీనపతిక.

**వాసక సజ్జిక :** అందాలని ఇనుమడింపచేసే ఆభరణాలను ధరించి దూరతీరం నుంచి వచ్చే నాయకుడి కోసం నిరీక్షిస్తూ, పడకగదిలో పూల అలంకరణలు చేసుకుని నాయకుడి కోసం ఆపై లభించే మధురానందాల గురించి నిరీక్షించేది.



**విరహోత్కంఠిత** : పానుపు నుంచి వరండా వద్దకూ, వరండా నుంచి పానుపు వద్దకూ విరహవేదనతో అల్లల్లాడుతూ... తత్తరపాటుతో, మనస్తాపంతో విరహంతో వేగిపోతూ కనులు పెద్దవి చేసి, అలికిడయితే చాలు నాయకుడు వచ్చాడేమోనని ఆశగా చూసేది.

**విప్రలబ్ధ** : వస్తానని ఆశపెట్టి, మరులు గొల్పి ఎంతకీ రాకపోయేసరికి తాను రమ్మన్న చోటికి వచ్చినా నాయకుడు రానందుకు... నాయకుడు తనని నమ్మించి మోసం చేసినందుకు నిర్వేదనకు గురై చూసి చూసి చింతించి ఆభరణాలను పీకిపారేసేది.

**ఖండిత** : తన అనుకున్నవాడు మరో స్త్రీతో కులుకుతున్నాడని తెలుసుకొని రాత్రంతా రాసలీలలు నడిపి అలసిసొలసి వచ్చిన నాయకునిపై విరుచుకు పడే నాయకి, కోపాగ్నితో రగిలిపోతూ ప్రియుడ్ని వూపేసేది ఖండిత.

**కులహాంతరిత** : ప్రణయ కోపంలో ఏదో అంటే కోపించి వెళ్ళిపోయే నాయకుడ్ని చూసి వేదన పడుతూ తన చపలత్వము వల్ల గృహాన్ని వదిలిపోయిన ప్రియుడ్ని తలుచుకొని దుఃఖించేది.

**ప్రోషిత భర్తృక** : వచ్చేస్తానని చెప్పి చెప్పిన సమయానికి రానందుకు వ్యథ చెందుతూ... 'ఏనేనా... నేను గుర్తుకురానా... అయితే ఎందుకు రాలేదు..' అని ఆలోచిస్తూ అలంకరణలు లేకుండా... సఖులు సర్ది చెబుతున్నా దుఃఖంతో ప్రియుణ్ని తలచుకుంటూ వుండే నాయకి ప్రోషిత భర్తృక.



**అభిసారిక :** ఎంతమంది చెప్పినా లెక్కచేయక, నియమాల్ని అతిక్రమించి ఎన్ని అడ్డంకులొచ్చినా అధిగమించి ప్రియుడు చెప్పిన సంకేత సంగమ స్థలం వద్దకు వెళ్ళే నాయకి.. పాములడ్డం వచ్చినా మెరుపు మెరుపుతో చూసుకుంటూ ప్రియుణ్ని చేరటమే లక్ష్యం గల పడతియే అభిసారిక.

## దీపావళికి ముందు ధన్వంతరీ పూజ

❀ ధనత్రయోదశి అనగా దీపావళికి ముందు వచ్చే త్రయోదశి నాడు సాయంత్రం పూట ఈశాన్యంలో గానీ, గృహద్వారం వద్ద దీపాలు పెట్టి ధన్వంతరిని పూజిస్తే కుటుంబమంతటికీ ఆయరోరాగ్యాలు సిద్ధిస్తాయి. ధనం కోసం... కోర్కెల కోసం మాత్రమే కాదు ఆరోగ్యం కోసం సంవత్సరంలో ఒక్కసారైనా ధన్వంతరి పూజ చేయండి. ఎంతసేపటికీ ధనం.. భూములు, పిల్లల బాగోగుల గూర్చి, మొగుడు మారటానికే కాదు. క్షీరసాగర మథనంలో జన్మించిన ధన్వంతరి శ్రీమహావిష్ణువే. ఆయన అకాల మృత్యువుని దూరంగా వెళ్ళమని శాశిస్తాడు.

## తాత్కాలిక సుఖాలనిచ్చేవి

- ❀ అబద్ధాలతో తప్పులు కప్పి పుచ్చుకోవటం.
- ❀ నోరేసుకుని బ్రతికేయటం.
- ❀ ఏడ్చి వాదనలనీ, కార్యాన్నీ చక్కబెట్టుకోవటం.
- ❀ బెదిరించి పబ్బం గడుపుకోవాలనుకోవటం.
- ❀ 'కానీయ్... కానీయ్' అంటూ సాగతీయటం.
- ❀ పదిమందినీ కలుపుకుని వాళ్ళకి 'మీ'లో నచ్చేవన్నీ ఇచ్చి తన వైపుకి తిప్పుకోవటం.



ఆ పదిమందీ వున్నారనుకొని అహంతో నేరుగా ఏదో ఒక రోజు పులి గుహలోకే వెళ్తారు. భార్యా బిడ్డల రాత బాగుంటే... ఆ పులి అప్పుడే భారీగా తిని వుంటే పర్వాలేదు.. లేకపోతే అలాంటి వాళ్ళ గురించి చెప్పటానికి చరిత్ర వుండదు.

## కోపాన్నీ, ద్వేషాన్నీ నవగ్రహాలకి నైవేద్యంగా సమర్పించండి

దేవతలకి యజ్ఞాలు చేస్తే శక్తి... అలాగే మనుజులు చేసే పాపాలకి శిక్ష విధించాలంటే నవగ్రహాలకీ ఎంతో శక్తి కావాలి. అందుకే కోపాన్నీ, ద్వేషాన్నీ నవగ్రహ ప్రదక్షిలు ఇరవై ఒక్కసార్లు చేసి అర్పించండి. వశిష్ఠుడు కోపాన్ని వదిలేసినవాడు. విశ్వామిత్రుడు కోపగుణం కలవాడు. ఇద్దరిలో ఎవ్వరు గౌరవ మర్యాదలు, కీర్తి, మహా సుఖాలను అనుభవించారు? విశ్వామిత్రుడికి తన జీవితమంతా వశిష్ఠుడి కన్నా తాను గొప్పవాడినవ్వాలనీ, బ్రహ్మర్షి అవ్వాలనీ తపించటంతోనే సరిపోయింది. కానీ మీ ధన సంబంధిత విషయాల్లో తేడా వస్తే కోపం తప్పని సరి. ఆ విషయం నవగ్రహ అర్పణమప్పుడు చెప్పండి. మిమ్మల్ని చూస్తే మాల వేసుకున్న అయ్యప్ప అనిపించాలి. తేడా వస్తే... అనగా మాల తీస్తే ఏం జరుగుతుందో కూడా తెలియాలి.

## శివాలయంలో ఒక్కటైనా నాటండి

అష్టబిల్వాలతో శివపూజలను అందరూ చేస్తారు. శివ అనుగ్రహం పొందుతారు. కానీ ఈశ్వరునికి పూజ చేసేవారికన్నా అష్టబిల్వ వృక్షాలను శివాలయంలో నాటేవారంటే అత్యంత



ప్రీతికరం. బిల్వ, వెలగ, నిర్గుండి, ఉసిరి, గరిక, తులసి, జమ్మి, ఉత్తరేణి.. ఏదైనా సరే ఓ మొక్కని నాటి సాయంత్రం సంధ్య వేళలో శివదర్శనం చేసుకొని కోర్కె లేదా సమస్యని చెప్పండి. అలాంటి రోజు శ్రీవిష్ణుసహస్రనామాన్ని చదివిన భీష్మఏకాదశి అంతటి ప్రశస్తమైన రోజుగా పరమేశ్వరుడు పరమానందం చెంది అనుగ్రహిస్తాడు. ఎన్నో పూజలు, అభిషేకాలు... ప్రదక్షిణలు... దానాలు.. ఎన్ని చేసినా ఫలం రావటం లేదు... అవ్వటం లేదని బాధపడుతుంటారు. దేవాలయానికి అనగా స్వామికి కావాల్సిన పూల మొక్కలని ఎక్కడైనా నాటారా... నీళ్ళు పోశారా?

## ఆదిత్యుని ఏడు అశ్వాలు

ఎర్రటి జయ అశ్వం శక్తినీ.. నారింజ రంగు అజేయ అశ్వం తెలివినీ.. పసుపు రంగు అశ్వము విజయ ధర్మ ప్రవర్తననీ, ఆకుపచ్చ అశ్వము జితప్రాణి సాటి జీవుల యందు దయనూ, నీలము వర్ణం గల జితకర్మ జ్ఞానాన్నీ, ఊదారంగు గల మనోజన నిజాయితీనీ, నేరేడు రంగు గల జిత క్రోధ వాత్సల్యాది గుణాలని సూచిస్తుంది. ఆదిత్య పూజలు, అశ్వాలను తలచుకుని ఆ దోషాలను పోగొట్టుకోండి.

## నక్షత్రం తెలియని వారు ఏ మొక్కను నాటడం ద్వారా దోషాలు పోయి సంపదలు వృద్ధి అవుతాయి

'చూ... లా... చే' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు కదంబం లేదా అడ్డసరం.

'యో.. బా... చీ' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు రావి లేదా వేప.

'లీ... లూ.. లే' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు అవిశ లేదా గరుడలత.



'అ... ఈ... ఊ' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు అల్లనేరేడు లేదా బిల్వ

'వా...వీ... వు' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు ఖదిర లేదా ఇప్ప.

'కూ...చా..కొ..హ' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు వెదురు లేదా కదంబ.

'నా...నీ..నూ..నె' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు పొగడ లేదా కుంకుడు.

'తీ...తూ..తే..తో' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు జువ్వి లేదా వేప.

'రూ...రే...రొ...ర' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు మోదుగ లేదా నాగలింగం.

'పె..పొ...రా...రీ' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు బిల్వం లేదా చామంతి.

'పూ...ష...ణా...త' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు మందార లేదా జువ్వి.

'మో...మై...టా...టీ...టూ..ట' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు మర్రి లేదా విరజాజి.

'డి...డూ...డే...అ' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు నాగలింగం లేదా సన్నజాజి.

'కే...కొ..హ...క...హి' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు మునగ లేదా వెదురు.

'బూ..ధా...ష..ధ' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు నిమ్మ లేదా బంతి.



'దే..దో....థ....చా...చి' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు ఇప్ప లేదా అరటి.

'దు...శ...ఝ..దా' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు రావి లేదా వేప.

'సే...సా..ద...దీ' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు మునగ లేదా అరటి.

'గో...సా..సీ...సు' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు పనస లేదా మల్లి.

'జే..బో...జా...జీ' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు వేప లేదా జిల్లేడు.

'గా...గీ...గూ...గె' ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు జమ్మి లేదా అశోక.

పై ఇంటి పేరు ప్రథమాక్షరం గలవారు ఆయా మొక్కలను నాటడంతో పాటు నీరుపోసి సంరక్షించండి. ఆ సంరక్షణలో భాగంగా ఆ వృక్షమొక్క పెరుగుదలతో పాటు ఆ మొక్క లేదా వృక్షం యొక్క శక్తి మీకు కలిగి శక్తి, ఆలోచనలు కలిగి సుఖాలు, ధనం కలుగుతాయి. నక్షత్రం, జాతకం ఇత్యాదివేవీ చూసుకోకుండా మంచి భర్త కోసం పూలమొక్కలనీ, అనారోగ్యాలు పోవటానికి వృక్ష మొక్కలనీ, ధనం సంపాదించటానికి మారేడు, బిల్వ, కదంబములను నాటాలి. వేదాల్లో, శాస్త్రాల్లో మొక్కలను నాటడం, వృక్షాలను పూజించటం గురించి ఎంతో ప్రస్ఫుటంగా చెప్పి వున్నారు. పూజలు చేసేటప్పుడూ, యజ్ఞాలు చేసేటప్పుడూ అనేక తప్పు మంత్ర శబ్దాల వల్ల దోషాలు కలిగి పుణ్యం బదులు కష్టాలు రావటానికి



ఆస్కారం వుంది. అదే వృక్ష పూజ వల్ల గానీ, మొక్కలను నాటడం వల్ల గానీ ఎలాంటి దోషమూ తగలదు. మీ నక్షత్రానికి, మీ జాతకానికి, మీ ఇంటి పేరుకి సంబంధంలేని మొక్కలను నాటిన ఎలాంటి మానసిక ధన నష్టాలు ఉండవు.

## ఎదురొచ్చేవాళ్ళని....

విహారప్రదేశాలకి కావచ్చు.. పెళ్ళి పనుల కోసం కావచ్చు.. తీర్థయాత్రలకి కావచ్చు.. కొబ్బరికాయ కొట్టి హారతి ఇచ్చి... ఎదురొచ్చిన వారిని ముందు సీట్లలో కూర్చోబెట్టాలి. వెనకెక్కడో పడెయ్యకండి. ఎందుకంటే అందర్నీ రక్షించే శక్తి కొబ్బరికాయ కొట్టి హారతిచ్చి ఎదురొచ్చిన వాళ్ళకి వుంటుంది. నది దాటకుండా వెళ్ళే ప్రదేశాలప్పుడు భార్య ఎదురు వస్తే ఎంతో మంచిది.

## శత్రువు తొమ్మిది తప్పులని మాత్రమే క్షమించాలి

పదో తప్పు చేసే అవకాశం ఇస్తే మీరుండరు. మీ భార్యా బిడ్డలు రోడ్డున పడాల్సి వస్తుంది. మహిషాసుర సంహారాన్ని తొమ్మిది రోజులకి దుర్గాదేవి అందుకే పూర్తి చేసింది. తొమ్మిదో రోజుకే ఆమె అలిసిపోయి పడిపోయింది. బతుకమ్మ బతుకమ్మ అని ముక్కోటి దేవతలు పూజలు చేశారు. తిరిగి మహాశక్తిని శక్తిమయం చేశారు. మనం దుర్గాదేవి అంత శక్తిమంతులం కాము. కాన శత్రువులు తప్పులు చేస్తుంటే.. నష్టం వస్తుంటే ఎక్కువ సమయం ఇవ్వద్దు.... చెద పురుగుల్లా లక్షల్లో అనగా లక్షల సమస్యలు మిమ్మల్ని చుట్టేస్తాయి. తేరుకోవటానికి తొమ్మిదేళ్ళు పడుతుంది. అప్పటికే అంతా అయిపోతుంది. కాన నష్టం చేసే శత్రువుకి ఒకటి.. లేదా రెండు మాత్రమే... ఆపై ధర్మబద్ధంగా ఎదుర్కోవటమే పనిగా పెట్టుకోండి.



**1179 ఉపనిషత్తుల సారంశము శ్రీ భగవద్గీత. ఆ శ్రీభగవద్గీత పద్దెనిమిది అధ్యాయాలు. శ్రీకృష్ణుడు అర్జునుడంతటి వాడికి బోధించటానికే, అర్థం అయ్యేలా చేయటానికి పద్దెనిమిది అధ్యాయాలు చెప్పాల్సి వచ్చింది... కాన బోధించే వానికి ఓపిక ఉండాలి.**

## మగాడికి సూదిమోపినంత స్థలం ఇస్తే....

చిక్కుడికి ఆధారం దొరికితే ఎక్కడికైనా పాకేస్తుంటుంది. మగాడూ అంతే చిన్న అవకాశం ఇస్తే చాలు అల్లుకుపోతాడు. చిక్కుడికి పాదు ఎక్కడో తెలియనట్టు.. అంతలా ఎలా ఆక్రమించాడో అర్థం కాదు స్త్రీకి. వయసుతో సంబంధం లేదు అవకాశం ఇవ్వాలే గాని అరవై దాటాక కూడా నేతిలో చిక్కుడు గింజలు వేయించుకుని తినయినా సిద్ధమయిపోతాడు. అక్కడ్నించి స్త్రీకి దుర్దశ ప్రారంభమవుతుంది.

## చంద్రుడు వృద్ధి చెందే రోజుల్లో

ఆకు కూరలు.. పండ్లను తినాలి.

అమావాస్య రోజుల్లో భూమి క్రింద పండినవి అనగా.. ముల్లంగి, క్యారెట్, బీట్‌రూట్, బంగాళదుంప వంటి వాటిని తినటం ద్వారా సుదీర్ఘ ఆయువుని పొందగలరని శాస్త్రం, మన పెద్దలు చెప్పారు. అందుకే పూర్వం పంటలను కూడా అలానే పండించే వాళ్ళు.



## శంఖునిధి... పద్మనిధి

## మీ ఆస్తులని కూడా రక్షించే దేవతలు

శ్రీవేంకటేశ్వరుని దర్శించుకునే ముందు వచ్చే మహాద్వారానికి ఇరువైపులా వుంటారు వీరు. గడప దాటేటప్పుడు శంఖనిధి.. పద్మనిధి పంచలోహ మూర్తులకి నమస్కరించండి. తిరుమల శ్రీ వేంకటేశ్వరుని సకలాభరణాలనీ, ధనాన్నీ, ఆస్తులనీ రక్షించేది వీరే. వారికి నమస్కరించి మీ ఆస్తులని కూడా దుర్మార్గుల కళ్ళ బారిన పడకుండా చూడమని ప్రార్థించండి. తిరుమల వెళ్ళినప్పుడు దర్శనం అవ్వగానే గబగబా బైటికి రాకుండా బైటికొచ్చే ముందు సువాసనా రాయి వుంటుంది. కోర్కె రాయండి.

## కడిమి చెట్టంటే సాక్షాత్తు...

వేపచెట్టుకి నమస్కరిస్తే శ్రీమహాలక్ష్మీదేవికి నమస్కరించినట్టుగా కడిమి చెట్టుకి నమస్కరిస్తే కనకదుర్గమ్మకి నమస్కరించినట్టే. ఆ పూలతో పూజంటే ఆ దేవికి ఎంతో ప్రీతి. శ్యామలా దండకంలో ఆ చెట్టు యొక్క ప్రశస్తి ఎంతో వుంది. అలాంటి చెట్టుని గృహంలో పెంచటమంటే సకల దుష్ట, నీచ.. నికృష్టుల ఘోషలూ, పీడలూ దూరంగా పారద్రోలినట్టే.



## కాలభైరవుణ్ని కౌగిలించుకుంటే

ద్రాక్షారామంలో కాలభైరవుణ్ని కౌగిలించుకుంటే సంతానం లేనివారికి సంతానం కలుగుతుంది. ఇక్కడ కాల భైరవుడు దిగంబరంగా వుంటాడు. ఈ ఆలయంలోని బావిలోని నీటిని మూడుసార్లు తలపై చల్లుకోండి. ఆ పరిసరాల్లో ఆ బావి మంచి నీరే చాలా మందికి ఆధారం...

**భైరవాయ నమస్తుభ్యం కల్పాంత దవానోపమ**
**మహాదేవస్య సేవార్థం అనుజ్ఞాం ధాతుమర్హసి**

## ఆరోగ్యం కోసం రోజూ రెండు ద్రాక్ష పళ్ళు

'ఓం నమశ్శివాయ' అని రోజూ పదకొండు సార్లు స్నానానంతరం ధ్యానించి పరమేశ్వర సమర్పణ అని రెండు ద్రాక్ష పళ్ళు అర్పించి అశ్వనీ దేవతలని తలుచుకుంటూ స్వీకరించండి. మంచి ఆరోగ్యాన్ని ఈశ్వరుడూ, అశ్వనీ దేవతలూ మీకు ప్రసాదిస్తారు.

## సరస్వతీదేవికి పనస చెట్టు దొన్నెలతో నైవేద్యాన్ని సమర్పించండి

సృష్టికర్త బ్రహ్మదేవుని ఇల్లాలు సరస్వతీదేవికి పనసచెట్టన్న ప్రీతికరం. దానికి కారణం పనస చెట్టు కాండం నుంచే వీణ, మృదంగం, కంజీర వంటివి తయారవుతాయి. సంతానోత్పత్తికి ఎంతో మూలాధారమైన ఈ పనస చెట్టు ఆకులని దొన్నలుగా చేసి తెల్లని పాయసం పరీక్షకు వెళ్ళే రోజున చిన్నారుల చేత దేవికి నైవేద్యం పెట్టించడమంటే సరస్వతిని తోడు పంపుతున్నట్టే.



## అశ్వత్థ వృక్ష మహత్యము

❀ సాలవనంలో బుద్ధ భగవానుడికి జ్ఞానోదయం కలిగింది రావి అనగా ఈ బోధి వృక్షం కిందే.

❀ వివాహం, సంతానం కావాలనుకున్న వారు నలభై ఒక్క రోజులు రావి చెట్టు చుట్టూ ప్రదక్షిణలు చేస్తే ఫలితం వుంటుంది.

❀ రావిచెట్టు గాలి స్త్రీలలో సంతానవంతులుగా అవ్వటాన్ని అడ్డం చేసే ఎన్నో దోషాలను పోగొడుతుంది.

❀ రావి చెట్టు... ధర్మం చెట్టు. అందుకే పూర్వం ఏ సమస్యనైనా ఈ చెట్టు కిందే చర్చించి తీర్పు చెప్పేవారు.

❀ రావిచెట్టు కింద అబద్ధం చెబితే విషరోగాల పాలవుతారు. అందుకే కొన్ని ప్రదేశాలలో రావిచెట్టు క్రింద నుంచుని ప్రమాణం చెయ్యమంటారు.

❀ శివ పంచాయతనంలో ఈ రావిచెట్టు శ్రీమహావిష్ణు సంకేతంగా చెప్పబడింది.

## ద్రాక్షారామం ఆలయాన్ని ఎలా దర్శించాలి

❀ ముందు వినాయకుడ్ని దర్శించండి.

❀ ఆపై క్షేత్ర పాలకుడైన శ్రీలక్ష్మీనరసింహ స్వామిని దర్శించండి.

❀ ఆలయంలోని సప్తమాతృకలని దర్శించండి.

❀ పక్కనున్న కుమారస్వామికి అభిషేకం చేయిస్తే సంతానం లేనివారికి సంతానం.. దాంపత్య సౌఖ్యం కూడా.



❀ వెనుక వైపున్న చిన్నగుడిలో మూడుసార్లు చప్పట్లు కొట్టి స్వామికి మీరు వచ్చారని విన్నవించుకోండి.

❀ దర్శన ప్రదక్షిణల సమయంలో మూల స్థంభం చుట్టూ మూడుసార్లు తిరగండి. ఆపై ఇనుప చువ్వల మధ్య నుంచి గోపురం పైనున్న త్రిశూలం చూసి నమస్కరించండి.

❀ ఆపై ద్రాక్షారామ స్వామిని దర్శించాలి.

❀ గోపురాన్ని ఆనుకొని వున్న ప్రదేశంలో ఓ అయిదు నిమిషాలు కూర్చొని ధ్యానించండి.

❀ అమ్మవారిని దర్శించినప్పుడు ఆదిశంకరాచార్యుల వారు స్థాపించిన శ్రీచక్రదర్శనం కూడా తప్పక దర్శనం చేసుకోండి.

## పెళ్ళికి దేవతలొస్తారు...

❀ బుధ, గురువారాల్లో వివాహం ఎంతో మంచిది.

❀ రాత్రి ముహూర్తం మరింత మంచిది.

❀ పెళ్ళి మండపానికి అరటి గెలలు, మామిడి ఆకులు ఇంకా అలంకరణలో కొబ్బరి మండలను ఉపయోగించండి.

❀ పెళ్ళి మండపం పైకి ఎవ్వరూ చెప్పులతో రాకుండా చూడండి.

కోట్లు ఖర్చు పెట్టినా ఆ జాగ్రత్తలను మాత్రం తప్పక పాటించండి. ఎందుకంటే వివాహానికి ముక్కోటి దేవతలు వస్తారు. వీక్షిస్తారు. మామిడి ఆకులు పునరుత్పత్తిని చేసే శక్తినిస్తాయి.



**సంతానం కోసం కార్తీకమాసంలో కృత్తికానక్షత్రం రోజున పదహారు దీపాలను వెలిగించండి. సుబ్రహ్మణ్యస్వామి ప్రీతి చెంది అనుగ్రహిస్తాడు.**

## కార్తీక మాస వనభోజనాల్లో తప్పని సరిగా వుండాల్సిన వంటకాలు

నేతి బీరకాయ, తీపి గుమ్మడి, ఉసిరి.... ఈ మూడు లేకుండా ఉసిరి వనంలో భోజనం చేసినా కార్తీకమాస వనభోజన ఫలితం వుండదు.

## కార్తీకమాసం శివ, విష్ణువుల మాసమే కాదు....

యమ మాసం కూడా-

పురాతన పూర్వకాలంలో ఓ నాస్తికుడి రాజ్యంలో కొన్ని నెలల్లోనే అసంఖ్యాకంగా జనాలు యమలోకం చేరసాగారు. దాంతో రాజు మనస్థాపానికి గురై ప్రజల ఆగ్రహాన్ని చవిచూసి మహా ఋషులని పిలిపించాడు. కారణం అడిగాడు. వారు అంతా శోధించి... ఆ నాస్తిక రాజుకు దైవమహిమ చెప్పినా అర్థం కాదని... 'మహారాజా.. కార్తీకమాసంలో ఎవ్వరూ మంసాహారం ముట్టరాదు. రోజూ ఆవునేతితో దీపం వెలిగించాలి. దీపం వెలిగించి స్వామికి నమస్కరించి ఆపై ఆకాశానికి రెండు చేతులూ ఎత్తి నమస్కరించాలి అని చెప్పారు. రాజు శాసనం చేయించాడు. అలా కార్తీక మాసంలో మరణాలు ఆగిపోయాయి. యముడు తన కోరలను బైటపెట్టి ఆశగా ఎదురు చూసే మాసం అది. కావున కార్తీక మాసంలో దీపం వెలిగించటం వల్ల శరీరంలోని రక్తంలో అడ్డులేర్పడవు'. కుటుంబం మీద ప్రేమ వుంటే మాంసాహారం ఆ మాసంలో పూర్తిగా మానండి.



## ముక్కోటి దేవతల్లో అమ్మ కూడా వుంది

❀ 'నీకు తెలీదు లేమ్మా...' ఈ వాక్యం. ఒక్కసారి వెనక్కి వెళ్తే... మీకు లాలిపోయటం, గోరు ముద్దలు తినిపించటం.. శుభ్రత నేర్పటం.. సంస్కారం నేర్పటం.. రోడ్డుకి ఏ పక్క నడవాలో కూడా చెప్పిన అమ్మ... మీకెలాంటి భాగస్వామి కావాలో ఏరికోరి కూర్చి తన జ్ఞానాన్ని, అనుభవాన్ని రంగరించిన తల్లితో 'నీకు తెలీదులేమ్మా...'. అమ్మకి తెలీకపోతే పరమేశ్వరుడికి మాత్రం ఏం తెలుస్తుంది. ఒకటికి రెండుసార్లు చెప్పేది ఛాదస్థంతో కాదు.. తప్పటడుగు వేస్తుంటే సరిదిద్ది చెప్పేది, చెప్పిందే తల్లి. ఇప్పుడు పిల్లాడు కాదుగా.. ఎక్కడ తప్పటడుగు వేసి పడతాడో... అదిలించటానికి అడ్డాల నాటి బిడ్డడు కాదుగా. గడ్డాలవాడికి గట్టిగా ఏం చెబుతుంది. అందుకే విసుక్కున్నా మళ్ళీ చెబుతుంది. ముక్కోటి దేవతలలో అమ్మ వుంది. అలాంటి తల్లితో......!? నీకు తెలీదులే అనటం కన్నా పెద్ద తప్పు మరొకటి వుండదు. అమ్మ మాట మీరని వారు దేవతలవుతారు.

**సమస్యలూ, దిగులూ, బాధలూ, కోపాలూ వున్నవారు అమావాస్య రోజు, వీలయితే ఆదివారం అమావాస్య రోజు ప్రత్యంగిరా దేవతకి నిమ్మకాయలతో మహా పూజను చేయించండి.**



## శ్రీలక్ష్మీనారసింహస్వామి చెప్పిన పుష్పవ్రత పూజ

ఏ పద్నాలుగు దివ్యపత్రాలను... పద్నాలుగు దివ్యపుష్పాలను సమకూర్చుకుని యథావిధిగా పూజాదికాలు చేస్తూ దివ్యపుష్పాలను పేరుతో అనగా వకుళపత్రం సమర్పయామి అని అలా ఏ దివ్యపుష్పమయితే వుందో... ఏ దివ్యపత్రమైతే వుందో... ఆ పేరు చివర్న నమఃతో పుష్ప, పత్ర పూజ చేస్తే మిమ్మల్ని బాధపెట్టిన వాళ్ళూ, మీకు నష్టాలని చేకూర్చిన వాళ్ళూ కుమిలి కుమిలిపోతారు. తప్పును తెలుసుకుంటారు. పూలు సేకరించేటప్పుడు చెట్టుకి పూలు అస్సలు లేకుండా కొయ్యరాదు. వంశ నాశనం జరుగుతుంది.

## నాగులచవితి రోజు పుట్టలో పాలు పోయించండి

ఆడపిల్లలతోనే కాదు మగపిల్లల చేత కూడా పాలు పోయించండి. అలా పోయించటం వల్ల జీవితంలో మీ పిల్లాడికి భయం వుండదు. నాగులచవితి నాడు పుట్టలో పాలు పోయటం వల్ల తన భార్యా బిడ్డలను పాములు ఏమీ చెయ్యవని ధైర్యంగా, నిబ్బరంగా పురుషుడు తిరుగుతుంటాడు.

ఆ రోజు పుట్టలో పాలు పొయ్యటం వల్ల నాగేంద్రుడు వారి వారి కుటుంబసభ్యులకు హాని చెయ్యవద్దని నాగులకు ఆదేశిస్తాడు.

**ఉగాది పచ్చడిని ఆ ఒక్కరోజే కాదు కనీసం శ్రీరామనవమి వరకు తీసుకోవాలని శాస్త్రం, మన పెద్దలు శెలవిచ్చారు.**



## మహాగ్రహ సంబంధిత బాధలు పడుతుంటే

ద్రౌపది. సహనం, ఓర్పు, ఎంతో ధర్మబద్ధంగా వుంటూ వచ్చే సకల కష్టాలనీ ఓర్చుకుంటూ లాక్కొస్తున్న ద్రౌపదికి శ్రీకృష్ణుడి నుంచి సంక్రమించినదే ఉల్లి. తనలా ఏ ఇల్లాలు బాధపడకూడదని 'ఉల్లి'గా ప్రతి గృహంలో తోడుగా వుంటుంది. కోస్తున్నప్పుడు వచ్చే కన్నీళ్ళ ద్వారా ధైర్యం చెబుతుంది. కోస్తున్నప్పుడు కన్నీళ్ళ వస్తే చిన్న ఉల్లిముక్కని నెత్తిన పెట్టుకోమని పెద్దలు చెప్పేది అందుకే. అందులో అంత పరమార్థం వుంది. ఏ కష్టమైనా ఉల్లిపాయ కోసేటప్పుడు వచ్చే కన్నీరు నుంచి పోతుంది. అలాంటి 'ఉల్లి'ని పెంచితే ఇల్లాలి కష్టాలు, కుటుంబ కష్టాలు తొలగిపోతాయి.

## ఈశ్వరునికి అత్యంత ప్రీతికరమైన పూలు

తమ్మిపూలు... పచ్చగన్నేరు పూలు... అవిశెపూలు... మోదుగ పూలు... నాగలింగం పూలు... పూజ అనంతరం మోదుగ చెట్టు ఆకుల్లో ఈశ్వరునికి నైవేద్యం పెట్టి కుటుంబమంతా మోదగ విస్తళ్ళలో భోజనం చేస్తే శివ ప్రీతికరం. ఆరోగ్యం, ఆనందకరం.

## ఆయుష్య దేవతాయానమ:

ఉదయం విష్ణు ఆలయ దర్శనం ఆపై తులసి తీర్థం.. గోవిందనామాలను చదివి చివరగా 'ఆయుష్షదేవతాయానమః' అని స్మరించాలి. ఆపై సాయంత్రం శివుని ఆలయానికి వెళ్ళి దర్శనం తర్వాత మారేడు తీర్థం స్వీకరించి శివాష్టకం, బిల్వాష్టకం చదివి 'ఆయుష్షదేవతాయానమః' అని స్మరించాలి. మృత్యుదేవత



కబళించే ముందు తన అయిదు లక్షణాలను మనుజుని మీదకు పంపుతుంది. పై విధంగా చేయటం ద్వారా అయిదు అంశలు దగ్గరకి రానీయకుండా చేస్తుంది ఆయుష్షు దేవత. (ఆలయాల్లో గోవింద నామాలను పెద్ద పెద్ద అక్షరాలతో పెట్టిస్తే అందరూ చదువుకోవటానికి వీలుగా వుంటుంది.)

## బాణానికి ఎదురుండదు

దశకంఠుడు రావణాసురుడు శత్రువుల మీదకు యుద్ధానికి వెళ్ళినప్పుడు రథం ఎక్కబోతూ 'శ్రీదేవీ ఖడ్గమాలా స్తోత్రము'ను చదివి ఆపై రథాన్ని అధిరోహించి శత్రువులను చీల్చి చెండాడేవాడు. అయినా శ్రీరాముడి చేతిలో హతమయ్యాడు. కారణం అధర్మం. తప్పుడు పనులు చేస్తూ 'శ్రీదేవీ ఖడ్గమాలా స్తోత్రమే' కాదు అహోరాత్ర యాగం చేసినా వధ తప్పదు. అలాగే గోసేవ అంటే ఎంత పుణ్యమో చెప్పనలవి కాదు. అధర్మమైన పనులు చేసి గోసేవ చేసినా ప్రతిఫలం అనుభవించక తప్పదు. గోసేవ చేసేవారి జోలికి వెళితే దావాగ్నిలో చిక్కుకున్నట్టే.

## 'తులసి'ని ఎప్పుడు నాటాలి

పూరాణ ఇతిహాస గ్రంథం పఠించిన రోజు... పారాయణం చేసిన రోజు... ఆ రోజులలో లక్ష్మీతులసి, కృష్ణతులసి, లవంగ తులసిలను నాటాలి. లక్ష్మీతులసి, కృష్ణతులసిలను కలిపి నాటిన మొక్కలకి పూజ చేస్తే ఫలితం ఉంటుంది. గృహంలో తులసి నాటిన రోజునే మరో ప్రదేశంలో అనగా దేవాలయంలో గానీ,



తెలిసిన వారి ఇండ్లలో గానీ తులసి నాటడం ద్వారా అభీష్టసిద్ధి కలుగుతుంది. దైవ కార్యక్రమాల్లో ఇంకా శుభకార్యాల్లో వ్యర్థ పదార్థాలతో చేసిన వాటిని బహుమతిగా ఇవ్వటం కన్నా తులసి మొక్కలని ఇవ్వటం ద్వారా గృహంలో ఏమూలో ఉన్న, మిగులున్న దరిద్రం తొలగిపోతుంది. ఇంకా గ్రంథ వితరణ చేయటమంటే మొక్కలను దానం చేసిన ఫలము.

## ఏ ఏ కోరికల కోసం అష్టవినాయకులని దర్శించాలి

ధన సంపత్తి కోసం, కీర్తి కోసం మోర్‌గాం వినాయకుణ్ణి, సిద్ధిటేక్ వినాయకుణ్ణి చేసిన పాపాలూ, దోషములూ పోవుటకు... చాలా కాలం నుంచి తీరని కోరికలను పాలీ వినాయకుణ్ణి, అభీష్ట సిద్ధి కొరకు వరద వినాయకుణ్ణి, పోయిన సంపదలని తిరిగి పొందుటకు శ్రీచింతామణి థేవూర్ వినాయకుణ్ణి, అధికారం కొరకు లేన్యాద్రి వినాయకుణ్ణి, చేయబోయే కార్యాలకు విఘ్నాలు కలుగకుండుట కొరకు ఓఝర్ వినాయకుణ్ణి, ఇక రంజన్‌గామ్ శ్రీ వినాయకుణ్ణి దర్శించటం ద్వారా శత్రునాశనము కలుగుతుంది. తమిళనాడులోని కుంభకోణం పరిసరాల్లో నవగ్రహ క్షేత్రాలు వున్నట్టు, పుణే చుట్టు పక్కల ప్రాంతాల్లో ఈ అష్ట వినాయక ఆలయాలున్నాయి.

## కార్తీక దీపాన్ని వెలిగించండి

మొదట దీపానికి నమస్కరించి.. ఆపై గగన సీమ వైపు తలెత్తి చూసి నమస్కరించాలి. ముక్కోటి దేవతలంతా కార్తీక మాస దీపం వెలిగించే వారిని చూస్తుంటారు.



## దివ్య వృక్షాలు

పారిజాతం... మామిడి.. వకుళ... రావి (బుద్ధుడికి జ్ఞానోదయమైనది ఈ దివ్య వృక్షం క్రిందే)... పొగడచెట్టు (శ్రీనివాసుని తల్లి ప్రతిరూపం).... వేప... మేడి(సాక్షాత్తు దత్తుడే ఈ వృక్షం. దీన్నే ఔదంబర వృక్షంగా కూడా పిలుస్తారు), శింశుపావృక్షం (సీతమ్మని లంకలో హనుమ చూసింది ఈ వృక్షం పైనుంచే), నల్లచంద్ర చెట్టు (దీన్నే శివపంచాయతనలో వినాయకుని ప్రతిగా చెప్పబడింది), సాలవృక్షము(బుద్ధుడు జన్మించింది ఈ వృక్షం కిందే), అరటి... ఇత్యాది దివ్యవృక్షాలును ఆదరించడమంటే, పూజించటమంటే దసరా రోజు దుర్గమ్మని పెట్టి చుట్టూ నవధాన్యాలు పోసి మొలకెత్తిన అనంతరం అఖండదీపం వెలిగించి ఆ వెలుగులో అమ్మవారిని దర్శించినంత ఫలం కలుగుతుంది.

## విభూతి మహిమ

'ఓ శ్రీరామచంద్రా! వస్త్రాలను అగ్ని కాల్చినట్టు విభూతి బహ్మ రాసిన చెడు వ్రాతలను కూడా తుడిచెయ్యగలదు. ముఖాన రాసుకుంటే నోటి దూలతో చేసిన పాపాలూ, చేతిపైన రాసుకంటే పరులను హింసించిన దోషములూ, హృదయముపై ధరిస్తే దుర్మార్గపు చేతల ద్వారా కలిగిన దోషాలూ, ఇక నాభిపైన రాసుకుంటే వ్యభిచారం చేసిన దోషమూ, పక్కల రాసుకుంటే రధీ సమయంలో స్త్రీ స్వర్శానందాన్ని అనుభవించటం వల్ల వచ్చే దోషాలనూ పోగొడుతుంది. భస్మము పాపములను బెదిరించి మరీ పంపుతుంది. భస్మము రాసుకోవటం వల్ల ఆయుష్షు పెరుగుతుంది' అని శంకరుడే విప్రుని వేషంలో వచ్చి శ్రీరామునికి చెప్పాడు.

- పద్మపురాణం



## వటవృక్ష పూజ భర్త ఆయుష్షును పెంచుతుంది

- సావిత్రి తన భర్త ప్రాణాలను తిరిగి తెచ్చుకుంది ఈ వృక్ష పూజ వల్లనే.
- మర్రిచెట్టు పూజ ఆత్మవిశ్వాసాన్నీ, శక్తినీ, ఉత్సాహాన్నీ పెంచి కార్యసిద్ధిని కలిగిస్తుంది.
- వివాహం.. సంతానం కోసం ఉయ్యాలలు, రంగు రంగుల వస్త్రాలను కట్టడం కాదు... వృక్షసేవ కూడా చేయాలి.
- శ్రీకృష్ణుడు వటపత్రసాయిలా దర్శనమిచ్చింది ఈ మర్రి ఆకుమీదనే.

వటవృక్షానికి హాని చెయ్యటం వల్లే ఈ జన్మలో సంతానం ఆలస్యమవుతుంది. అలాంటి దోషం లేకుండా దివ్య వృక్షాలను పోషించాలి. నాటాలి. యజ్ఞాలు చెయ్యటం ద్వారా, మొక్కలు నాటడం ద్వారా పదవులు వరిస్తాయి.

## శ్రీకృష్ణునికి ప్రీతికరమైన మొక్కలు

తులసి, కదంబవనాలు, మందార, కోవిదార, కదంబం, ఉత్పల, పారిజాత వృక్షాలు, దేవకాంచన, విష్ణుకాంచన, నీలోత్పతలూ, ఇంకా మల్లెలు, విరజాజులు, మరువం, దవనం వంటి వాటిని సమర్పించటంతో పాటు వీటిని నాటడం, పెంచటం, పోషించటం ద్వారా శ్రీకృష్ణుడిని ప్రసన్నం చేసుకోగలము.



## చింతామణి

సీ ॥ కాలుపెట్టినతోనె కాంతుని మెడ విరిచి
నిండు సంసారమ్ము రెండు జేసి
తన మగఁ డెంత యార్జన పరుఁడైె నను
పొరుగు పుల్లమ్మ కాఁపురము మెచ్చి
ప్రాణేశుఁ డొకటి తెల్పగ తా నొకటి సల్పి
యది యే మనఁగ గస్సు మనుచు లేచి
విభుఁ డెందులకు నేని విసిగి యొక్కటి యన
పెళ్ళు పెళ్ళునఁ బది వేలు గుప్పి
గీ ॥ పట్టజాలక పెనిమిటి యిట్టె యన్న
బావికిని ఏటికిన పడిఁ బరుగులెత్తి
భర్త యెముకలు కొఱికెడు భార్య తోడి
కాఁపురము కంటె నిఁక నరకంబు గదె?

అట్టి భార్యలని భరిస్తున్న భర్తలకి మహా నమస్కారం.

సీ ॥ అర్ధాంగి లక్ష్మియై నట్టి యిల్లాలిని
దమ యింటి దాసిగాఁ దలచు వారు
చీటికి మాటికిఁ జిరబుర లాడుచుఁ
బెండ్లాము నూరకేడ్పించువారు
పడపుగ త్తెల యిండ్ల బానిసెండ్రై ధర్మ
పత్ని యన్నను మండి పడెడి వారు
బయట నెల్లర చేతఁ బడివచ్చి యింటను
పాలఁతి నూరక దిట్టిపోయు వారు



గీ ॥ పెట్టు పోతల పట్ల గలట్టిలోటు
తిట్టు కొట్టుల తోడను దీర్చు వారు
ఖలులు! కఠినులు! హీనుల! కలుష మతులు!
కలరు పురుషులలోనఁ బెక్కండ్రు నిజము.

అట్టి భర్తలని భరిస్తున్న భార్యలుండబట్టే ఇంకా వర్షాలు పడుతున్నాయి.

భర్తలోనైనా... భార్యలోనైనా ఈ లక్షణాలుంటే ఆ సంసారం నరకమే. ముక్కోటి దేవతలొచ్చినా ఆ సంసారం బాగుపడదు.

ఒకటికి రెండుసార్లు ఈ పద్యాలను చదివితే కాళ్ళ కూరివారి రచనా వైభోగమేమిటో, మాధుర్యమేంటో తెలుస్తుంది.

## కష్టాన్ని నమ్ముకుంటే వంద...
## లౌక్యాన్ని నమ్ముకుంటే వెయ్యి

'ప్రొద్దుట్నించి సాయంత్రం దాకా కూలి చేస్తే మూడొందలు, నాలుగొందలు... విసుగొస్తోంది.. ఇలా ఎంతకాలం' అని వాపోయాడు. నన్నేదన్నా సలహా చెప్పమన్నాడు. దానికి నేను 'ఓ పనిచేయి. రోజుకి వెయ్యి సంపాదించే వాడితో స్నేహం చెయ్యి' అన్నాను. కొన్ని రోజుల తర్వాత కనిపించాడు. హుషారుగా వున్నాడు. 'మీరు చెప్పినట్టు రోజుకి వెయ్యి సంపాదించే వాడితో స్నేహం చేశాను. ఇప్పుడు వెయ్యి సంపాదిస్తున్నాను' అన్నాడు. ఎలాగన్నాను. 'హోల్‌సేల్ నుంచి కూరగాయలను తెచ్చి జనం సమకూడే ప్రాంతంలో అమ్ముతున్నాను. ఉదయాన్నే హోల్‌సేల్‌లో తేవటం... అమ్మినన్ని అమ్మి మిగతావి ఇచ్చి నా లాభం నేను జేబులో వేసుకుని



వస్తున్నాను' అన్నాడు. అంతా బాగానే వుందిగాని వెయ్యి రూపాయిలు సంపాదించే వాడితో స్నేహం చెయ్యమన్నాను కదా అదేమయింది. దానికి అతను చెప్పిన సమాధానం... 'రోజూ వెయ్యి రూపాయిలు సంపాదించే వాడిదే ఇప్పుడు నేను చేస్తున్న వ్యాపారం. కాకపోతే వాడిప్పుడు నాతో మాట్లాడ్డం మానేశాడు' అన్నాడు. నాకు పాలమారినంత పనియ్యింది.

## తెల్ల జిల్లేడు

తెల్లజిల్లేడు శ్రీవేంకటేశ్వరస్వామికి ప్రీతికరం. ఈ తెల్లజిల్లేడు యొక్క వేరులోనే ఆర్కగణపతి ఆవిర్భవించాడు. అట్టి ఈ జిల్లేడుని పిచ్చి మొక్కగా తీసిపారేయద్దు. సూర్యునికి ప్రీతికరమైన ఈ జిల్లేడుని జాగ్రత్తగా సమర్పించాలి. విషప్రభావం వున్న దీన్ని శివుని మాలగా కూడా వేస్తారు. వ్యాధిగ్రస్థులు ఎక్కువగా ఈ తెల్లజిల్లేడుని సమర్పిస్తుంటారు. అయితే మానవజాగ్రత్త అత్యంతావశ్యకం. గృహంలో జిల్లేడు మొక్క మొలిస్తే భయపడకండి. శ్రీవిష్ణు ప్రీతికరమైన పదహారు జిల్లేడు మొక్కలను పలుచోట్ల నాటాలి.

## పాచి గడపని భర్త చేత దాటించవద్దు

ఉదయాన్నే కార్యార్థియై భర్త వెళుతుంటే కొద్దిగా ఓపిక తెచ్చుకుని లేచి.. గడప ముందు నీళ్ళు చల్లి చిన్న ముగ్గయినా వేసి భర్తని గడప దాటించండి. సర్వత్రా విజయం చేకూరుతుంది. పాచి గడప వద్ద దుష్టశక్తులు వేచి వుంటాయి. నీళ్ళు చల్లి ముగ్గు పెట్టడం వల్ల దూరంగా తొలగుతాయి. మీ శ్రీవారి బైట పనులకి అడ్డంకి వుండదు.



## కార్తీక జ్వాలా దర్శనం...

కార్తీక పున్నమి నాడు శివాలయాల్లో జరిగే జ్వాలా తోరణ దర్శనం సకల పాపహరణం. పుణ్యకరం. సకల ప్రాణికోటికీ మరుజన్మ వుండదని శాస్త్రంలో ఇలా చెప్పబడింది.

**కీటాః పతంగాః మశకాశ్చః వృక్షాః**
**జలేస్థలే యే నివసంతి జీవాః**
**దృష్ట్వా ప్రదీపనం చ జన్మభాజనం**
**భవన్తి నిత్యం శ్వపచాహివిప్రాః**

## గోవులోనే కాదు అశ్వత్థ వృక్షంలో కూడా ముక్కోటి దేవతలుంటారు

అశ్వత్థ వృక్షమంటే నారాయణుడే. మూలంలో సృష్టికర్త.. చివర్న ఈశ్వరుడు, మధ్యన వైకుంఠవాసుడూ, కొమ్మల్లో సకల దేవతలూ ఉంటారు. వేళ్ళల్లో ఋషులూ, మహర్షులు ఉంటారు. క్రొమ్మ మొదటిన ఇంద్రాది దిక్పాలకులుంటారు. సప్తసముద్రాలు, నదులు కొమ్మల ఆకుల మొనల్లో వుంటాయి. కోరిన కోర్కెలు తీరటానికి అమావాస్య, గురువారం స్నానం చేసి అశ్వత్థ వృక్షాన్ని పూజిస్తే కోరిక తీరుతుంది. రావిచెట్టు స్పర్శ ఆరోగ్యకరం... ఆనందదాయకం.

## *'ART'* తోపాటు *'MAX'* విషయంలో జర జాగ్రత్త

కళారంగంలో వున్న వాళ్ళు ఎక్కువమంది తేలికగా మోసపోతుంటారు. దానికి కారణం మనుష్యులందరినీ ప్రేమించటం.. న్యాయం.. ధర్మం... మంచితనం... ఇంకా విలువలకి



అధిక ప్రాధాన్యం ఇచ్చే వాళ్ళు ఆ రంగంలో వుంటారు. వారికి తమ కళ మీద ..... తప్ప .... ఏ విషయంలో శ్రద్ధ వుండదు. ... ధనం విషయంలో కొంతయినా శ్రద్ధ పెట్టకపోతే... మీరభిమానించే కళకే భంగం కలిగే పరిస్థితి. సరస్వతి ఉన్న చోట లక్ష్మి ఉండదన్నది కేవలం మూఢ నమ్మకం మాత్రమే. చప్పట్లకీ, పొగడ్తలకీ, సేవా తత్పరతకీ లొంగిపోవటం ద్వారానే కళారంగంలో వున్న వాళ్ళ దగ్గర ధనం తరుగుతుంది. ఆయా రంగంలో వున్న వాళ్ళని మోసం చేశామని సంబరపడితే వారితో తేడా వస్తే... కోపిస్తే, పగపడితే 'ఓం నమో అస్తీక అస్తీక నమః' అంటే త్రాచుపాము కూడా పగ వదులుతుందేమో గాని వాళ్ళు మాత్రం ఎట్టి స్థితిలోనూ వదలరు గాక వదలరు.

## మానసిక ప్రశాంతత కోసం దత్తాత్రేయుణ్ని పూజించాలి

అత్రి, అనసూయలకు శ్రీమహావిష్ణువు దత్తాత్రేయుడిగా జన్మించాడు. వారిద్దరూ మహా పుణ్యవంతులు. పన్నెండు సంవత్సరాల పాటు వర్షాలు కురవక సృష్టి అల్లకల్లోలం అవుతుంటే అత్రిముని మహా తపస్సు చేశాడు. వర్షాలు పడ్డాయి. లోకాన్ని కాపాడిన మహర్షి దంపతులకు పుత్రునిగా జన్మించాలనుకున్నాడు నారాయణుడు. తన ధర్మాన్ని నిర్వర్తించినందుకు మహా అదృష్టాన్నే అత్రిమునికి కట్టబెట్టాడు. అయితే తపస్సు ద్వారా తాను జన్మించాలని భావిస్తే కష్టమని తలచాడు. మహా పరీక్ష పెట్టాడు. అనసూయ పాతివ్రత్యాన్ని పరీక్షించాలనుకున్నాడు. బ్రహ్మ, పరమేశ్వరులను వెంట బెట్టుకుని అత్రి, అనసూయల ఆశ్రమానికి



వెళ్ళాడు. ఆమె ఆతిథ్యాన్ని నిరాకరించి ఆమె వివస్త్ర అయి ఆతిథ్యాన్ని ఇస్తేనే స్వీకరిస్తామని చెప్పాడు. దాంతో మహా పతివ్రత ఆ ముగ్గురిపై నీళ్ళు జల్లి వారిని పసిపిల్లలుగా చేసి లాలించింది. ఆపై యధారూపులవ్వగానే శ్రీమహావిష్ణువు 'తల్లీ... నాకు నేనుగా మీ పుత్రుడిగా పుట్టాలని కోరుకుంటున్నాను. నన్ను నేను నీ పుత్రునిగా సమర్పించుకుంటున్నాను. గాన నన్ను దత్తుడిగా పిలుస్తారు' అని మార్గశీర్ష పూర్ణిమ తిథినాడు జన్మించాడు. లోకానికి అనగా పరుల కోసం పని చేస్తే ఎంతటి అదృష్టం కలుగుతుందో శ్రీదత్తాత్రేయ జనన గాథ ద్వారా తెలుస్తోంది.

## ఆది వృక్షమంటే

❀ భూమి పుట్టినప్పుడు ఓసారి భూమంతా నీళ్ళతో మునిగి పోయింది. బ్రహ్మదేవుడు ఆ బాధతో తపస్సు చేసినప్పుడు ఆయన రెండు కళ్ళ నుంచి కారిన కన్నీరే ఉసిరి చెట్టు.

❀ స్కాంద పురాణం ఈ ఉసిరిక చెట్టుని ఆదివృక్షంగా పేర్కొంది.

❀ గృహంపై ఉసిరిక పండ్లని వేస్తే ఆ గృహంలోకి దుష్టశక్తులు రావు.

❀ ధనం వృద్ధి చేసుకోవాలనుకున్నవారు ఉసిరిక కాయలను నీటిలో కలిపి స్నానం చేయాలి.

❀ గోదానం కన్నా అత్యంత పుణ్యప్రదమైనది ఉసిరిక దానం.

❀ క్షీరాబ్ధి ద్వాదశినాడు తులసినీ, ఉసిరిచెట్టునీ కలిపి పూజించి సాయం సంధ్యలో దీపాలు వెలిగిస్తే రావాల్సిన ధనం తిరిగి వస్తుంది.

❀ తులసి, ఉసిరి కాయలను కార్తీకమాసంలో పంచిపెడితే స్త్రీలకు అఖండసౌభాగ్య సిద్ధి.



## పుత్రసంతానం కోసం

## కాశీలోని సిందియాఘాట్

అయిదువేల సంవత్సరాల క్రితం శివుడు నిర్మించిన మహాక్షేత్రం కాశి. అరవైనాలుగు స్నాన ఘట్టాలతో ఎన్నో వేల ఆలయాలు గల ఈ కాశీలోని సిందియాఘాట్ అగ్నిదేవుని జన్మస్థలం. పుత్ర సంతానం కావాలనుకున్నవారు ఇక్కడి వీరేశ్వరుణ్ని ఆరాధించటం ద్వారా... పూజించటం ద్వారా వారి కోరిక నెరవేరుతుంది.

## సేవే సకల సంపదలకి మూలం

నేను ఎవరో తెలుసా...? ఆ వక్క వాక్యం వందమందిని దూరం చేస్తుంది. రాక్షస ప్రవృత్తి గల వాళ్ళతో సన్నిహిత్యం పెంచుతుంది. ఓసారి దేవదత్తుడూ, గౌతముడూ విహారం చేస్తున్నారు. ఓ అందమైన బంగారు హంస ఆకాశాన ఎగురుతూ కనపడింది. దాన్ని దేవదత్తుడు చూశాడు. కావాలనుకున్నాడు. బాణం వదిలాడు. ఆ హంస విలవిలలాడుతూ కిందపడింది. గౌతముడు దానికి చికిత్స చేశాడు. ఇద్దరూ నాది నాది అనుకున్నారు. వాదన రాజు వద్దకెళ్ళింది. రాజు ఆ హంసను ఓ బంగారు సింహాసనం మీద వుంచి ఇద్దర్నీ ఆ హంసను తమ వద్దకు రమ్మని పిలవమన్నాడు. వారి పిలుపుని విన్న హంస ఇద్దర్నీ చూసింది. ఎవ్వరి దగ్గరికి ఆనందంగా వెళ్ళిందో వేరే చెప్పక్కర్లేదనుకుంటున్నాను.



## పెరటిలో కుందపుష్పం చెట్టు

కుందపుష్పం అనగా కాగడామల్లె. ఆ చెట్టుని గృహంలో పెంచటమంటే గౌతమీ అహల్య దంపతులను పూజించటమే. మంత్ర ద్రష్ట గౌతముడూ, పంచకన్యల్లో ఒకరైన అహల్య మీ ఇంట ఆహారం, నీరు, సంపదలను సమృద్ధిగా వుండేలా దీవిస్తారు.

## కాశీ విశ్వేశ్వర దర్శనానికి ముందు

లయకారకుడైన శివుని ఆధీనంలో వున్న ఈ కాశీ క్షేత్రం శివుని త్రిశూలంపైన వుంది. ప్రళయకాలంలో కూడా ఏమాత్రం చెక్కుచెదరనిది. కానీ ఈ కాశీక్షేత్ర విశ్వనాథుడ్ని, జ్యోతిర్లింగ స్వరూపుడ్ని దర్శించే ముందు కాలభైరవ మందిరాన్ని దర్శించి ఆపై కాశీ విశ్వేశ్వరుణ్ని దర్శించాలి. తిరుమల శ్రీవేంకటేశ్వరుని కన్నా ముందు వరాహ స్వామిని దర్శించి శ్రీవేంకటేశ్వరుణ్ని దర్శించుకున్నట్టు, కాశీలో కాలభైరవుణ్ని దర్శించుకుని ఆపై విశ్వేశ్వరుణ్ని దర్శించుకోవటం వల్ల కాశీ క్షేత్ర దర్శన పుణ్య ఫలం కలుగుతుందని పురాణ కథనం. దగ్గరిలో మృత్యుంజయ ఆలయంలోని బావి నీళ్ళను తీర్థంగా స్వీకరించటం వల్ల అనేక వ్యాధుల నుంచి ఉపశమనం. ఈ కాలభైరవ ఆలయాన్ని దర్శించి సేవించినప్పుడు దీపం వెలిగించి రావటం మరవకండి.

## దానం ఎలా ఇవ్వాలి.. ఎలా తీసుకోవాలి

దానమంటే వస్తువుపై ఇష్టాన్ని వీడి ఇచ్చేది.. ధర్మమంటే మంచినీటి బావులు... దేవాలయ నిర్మాణాలు... బావులూ.. అన్నదాన సత్రములు ఇత్యాదివి ధర్మములు. సూర్య,చంద్ర గ్రహణ



సమయాలలో ఇచ్చే దానం మహా పుణ్య ఫలాన్ని ఇస్తుందని గరుడ పురాణం తెలవిస్తోంది. కర్కాటక, మకర సంక్రమణములప్పుడిచ్చే దానం వల్ల శాపదోషం పోతుంది. ఇక ఇచ్చే దాత తూర్పు ముఖంగా కూర్చోవాలి. సంకల్ప గోత్ర నామములను చెప్పి దానమివ్వాలి. తీసుకునే వారు ఉత్తరాభి ముఖులై పుచ్చుకోవాలి. అలా చేయటం వల్ల పుచ్చుకోవటం వల్ల దాతకు ఆయుష్షు... గ్రహీతకు శుభం కలుగుతుంది.

## 'తిలాః పునంతుమే పాపం'

అనగా ఆ శ్రుతి భావం తిలలు సకల పాపములు పోగొడతాయని. అనేక పీడలు తొలగుటకు తిలదానం చేయాలి.

- పద్మపురాణం

## చెడుకలలు వస్తే 'గరిక' స్నానం చెయ్యండి

కలలు కొన్ని సంతోషాల్నిస్తాయి, మరికొన్ని భయపెడతాయి. దుస్స్వప్న దోషం పోవాలంటే సకల దేవతలూ, ఋషులూ వినాయకుణ్ని నిత్యం పూజించే పవిత్రమైన 'గరిక'ను ఉదయం స్నానానంతరం వినాయకునికి సమర్పించి ధ్యాన శ్లోకం చదవండి.

## గోత్రం తెలియకపోతే

వారిది కశ్యప గోత్రం. అనేక ధర్మశుభకార్యాల్లో, పూజాదికార్యాల్లో గోత్రం అత్యంతవసరం. అది తెలియనివారు సకల జనులకి తండ్రి వంటి వాడయిన కశ్యపుని గోత్రమైన కశ్యపగోత్రం అని చెప్పించుకోవాలి.



## దర్భ ఎంతటి పవిత్రమైనది

- క్షీరసాగర మథనంలో మంధర పర్వతమును మోయటం వల్ల ఆ రాపిడికి తాబేలు పైనుంచి వూడిన వెంట్రుకలు రూపాంతరం చెందినవే ఈ దర్భలు.
- వరాహ అవతారంలో వరాహానికి వెంట్రుకలుగా మారినవే ఈ దర్భలు.
- దర్భలు ఎప్పుడూ వేళ్ళతో సహా వుండాలి.
- వాల్మీకి మహర్షి 'లవకుశ' అని సీతాదేవి పుత్రులకి పేర్లు పెట్టింది ఈ దర్భలను ఉద్దేశించే.
- దర్భలకి పైలోకాల్లోని వారిని ఆకర్షించే శక్తి వుంది.

## కవళీమాతకు గవ్వలు సమర్పించటం ద్వారా కాశీ దర్శన ఫలం మీ వెంట....

- పూర్వం కవళీ అనే స్త్రీ బ్రతుకు తెరువు కోసం గవ్వలు అమ్ముతుండేది. ప్రతిరోజు సకల పాపాలను పోగొట్టే గంగానదిలో స్నానం చేసి కాశీ విశ్వేశ్వర దర్శనం చేసుకునేది. ఒకనాడు ఎప్పటిలా స్నానం చేసి దర్శనానికి పోతుండగా హరిజనుడు ఒకడు ఆమెను తాకటంతో మళ్ళీ స్నానానికి వెళ్ళింది. ఆమె స్నానం చెయ్యటం.. అతను తాకటం.. అలా... రాత్రి అయిపోయింది. విశ్వేశ్వర దర్శనం అవ్వనిదే ఆమె ఎంగిలి పడదు. కాశీలో ఎవ్వరూ తినకుండా వుండకూడదు గాన అన్నపూర్ణాదేవే స్వయంగా వచ్చి ఆమెని ఆహారం తీసుకోమంది. అయినా కవళి తినలేదు. అన్నపూర్ణాదేవి ఆగ్రహించి 'కాశీ' నుంచి వెళ్ళిపోమంది. జగన్మాత ఆదేశంతో



ఆమె కాశీ వదులుతూ .... 'ఆనాడు లోకకళ్యాణం కోసం అగస్త్యుడు కాశీ నుంచి వెళ్ళాడు. ఆ మహర్షి ఎంత వేదనకు గురయ్యాడో అర్థమవుతోందని' ఆమె శివుణ్ని ప్రార్థించి వేడుకుంది. నీ దర్శనం ఎలా అని ప్రశ్నించింది. కవళి భక్తికి మెచ్చిన పరమేశ్వరుడు ప్రత్యక్షమై 'నాకు సకల ప్రాణికోటి సరిసమానమే. ఎవ్వరూ ఎక్కువ తక్కువకాదు. తప్పుకి శిక్ష తప్పనిసరి. నీ భక్తికి మెచ్చాను. కాశీని ఎవరు దర్శించినా ఆ ఫలం నీకే.. అయితే ఆ భక్తులు నిన్ను దర్శించి నీకు గవ్వలు సమర్పించి ఈ కాశీ పుణ్య ఫలాన్ని తిరిగి వారిది వారు తీసుకుంటారు' అని వరమిచ్చి అదృశ్యమయ్యాడు. కాన కాశీకి వెళ్ళినప్పుడు కవళీమాత మందిరాన్ని దర్శించి ఆమెకి గవ్వలను సమర్పించి కాశీ క్షేత్ర దర్శన పుణ్యఫలాన్ని పొందండి.

## పుట్టింటి, అత్తింటి గొడవలు పోవాలంటే

సతీదేవి యజ్ఞకుండంలో ఆత్మాహుతి చేసుకోవటంతో శివుడు వీరభద్రుడ్ని సృష్టించి వీరవిహారం చేశాడు. వీరభద్రుడి పుట్టుక... ఆపై దక్షుని మరణం. ఆ తర్వాత శివుడు ఇంకా కోపం తగ్గక తన జటాజూటం నుంచి జటం పీకి భూమిపై వేస్తాడు. అదే మర్రిచెట్టు. దాని మహాఊడలే ఈశ్వరుని జటాజూటాలు. మర్రి పూజ చేసి... చాలా దూరంగా ఒక మర్రి మొక్కని నాటితే అత్తింటి, పుట్టింటి గొడవలు దూరమవుతాయి.



## తెల్లతామరలను సరస్వతీపూజకి వినియోగించండి

విద్యనభ్యసించే వారు తెల్లతామరలను సరస్వతీదేవికి నిత్యం సమర్పించటం ద్వారా జ్ఞాపక శక్తి పెరుగుతుంది. చదువుల తల్లి సరస్వతిదేవి ఆసనం ఈ తెల్లతామరే.

## సతి ధర్మాన్ని మీరితే పతికీ గండం తప్పదు

దుర్మార్గుడైనా సరే సతి పతి స్మరణ వీడి మరో ధ్యాస వైపు వెళితే ఆ పతికి కీడు తప్పదు. త్రిపురాధిపతి బాణుడు మహా లోక వినాశకారి. వాణ్ని తుదముట్టించేందుకు దేవతలకి ఎంత ప్రయత్నించినా వల్ల కావటం లేదు. కారణం వాని భార్య పతిభక్తి. దాంతో దేవతలు వాని భార్య పతిభక్తిని పక్కకి మళ్ళించేలా పథకం పన్నారు. తత్ఫలితంగా బాణుడి రెండు పురాలని కూల్చారు. కూలిన రెండు పురములలో ఒకటి శ్రీశైలము. రెండు అమరావతి. కాన ఇల్లాలు పతి ధ్యాస మరిచిన నష్టం భర్తకి తప్పదు. ఆ దోషము సంతానానికి కూడా పట్టి వారు అప్రయోజకులవుతారు.

**ఏకాదశి వ్రతమూ, తిరుమల శ్రీవేంకటేశ్వరుని పుష్కరిణిలో స్నానమూ, మహాత్ముల శిష్యరికమూ పుణ్యం వల్లా, ధర్మకార్యాల వల్లనే సాధ్యపడతాయి.**

## అరటి చతుర్థశి

తమ మహా సౌందర్యం చూసుకొని మిడిసిపడి నందుకు సావిత్రి అరటిచెట్టుగా భూమిపై బీజం లేని చెట్టుగా అవతరించింది. ఆపై అహం వీడినందుకు మానవులకీ, మాధవుడైన తనకూ సేవ



చేసి తరిస్తావని శ్రీమహావిష్ణువు శెలవిచ్చాడు. అదే మఘకృష్ణచతుర్ధశి. అనగా అరటి చతుర్ధశి. నూతనంగా వివాహం అయినవారి చేత ఆనాడు అరటిచెట్టుకి పూజ చేయిస్తే వారికి సౌందర్యవంతులైన సంతానం కలగుతారు. పూర్ణఫలమైన అరటిపండ్లను ముత్తైదువులకి అయిదు చొప్పున కనీసం అయిదుగురికి తాంబూలంగా ఇప్పించాలి. సృష్టిలో ఎంగిలికాని పండు అరటిపండు. అలాగే కొబ్బరి కూడా. అందుకే కొబ్బరికాయకు దేవతలు అగ్రతాంబూలం ఇచ్చారు. ఆ రోజున అరటిచెట్టుని పూజించి అయిదు కొబ్బరికాయలను కొట్టాలి.

**మీ రంగంలో వున్న వారితో గొడవలొద్దు**

గొడవ ప్రారంభం అయ్యిందో మొత్తం మీ రంగంలోని వారంతా అపర చాణక్య శాస్త్రాన్ని మథించి మరీ ఆ గొడవని తీవ్రస్థాయికి తీసుకెళ్తారు. మీకు తప్ప అందరికీ తెలుసు. కొట్టుకుని కొట్టుకుని మీరిద్దరే అయిపోతారని. వారికి కావాల్సింది అదే. మీ స్థానాలని వారు అందుకోవాలని. లేదా ఇద్దరయినా తమకి పోటీ తప్పుతారని. ఇంకా ఆ గొడవనడ్డం పెట్టుకుని చెరో పక్క లేదా ఇద్దరి పక్కా వుండి పబ్బం గడుపుకోవటానికి మరికొంత మంది సిద్ధం. కాన మీ రంగంలో వున్న వారితో గొడవంటే.. ఇక మీ పని, అవతల వారి పని అయిపోయినట్టే. మహిషాసురుడ్ని చండీదేవి జమ్మివృక్షానికి పూజ, ప్రదక్షిణలు చేసి దుష్టసంహారం చేసి ధర్మాన్ని కాపాడింది. జమ్మివృక్ష ప్రదక్షిణ, పూజాదికాలు శత్రునాశనం.



## సంకట మోచన మందిరాన్ని దర్శిస్తే

సప్తమోక్షాపురాలు అయోధ్య... మధుర.. గయ.. అవంతిక.. ఇంకా కాశి. అలాంటి కాశి అలహాబాద్‌కి నూట ఇరవై కి.మీ దూరంలో వుంది. ఈ కాశీ క్షేత్రంలో సంకట మోచన్ మందిరం వుంది. తులసీదాసుకు హనుమంతుడు ప్రత్యక్షమైన ప్రదేశంలో నిర్మించిన ఆలయంలో సుందరకాండ పారాయణం వల్ల మృత్యు అంశ... అనగా భీతి, భయాలు తొలగిపోతాయి.

## పుట్టలపై వృక్షాలు ఎవరికి ప్రీతి

ఆదిత్యునికి మహా వృక్షాలు.. చంద్రునికి పాలచెట్లు... కుజునికి కరముగల చెట్లు... దేవగురువుకి పండ్ల చెట్లు.. శుక్రునికి నీరస చెట్లు... రాహుకేతువులకి పుట్టలపై వృక్షాలు ప్రీతికరం. ఆయా గ్రహదోషాలున్న వారు ఆ వృక్షాలను నాటడం వల్ల, నీరు పోసి పెంచటం వల్ల ఆ వృక్షాల్లోని ప్రాణశక్తి మీ దేహంలోని దోషాలను పోగొడుతుంది.

## ఏ ఆకులో ఇద్దరు భోజనం చేయచ్చు

- అరటిఆకు. దీంట్లో భార్యాభర్తలు కలిసి ఎప్పుడయినా తినచ్చు.
- అలా కానివారు ఎవరైనా భక్తి మైత్రేయబంధం గలవారు ఆరటి ఆకు భోజనం చేస్తే ఆ ఫలం మరింత వారి బంధాన్ని ధృఢతరం చేస్తుంది.
- భరద్వాజ మహర్షి ఆశ్రమంలో శ్రీరాముడూ, హనుమ అరటి ఆకులో కలిసి భుజించారు.



ఆ సమయంలోనే శ్రీరామచంద్రుడు జనులకి 'అరటిని పూజాదికాల్లో వాడితే నా ఆశీస్సులతో పాటు హనుమ ఆశీస్సులు జోడవుతాయి అని చెప్పాడు. అరటి ఆకుల్లో భోజనం పెడితే అన్నాన్ని అమ్మవారిపై సహితం శ్రీమహాలక్ష్మి తన కరుణను కురిపిస్తుంది' అని వరమిచ్చాడు.

## నీడన పోయి నీడన రా....

పొలం... ఇళ్ళు.. బంగారం అపారంగా సంపాదించిన ఓ వ్యాపారి అవసాన దశలో కొడుకుని పిలిచి 'నాయనా.. ఎంతో కష్టపడి ఈ ఆస్తిని సంపాదించాను. దాని కిటుకు వక్కటే. దాన్ని పాటిస్తే ఈ ధనాన్ని మరింత పెంచి నీ సంతానానికి అందించగలుగుతావు. వ్యాపారానికి ఎప్పుడూ నీడన పోయి నీడన రావాలి' అని చెప్పాడు. 'అర్థమైంది.... నువ్వేం దిగులు పడకు' అని పుత్రుడు తండ్రిని సమాధానపరిచాడు. కొన్నాళ్ళ తర్వాత తండ్రి, ఆ తర్వాత ఆస్థి పాస్తులన్నీ కరిగిపోయాయి. నాన్న చెప్పినట్టు నీడనే వ్యాపారానికి పోయాను (కారులో).. నీడనే అనగా సూర్యుడు అస్తమించగానే వచ్చేశాను కదా... అయినా ఆస్తులన్నీ ఎందుకు పోయాయో అర్థం కాక జుట్టు పీక్కున్నాడు. నిజానికి ఆ పెద్దాయన చెప్పింది నీడన వెళ్ళమంటే ఉదయాన్నే అందరికన్నా ముందు దుకాణం తెరవమనీ, నీడన రమ్మంటే అంతా కొట్లు కట్టేశాక కొట్టు కట్టేసి గృహానికి చేరమని. కాన పెద్దలు చెప్పింది పూర్తిగా వినండి.



## మూడు ఆకుల భోజనం....

హనుమత్ప్రీతికరమైన అరటిఆకు భోజనం, ఈశ్వర ప్రీతికరమైన మోదగ విస్తరిలోని భోజనం, మహావిష్ణు స్వరూపమైన మర్రిఆకు విస్తరిలోని భోజనం ఏదైనా వారి ప్రసాదమంత పవిత్రం.... శుభకరం... ఆరోగ్యకరం. పైన చెప్పిన ఆకుల్లో ఒక్కసారన్నా భోజనం చేశారా? అనుభవించటమంటే నగలూ, భూములే కాదు.. ఇంకా చాలా వున్నాయి. మానవ జీవితం అన్నింటినీ అనుభవించమని... కొన్నే అని పరిమితం కావటానికి కాదు.

## కామేషు మన్మథ...

హైందవ సంప్రదాయంలో మహర్షులు అందించిన శాస్త్ర ధర్మాల్లో భార్య దాసిలా, సలహా ఇవ్వటంలో మంత్రిగా, అన్నం పెట్టేటప్పుడు తల్లిగా, పడకగదిలో రంభలా, సహనంలో భూదేవిలా ఉండాలి .... ఇలా చెప్పారు. అలాగే పురుషుడికి కూడా చెప్పారు. రాజులా భోగించమన్నారు.. శ్రీరాముడిలా జీవించమన్నారు. శ్రీకృష్ణుడిలా భార్యని లాలించి బుజ్జగించాలన్నారు. కుంతీ పుత్రుడు కర్ణుడిలా దాన గుణంతో వుండాలన్నారు. ఇక రూపంలో శ్రీమహావిష్ణువులా వుండాలన్నారు. ఇక శృంగారం విషయంలో మన్మథుడిలా రెచ్చిపోమన్నారు. కామేషు మన్మథ అంటే అర్థం ఇంటి రతీదేవి అనగా ఇల్లాలి దగ్గరే పురుషుడు సకల సుఖాలని పొందాలని... అలా ఉండాలని భావం.. ఆ అయిదు గుణాలున్న వాడు పుణ్య పురుషుడు.



## తెలివిగలవాడు ధనాన్ని అప్పుగా తీసుకోవటానికి ప్రయత్నించడు

వంద కావాలంటే ఎంత వడ్డీ... ఏం పెడతావ్ ... ఇంకా క్యారెక్టర్.. నీ అలవాట్లు... ఇలా అన్నీ చూస్తారు. ఉదాహరణకి బట్టల వ్యాపారం చేస్తున్నారనుకో... మిల్లు వాళ్ళతో కొద్ది కొద్దిగా రొఖ్ఖంతో కొంటున్నారనుకోండి... ఆ తర్వాత వారే పదివేలు అప్పు ఇస్తారు. ఆ తర్వాత యాభై, ఆపై లక్ష. మొదట పది చెప్పిన సమయానికి ఇస్తే ఎన్ని లక్షలైనా సరుకు అప్పుగా దొరుకుతుంది. సరుకు అప్పుగా దొరకటం లేదంటే మీరు వ్యాపారంలో ఎన్నటికీ ధనం సంపాదించలేరు. వ్యాపారం సొంత డబ్బుతో ప్రారంభించాలి. అప్పు చేసి వడ్డీకి తెచ్చి కాదు. తెలివైన వ్యాపారి తయారీ దారుల డబ్బుతో అనగా సరుకుతో వ్యాపారం చేసి ధనం సంపాదిస్తాడు. పదివేలు రొఖ్ఖం అప్పుగా దొరకటం కష్టంతో కూడుకున్న పని. కానీ లక్ష రూపాయిల సరుకు అప్పుగా దొరకటం చాలా తేలిక. ఆ లక్షని నిజాయితీగా కట్టేస్తే లక్షల సరుకు మీ దుకాణానికే వస్తుంది. ఆపై వెనక్కి తిరిగి చూసుకోవాల్సిన పని వుండదు.

## భార్యని బాధలు పెట్టిన దోషం పోవటానికి

కాశీ విశ్వేశ్వరుని దర్శనానికి ముందు త్రివేణీ సంగమంలో స్నానం చేసి వెళ్ళటం శాస్త్ర బద్ధం. త్రివేణీ సంగమస్నానం తర్వాత సీతామడిని దర్శించండి. భూదేవి తన బిడ్డ సీతాదేవిని భూమిలోకి తీసుకెళ్ళిన ప్రదేశాన్ని దర్శించటం ద్వారా యవ్వన కాలంలో భార్యని బాధపెట్టిన దోషాలు పోతాయి. కుశలవులు జన్మించిన ప్రాంతమూ, ఇంకా లక్ష్మణుడు అన్నమాటపై వదిన సీతాదేవిని అడవిలో వదిలిన ప్రదేశమూ ఈ సీతామడినే.



## ఆ పురాణంలో ఆ ఖండం ఆ పదిరోజులే చదవాలి

గరుడ పురాణం పూర్వ ఖండము.. ఉత్తర ఖండములతో వుంటుంది. ఉత్తర ఖండంలో ప్రథమము ప్రేతకల్పము. ఆ ఖండాన్ని కేవలం ఆ పదిరోజులే ఆ జీవుడి గురించి చదవాలి. గరుడ పురాణాన్ని గృహంలో వుంచుకునేవారు ఆ ఖండం అనగా 'ప్రేతఖండం' మాత్రం వదిలేసి మిగతాదంతా చదవాలి. శ్రీమహావిష్ణు మహాత్మ్యాన్ని చదివిన ఫలం అప్పుడే లభిస్తుంది.

## వ్యాపారంలో ఇలాంటి శత్రువులు కూడా వుంటారు

వ్యాపారంలోనే కాదు, వ్యవహారంలో, కళారంగంలో అత్యున్నత ప్రతిభ వుంటే మిమ్మల్ని దిగజార్చటానికి ఎప్పుడూ ప్రయత్నిస్తూనే వుంటారు. మీ బలహీనతలని కనిపెడతారు. మీకు దగ్గరవుతారు. ఇరవైనాలుగు గంటలు మీతోనే వుండి తన స్వంత ధనాన్ని వెచ్చించి పూర్తిగా వ్యసనాలకి బానిసను చేస్తారు. కొంతకాలం తర్వాత ఇక మీ పని అయిపోయిందని తెలుసుకుని మిమ్మల్ని వదిలేస్తారు. మిమ్మల్ని ఇంటికుక్కలా వాడుకుంటారు. కానీ చేసిన వ్యక్తికి అవతల వారి గృహంలో పిల్లలూ, ఆడవాళ్ళ ఏడుపు, వేదన తప్పకుండా తగిలితీరుతుంది. గర్భిణీ స్త్రీ అమ్మవారితో సమానం. నమస్కరించినంత లలితాంబికకు నమస్కరించిన ఫలం. అలాగే గృహస్థుని నాశనం చెయ్యాలని అలాంటివి చేస్తే ఆదిశక్తి వంటి గృహ ఇల్లాలిని వేదనకి గురిచేసిన వారికి జీవితాంతం ఏడుపుని మాత్రమే యిస్తుంది. వాళ్ళకి ఏడుపు వస్తుందో లేదో ఇక్కడ ముఖ్యం కాదు.. మీరూ, మీ వాళ్ళూ జాగ్రత్త... అలాంటి నీచులున్నారు.



## పనివారికి మీరే నేర్పించాలి

పెద్ద సంస్థల్లో గానీ, చిన్నసంస్థల్లో గానీ వచ్చిన వారిమీద విసుక్కోవటం ఏదో సందర్భంలో జరుగుతుంది. అది తీరని నష్టాన్ని తెచ్చిపెడుతుంది. కథగా చెప్పాలంటే ఓ వూరిలో రత్నాకరుడనే వానికి దుకాణం వుంది. ఈశ్వరుడనే అతన్ని పనిలో పెట్టుకున్నాడు. ఎంత అమ్మాలో వివరం చెప్పాడు. నమ్మకంగా, నిజాయితీగా పనిచేస్తుండటంతో ఎంతో సంతృప్తి చెందాడు. కొన్నాళ్ళ తర్వాత వ్యాపారం బాగా మందగించింది. కారణం తెలియలేదు. ఓసారి ఊరి పెద్ద కనిపించి ...'రత్నాకరా... ఏంటయ్యా మీ పనివాడు... రూపాయి తగ్గించమంటే బోకొన్నావులే.. కొనే బేరమేనా నీది' అంటున్నాడు. ఊరిపెద్ద అన్న గౌరవం కూడా ఇవ్వలేదు...' అన్నాడు. రత్నాకరరావు తలవూపి దుకాణానికి వచ్చి ఈశ్వరరావుతో చెప్పాడు. 'నీవు నాదగ్గరొద్దు. నీవూ సరే.. నీ పనీ సరే.. చేసింది చాలు వెళ్ళు...' అన్నాడు. ఈశ్వరరావు కన్నీళ్ళ పర్యంతమై వెళ్ళిపోయాడు. రెండు రోజుల తర్వాత వచ్చి ప్రాధేయ పడ్డాడు. అప్పుడు చెప్పాడు రత్నాకరరావు. 'చూశావా.. బో చేశావులే పని వెళ్ళు' అంటేనే అంత బాధపడ్డావు. జీతమిచ్చే యజమాని అంటేనే అలా అయ్యావు. కొనుగోలుదారుడిపై ఆధారపడ్డాం మనం. అలాంటిది వాళ్ళనంటే ఎంత బాధపడతారు. మళ్ళీ వస్తారా మనవద్దకు వాళ్ళు. మరొకర్ని రానిస్తారా? మన దుకాణం గురించి మంచిగా చెబుతారా?' అన్నాడు. ఈశ్వరరావుకి తన తప్పు అర్థమైంది. ఆ తర్వాత రత్నాకరరావు వ్యాపారం నెమ్మదిగా పుంజుకుంది.



## బేరమాడటం అనేది వుంటే ఎదగటం కష్టమే

'ఏదయినా సరే ఒకే రేటు.. రోజుకి ఒక్కటమ్మినా అదే' అనే సిద్ధాంతంపై నిలిచి ఉండాలి.

వ్యాపార ప్రారంభంలో ఎవరూ రారు. ఏదో నిరాశ. ఎంతో కొంతకి.. ఇంకా నిరాశ చెంది నష్టానికి కూడా. అలా చేస్తే పూర్తిగా నష్టపోవటం ఖాయం. వ్యాపారస్థులకి తెలీదు కొనేవాళ్ళు మీ గురించి మొత్తం చెప్పేస్తారు. అక్కడ బేరం ఆడచ్చు. ఇక్కడ బేరం వుండదు. రూపాయి కూడా తగ్గరు. అలా మెట్లు ఎక్కే ముందే మీ దుకాణం గురించి అందరికీ తెలుసు. కాన బేరమాడచ్చు అని ఒక్కసారి మీ దుకాణం గురించి మాట వచ్చిందా... మీ పిల్లల పిల్లలు కూడా దాన్ని మార్చలేరు. రోజూ అమ్మటం కంటే బేరం ఆడటంతోనే మీకు, వచ్చిన వాళ్ళకీ సరిపోతుంది. బేరమాడే విషయంలో ఎంత జాగ్రత్తగా వున్నా ఏదో ఒక సందర్భంలో మాట తేడా వస్తుంది. దాంతో లేనిపోని సమస్యలు.

## వ్యాపారంలో ఆచితూచి మాట్లాడాలి

వ్యాపారంలోనైనా, వ్యవహారంలోనైనా ఎక్కువ వినాలి... ఆచి తూచి మాట్లాడాలి. కప్ప పగలూ, రాత్రి తేడా లేకుండా కూస్తుంది. అయినా ఎవ్వరూ పట్టించుకోరు. అదే కోడి ఒక్కసారి కూస్తే ఊరంతా లేస్తుంది. అలా అని భార్య, స్నేహితుల దగ్గర ఆ సూత్రం పాటించకండి.



## ఒకే ఒక్కటి....

అపర ధనవంతులు కావాలంటే ఏదో ఒక్కటే వ్యాపారం చేయాలి. అది మీదే అని చుట్టూ ప్రాకిపోవాలి. పెద్ద పోలికలొద్దు. మీ చుట్టూనే గమనించండి. కేవలం ఇడ్లీ మాత్రమే అమ్మేవాని ధ్గగర ఎగబడి లైనులో నుంచుని మరీ కొంటారు. సాయంత్రం బజ్జీలు మాత్రమే అమ్మే వాని దగ్గర విపరీతంగా జనం. ఖచ్చితంగా వాళ్ళు ధనం అప్పటికే సంపాదించిన వాళ్ళయి వుంటారు. అదే ఉదయం ఇడ్లీ, మధ్యాహ్నం భోజనం, రాత్రి బిర్యానీ.. చపాతి ఇలా అమ్మేవారి హెూటల్‌ని గమనించండి. ఎక్కడి గొంగళి అక్కడే అన్న చందంగా వుంటుందా వ్యాపారం. ఇదంతా చెప్పింది కేవలం ఇడ్లీ వ్యాపారం గానీ, భోజనం వ్యాపారం గానీ, బిర్యానీ హెూటల్ గానీ... ఏదో ఒక్కటి మాత్రవే చేస్తే ధనం అమితంగా సంపాదిస్తారని అర్థం చేసుకుంటే నేను చెయ్యగలిగేది ఏమీ లేదు.

## కొత్త వ్యాపారం ప్రారంభిస్తున్నారా...

చిన్న యాగం చేయించండి.. యాగం ప్రారంభానికి ముందు అగ్నిని జ్వలింప చేస్తారు. ఆ సమయంలో నిప్పు రవ్వలు లెగుస్తుంటాయి. ఆ నిప్పు రవ్వలను చూస్తూ మనసులో ఆ రవ్వలను ముద్రించుకొని మీ వ్యాపారం అభివృద్ధి కావాలని కోరుకోండి. ఆ నిప్పు రవ్వలకి మీ శ్రీమతికి రవ్వల ఆభరణాలను చేయించేంత శక్తి ఉంది.



## వ్యాపారంలో ధనం సంపాదించాలంటే చేయగూడనివి...చెయ్యాల్సినవి

- ఎంత ఖరీదుకి కొంటున్నామో ఉద్యోగులకి తెలియకూడదు.
- ఎక్కడ కొంటున్నామో పోటీ వ్యాపారస్థులకి అంతు చిక్కకూడదు.
- అమ్మకంలో ఆదాయంపై శ్రద్ధ వున్నట్టే కొనుగోలులో కూడా పోటీ వ్యాపారస్థుడికన్నా తక్కువకే కొనాలి.
- మీ ప్రాడక్ట్‌కి ఇమేజ్‌ని అడ్డం పెడితే మీరే నెం.1.
- వ్యాపారం ద్వారా ధనం సంపాదించటానికి లక్షలు పెట్టుబడి కావాలనుకోవటం వట్టి భ్రమ. కొద్ది డబ్బుతో కూడా అద్భుతం చేయవచ్చు. దానికి కావల్సింది పరిజ్ఞానం. అందుకే వ్యాపారానికి ముందు సంబంధించిన సంస్థలో పనిచేయాలి.
- మీకు సంబంధించిన వ్యాపారంలో నెం.1గా వుండే వానితో ఎలాంటి స్నేహసంబంధాలు పెట్టుకోవద్దు.
- కొత్తగా వ్యాపారం పెట్టాలనుకుంటే ముందుగా పదిశాతం మాత్రమే పెట్టుబడి పెట్టి చెయ్యండి. ఆపై ముప్ఫైయి శాతం... తర్వాత డెబ్భయి శాతం. ఆపై వందశాతం పెట్టుబడి పెట్టి చేయండి. ఇలా కాక ఒకేసారి వందశాతం పెట్టారో అంతే సంగతులు. అందిన కాడికి అందరూ దోచేస్తారు.

## లావాదేవీలు గలవారితో వద్దు

సరుకిప్పించిన వారితో చెట్టాపట్టాలేసుకుని తిరగద్దు. ఆ చనువు పెరిగి సరుకు తీసుకోవటం వరకే పదే పదే జరుగుతుంది. చెల్లింపు విషయంలో వారికీ, తీసుకునే మీకూ నిర్లక్ష్యం వస్తుంది.



అవసరం గుర్తుకురాగానే అడిగితే అప్పుడొస్తుంది అసలు సమస్య. 'ఇస్తాం...' అంటారు. ఆపై ధనమూ పూర్తిగా రాదు. వారితో వ్యాపారమూ పూర్తిగా పోతుంది. వడ్డీగా పోటీదారుడి పక్కన చేరతారు. మన వాళ్ళేగా అనుకుంటారు.. కానీ ఆ అయిన వాళ్ళే మీ వ్యాపారానికీ, కొంపకీ నిప్పు పెడతారు.

## లక్షలు సంపాదించేవాడు ఎంతో వినయంగా వుంటాడు

ఓ రోజు నా దగ్గరికి ఇద్దరు తెలిసిన వ్యక్తులొచ్చారు. అయిదు లక్షల చీటి వేస్తున్నాము.. పాటలాంటివి వుండవు.. డ్రాలో తగిలితే ఇవ్వటమే.. చివరదాకా డ్రా రాలేదని దిగులు పడక్కర్లేదు. మధ్యలో కావాలంటే రూపాయి పావలా వడ్డీకి రెండు లక్షలిస్తామని చెప్పారు. నేను 'అలాగా' అన్నాను. 'ఏదో ఒకటి చెయ్యాలి కదా సార్ బ్రతకటానికి' అన్నాడొకతను. నేను నవ్వి ఇందులో మీకు ఎంత వస్తుందన్నాను. వారు పెద్దగా ఏం రాదు సార్... డెబ్బయి మంది సభ్యులు. తిరగటానికే బోలెడు ఖర్చవుతుంది... అన్నారు. నేను వకటే మాటన్నాను. పదిహేను లక్షలు మీకిస్తాను... అందులో మిగిలేదంతా నాకిస్తారా అన్నాను. దానికి వారు చెప్పిన సమాధానం.. పాతిక లక్షలిచ్చినా ఇవ్వమన్నారు. ఒక్క పైసా కూడా పెట్టకుండా చీట్ చేస్తున్న ఆ మాటల మీద, మనుష్యుల అవసరాల మీద వ్యాపారం డిజైన్ చేసిన వాడికి హేట్సాఫ్.



## మానవనైజం

❀ రాయి తగిలతే రాయిది తప్పు.

❀ సంపాదించలేకపోతే... నా బాబు ఏమీ ఇవ్వలేదంటాడు.

❀ చేతగాని చవటైనా... అసలు ప్రయత్నం చెయ్యకుండానే నిరాశ చెంది తన రాతనీ... పుట్టించిన దేవుణ్నీ తిట్టుకుంటాడు.

❀ దేవుడికీ భగవంతుడికీ తేడా కూడా తెలియదు. జీవితంలో ఓడిపోవటానికి అంతకన్నా ఏం కావాలి... గెలవాలి... గెలవాలంటే.. కావాల్సింది.. కసి...కసి... కసితో కూడిన శ్రమ.

## మీ జోలికొస్తే వెయ్యి నష్టానికైనా అమ్మేయండి

అలా చేస్తే ఆ వెయ్యి మాత్రమే నష్టపోతారు. మీ పోటీదారులందరికీ అదో హెచ్చరిక. హమ్మో.. వాడి జోలికొస్తే వాడి వ్యాపారానికి అడ్డం వెళితే ఎంత నష్టపోయి అయినా తమకి నష్టం చేస్తాడని భయం కలుగుతుంది. ఆ భయమే మీ అత్యున్నత స్థితికి నిచ్చెన అవుతుంది. అలా అని అవతల వాళ్ళని మరింత భయపెట్టాలని చూడకండి. ఎందుకంటే భయం పెట్టాలి... శ్రుతి మించితే అది ద్వేషమై పగగా మారుతుంది.

## రెండో పెళ్ళాం...

వ్యాపారంలో ఎదగాలంటే ఎంతో శ్రద్ధ అవసరం. ఆ శ్రద్ధ ఎలా వుండాలంటే కొత్త పెళ్ళాంపై మొగుడి కుండేంత శ్రద్ధ చాలా అవసరం. వ్యాపారం, పెళ్ళాం ఒక్కటే. భార్యకి రక్షణ, లాలన... జాగ్రత్త లేకపోతే ఏమవుతుంది. అలాగే వ్యాపారంలో అలాంటి శ్రద్ధ లేకపోతే పరువూ, ధనమూ, మానం పోవటం ఖాయం.



వ్యాపారాన్ని పెళ్ళాంతో పోల్చటానికి కారణం.. చాలా మంది తమ భర్తలని వ్యాపార ధ్యాసలో పడి తమని కొద్దిగా నిర్లక్ష్యం చేస్తున్నారని భావించి 'మీ రెండో పెళ్ళాం వుందిగా (వ్యాపారం) ... అక్కడికే వెళ్ళండి' అని అనటం సహజం... అందుకే అలా పోల్చాను. అన్యధా భావించవద్దు.

## ప్రత్యర్థికీ, విరోధికీ తేడా

ఇద్దరు వ్యాపారస్థులు ఎదురు బొదురు ఒకే వ్యాపారం నిర్వహిస్తున్నారు. అందులో ఒకతనికి కొద్దిగా ముందు అవకాశం వచ్చి వేరే చోట వ్యాపార సంస్థని నెలకొల్పాడు. దానికి తొలి కొబ్బరి కాయని రెండవ అతని చేత కొట్టించాడు. అంతా ఆశ్చర్యపోయి అడిగారు అలా ఎందుకు చేశావని. 'నాకన్నా ముందే వచ్చి కొట్టు తీయటంతో నేను అతనికన్నా ముందు కొట్టు తీయసాగాను... అలాగే ఎంత ఆలస్యమయినా ఆయన మూసిన తర్వాతే నేను మూసే వాడిని. అలా చెయ్యటం వల్ల నా వ్యాపారం బాగా పెరిగింది. అతను నాకు వ్యాపార ప్రత్యర్థే కాని విరోధి కాదు. ఏ వ్యాపారస్థుడికయినా కావాల్సింది ప్రత్యర్థి మాత్రమే విరోధి కాదు. అందుకే నా ప్రత్యర్థితో నేను కొబ్బరి కాయను కొట్టించానని' చెప్పాడు.

## అగస్త్య మహర్షి ప్రతిరూపం

అవిశె చెట్టు.. ఈ చెట్టుని పూజించటం ద్వారా ఆలోచనా శక్తి పెరుగుతుంది. దూరదృష్టి కలుగుతుంది. వ్యాపారంలో బాగా కలిసి వస్తుంది.



## ఏ పంచాంగం ప్రకారం పండుగ చేసుకోవాలి

కొన్ని పంచాంగాలు ఈ రోజనీ, ఇంకొన్ని పంచాంగాలు పక్క రోజునీ రాస్తే మొత్తం పంచాంగాలనే వదిలెయ్యండి. అంటే ఒకరిది తప్పనీ, మరొకరిది సబబనేగా అర్థం. ఇంకా చెప్పాలంటే వాళ్ళే రోజు చెబితే ఆ రోజే జరుపుకోవాలా...? ఇంకా చెప్పాలంటే ఎన్ని పంచాంగాలు కొనాలి. ఆ విషయం వదిలేస్తే మీ దగ్గరిలో ఉన్న అతి పెద్ద పుణ్యక్షేత్రం ఏ రోజు చేస్తే ఆ రోజే పండుగ.

## శ్రీభగవద్గీతా.....!?

గెలవమని చెప్పింది... ధర్మం కోసం యుద్ధం చెయ్యమని చెప్పింది... వెనకడుగు వేస్తే పోయేది నీ ప్రాణాలే కాదు... నీ వారి ప్రాణాలు కూడా అని చెప్పింది శ్రీ భగవద్గీత. అవమానాలూ... బాధలూ... అగౌరవము... ఇన్ని పడ్డా అంతిమ లక్ష్యం విజయమే అని చెప్పింది. శ్రీభగవద్గీతని శ్రీకృష్ణుడు అర్జునుడికి ఏ సమయంలో చెప్పాడు? కర్తవ్యం మరిచినప్పుడు. అన్యాయాన్ని ఎదురించాల్సి వచ్చినప్పుడు.. అవమానాలకి ప్రతీకారం చెయ్యవల్సివచ్చినప్పుడు అర్జునుడికి శ్రీకృష్ణుడు చెప్పాడు. అంతేగాని మరో సందర్భంలో కాదు. ఆ మరో సందర్భంలో దయచేసి శ్రీభగవద్గీతని పంచకండి. చెప్పకండి. ఇంకా చెప్పాలంటే శ్రీభగవద్గీతలో భోజనం ఏం తినాలో, ఎలా తినాలని కూడా చెప్పాడు. అట్టి శ్రీభగవద్గీతని చదవాల్సింది మీ పిల్లలే.



## వ్యాపార, గృహ నివాసాలలోకి ఈ శబ్దాలు రాకూడదు

యజ్ఞ యాగ... హోమ శుభకార్యాల మంత్రాల శబ్దాలు మీ నివాసంలోకి వస్తే శుభం. దుష్టశక్తులు మీ గృహం లోంచి కుటుంబ సభ్యుల శరీరాల లోంచి, నివాసంలోంచి వెళ్ళిపోతాయి. వేరే ఏదన్నా జరుగుతున్న తంతు, మంత్ర శబ్దాలు వినగానే గృహంలో సంగీతపరమైన శబ్దాలని పెంచి వాటిని అటు నుంచి అటే వెళ్ళగొట్టండి.

## ఉద్యోగస్థులూ వ్యాపారంలోకి దిగద్దు....

వ్యాపారం కూడా అరవై నాలుగు కళల్లో ఒకటి లాంటిదే. సహజంగా ఉద్యోగస్థులకి అప్ప చెప్పిన పనిని సమర్థవంతంగా సరైన సమయానికి చేస్తే వారి ధర్మం పూర్తవుతుంది. వ్యాపారంలో రాబడి కోసం ఎంతోమంది ఎన్ని రకాలుగా ప్రయత్నిస్తుంటారో వారికి తెలీదు. కొత్తగా వ్యాపారంలోకి దిగారని రూపాయికి కొనే సరుకుని రెండు రూపాయిలు పెట్టి కొనిపిస్తారు. ప్రతిదీ పక్కవారు చెప్పింది వినటం... వారికి అవగాహన లేకపోవటం...ఇలా ప్రతి విషయంలోనూ పొరపాట్లు చేయటానికి కారణం ఉద్యోగస్థులు రెండో ఆదాయం కోసం చెయ్యటమే. మొదటి ఉద్యోగం వుంది కదాని భరోసాతో చేస్తారు. ఆ భరోసానే రిటైర్మెంట్ అప్పుడు వచ్చే ధనం కూడా చాలనంత అప్పుల్లో పడతారు. కాన ఆపై మీ ఇష్టం. ఉద్యోగస్థులు వ్యాపారంలోకి వచ్చారంటే ముడిసరుకూ, వస్తువులిచ్చే వాళ్ళకి పండుగే.



## పద్నాలుగు భువన భాండాల్లో
## నమ్మదగ్గ వ్యక్తి ఒక్కరే

భగవంతుడు... దేవుడు.. భర్త.. న్యాయం.. స్నేహితుడు.. ధనం.. కీర్తి.. వయసు.. ముక్కోటి దేవతలు... వీరంతా కారు.. ఒకే ఒక్కరు భార్య. సృష్టిలో తొలుత నమ్మదగ్గది భార్య మాత్రమే. ఎందుకంటే ఏం చేసినా, ఏం ఆలోచించినా తన కుటుంబం కోసమే చేస్తుంది. అదే పురుషుడు ముందు 'నా'. ఆ 'నా' నే కొంపముంచుతుంది. ఆ 'నా' పేరు చెప్పే చుట్టూ వారు బురదలోకి తీసుకు వెళ్తారు.

## ధన నష్టం ఏ దిశగా వచ్చి తగులుతుంది

- జాలి పడేవారి నుంచి.
- ఏదో బ్రతుకుతాడులే అని వదిలేసిన వారి నుంచి.
- పూర్తిగా నమ్మిన వారి నుంచి.
- మీకన్నా ఆదాయంలో తక్కువున్న వాని నుంచి లేదా మీరే మార్గం నుంచి ఎక్కువ సంపాదిస్తున్నారో తెలియచెప్పిన వారి నుంచి.
- మీకెంత ఆప్తులైనా అవతలి వారి సామాజిక వర్గానికి చెందిన వారయితే వందలో తొంభై మంది వారికే సహకారం అందిస్తారు.
- పాముకి పాలు పోస్తే కక్కేది విషమే. అలాగే అన్నం పెట్టిన మీ చేతినే ఎక్కువమంది కరుస్తారు.
- ఆర్థిక సంబంధిత విషయాల్లో పై విషయాలు గుర్తుంచుకోండి. మరిచారా... దేవాలయంలోని మర్రిచెట్టుకి సాయంత్రం అయిదు తర్వాత ప్రదక్షిణలు చేస్తే జరిగే నష్టం కన్నా ఎక్కువే వస్తుంది.



ఇప్పటికే అలా ధనం పోయినా తిరిగి సంపాదించవచ్చు. ధనం పోవటం, రావటం మనకే కాదు.. దేవతలకి సహితం జరిగింది. దుర్వాస మహర్షి శాపంతో దేవతలు ధనాన్ని నష్టపోయినా కష్టపడి ఆలోచించి సముద్రాన్ని మథించి ధనాన్ని తిరిగి పొందారు.

## ముక్కోటి దేవతలకి చేసే దోషం....

ఆత్మహత్య... నిజానికి పదిమందిని చంపటానికి ధైర్యం అవసరం లేదు. కానీ తన ప్రాణాన్ని తీసుకోవటానికి చాలా ధైర్యం కావాలి. ఎంత ధైర్యమంటే ఎవరెస్ట్‌ని టెన్సింగ్ వయసు అయిపొయ్యాక ఎక్కాడు. టెన్సింగ్ వయసుకన్నా ముప్పై సంవత్సరాల వయసు పైబడిన వారు ఎవరెస్ట్ ఎక్కటానికి ప్రయత్నించటమంత సాహసం. బాధలకీ, అవమానాలకీ, ద్రోహాలకీ, నయవంచనకీ, పెట్టుబడి దౌర్జన్యాలకీ.. ఆర్థిక సమస్యలకీ... ఇలా దేనికైనా కావచ్చు... చేసుకున్నారు. ఆ తర్వాత.. మీ వాళ్ళ సంగతి. మీకే అంత ద్రోహం చేసిన వాళ్ళు.. ఆపై మీ వాళ్ళకి ఎంత ద్రోహం చేస్తారు. మీరే ఆత్మహత్యకి పూనుకుంటే మిమ్మల్ని నమ్మి, ప్రేమించి.. ఇంకా మీరంటే ఇష్టపడే వారి పరిస్థితి ఎంత దిగజారుతుంది. ద్రౌపది బట్టలూడదీయబోయినందుకు పాండవులు ఆత్మహత్య చేసుకోవాలి. అంతకన్నా మీకు అవమానం జరిగిందా? అయినా వారు ద్రోహం చేసిన వారిపై ధర్మంగా, న్యాయంగా, చట్టబద్ధంగా ప్రతీకారం తీర్చుకున్నారు. అందుకే చెబుతున్నది ఓడిపోయిన ప్రతిసారీ... నష్టపోయిన ప్రతిసారీ.... ద్రోహం జరిగిన ప్రతిసారీ... అవమానం జరిగిన ప్రతిసారీ... సున్న



నుంచి లక్షల రెట్ల క్రింద నుంచి గెలవాలనుకుంటే శ్రీ మహాభారతం చదవండి. అంతే గాని ఆత్మహత్య ఆలోచన పెట్టుకోకండి. అది ముక్కోటి దేవతలకి చేసే దోషం.

## తూర్పున రావిచెట్టు... పడమరలో మర్రిచెట్టు వుంటే

అలా వుండటం వల్ల అనారోగ్యం. దోషం కూడా. దానివల్ల యజమానికి అనారోగ్యం. అలా వున్నట్లయితే కొబ్బరి చెట్టు లేదా పనస చెట్టు గృహ ఆవరణలో ఎక్కడయినా, అనగా ఏ దిశలోనైనా గానీ రెండు లేదా అయిదు చెట్లను లేదా కనీసం ఒక్క చెట్టునయినా నాటాలి. తద్వారా ఏ దోషం వుండదు సరికదా మరింత పలం. చేసే పనిలో రెండింతల ఫలం. అనుకున్న కార్యం నెరవేరుతుంది.

**విప్రుల పట్ల, ధర్మపరుల పట్ల, ఆధ్యాత్మిక పరుల పట్ల చేసిన దోషాలు పోవాలంటే ఉదయం లేవగానే 'ద్వారకా.. ద్వారకా... ద్వారకా..' అని మూడుసార్లు ఉచ్ఛరించి (ఆదివారం, ద్వాదశి) ఆపై కులదేవతను ఆరాధించి బిల్వవృక్షాన్ని పూజించటం ద్వారా ఆ దోషాలు తొలగుతాయి.**

## సంపదలు తిరిగి వచ్చే వ్రతం

తన సంతానం దిక్కులేకుండా తిరుగుతున్నప్పుడూ, వారి సంపదలు పోయినప్పుడు భర్త కశ్యపుని ఆదేశంతో అదితి క్షీరవ్రతం చేసింది. ఫాల్గుణ మాసం శుక్లపక్ష పాడ్యమి నుంచి పన్నెండు రోజుల పాటు కేవలం పాలు మాత్రమే తీసుకొని క్షీరవ్రతం పూర్తి చేసింది. తిరిగి పోయిన సంపదలనీ, సుఖాలనీ, ఆనందాలనీ పొందింది. - శ్రీమద్భాగవతం నుంచి



**కష్టాల నడి సముద్రంలో వుండి భయపడేవాడు భగవంతుడ్ని ఆశ్రయించాలి. అప్పుడు మృత్యువు సహితం భయపడుతుంది. కష్టాలను గట్టెక్కుతాడు. అలా చేసే త్రికూట పర్వత ప్రాంతంలో గజరాజు మొసలి నుంచి శ్రీమహావిష్ణువు ద్వారా రక్షింపబడ్డాడు.**

**- గజేంద్ర మోక్షం నుంచి**

## షడక్షరీ మంత్రం స్త్రీలకి మహా రక్ష...

పార్వతీ పతి ఈశ్వరుడు ప్రసాదించిన మంత్రం. స్త్రీలకు సకల మాన రక్షణ. ఒకానొకప్పుడు దాశార్హుడనే రాజు కోరిక కలిగి భార్యని పడక మీదకు ఆహ్వానించాడు. ఆమెకాదనటంతో పురుష బలంతో పట్టుకున్నాడు. కొలిమిలో కాలుతున్న గునపం పట్టుకున్నట్టు మండిపోయింది. దాంతో రాజు 'ఏమిటిది అని అడిగాడు. "ప్రభూ! షడక్షరీ మంత్రం ప్రభావం ఇది. నా భర్తయినా సరే మద్యపానం చేసి, స్నానం చెయ్యకుండా పట్టుకున్నందుకు మీకలా అయ్యింది. భార్య అయినా సరే నా ఇష్టం మీదే అనుభవించాలి. ఆ మంత్రం నేను నిత్యం పూజానంతరం జపించటం వల్ల పర పురుషులు నన్ను తాకలేరు. ఈ దృష్టితో చూడలేరు" అని చెప్పింది.

## ధనంతో పాటు కీర్తి రావాలి

- ధనం సంపాదన మహా సంతృప్తినిస్తుంది.
- మహా అయితే నీ భార్యకి... ఇంకా చెప్పాలంటే మీ పిల్లలకి.
- అదే పదిమందికి నచ్చే వృత్తిలో వుండి సంపాదిస్తుంటే



పైవాళ్ళు గర్వంగా చెప్పుకుంటారు. అదే వంద మందికి నచ్చే వృత్తిలో వుంటే మీ చుట్టూ వున్న వాళ్ళు అభిమానిస్తారు.

- అదే వెయ్యి మంది, లక్ష మందికి నచ్చే వృత్తిలో సాధిస్తే.. గెలిస్తే ప్రపంచం నీరాజనం పడుతుంది.

- డబ్బు సంపాదించటానికి రెండు మార్గాలు... ఒకటి రోడ్డు మీద బజ్జీలమ్ముకున్నా కోటీశ్వరుడు కావచ్చు. దేశానికి ఓ సరికొత్త పరికరం తయారు చేసి ఇచ్చినా కోటీశ్వరుడు అవ్వచ్చు. తేడా ఏమిటంటే మొదటి దానితో డబ్బు మాత్రమే వస్తుంది. అది ఎవరైనా చేస్తారు. డబ్బు, కీర్తి రెండూ రెండవ దాంతో వస్తాయి. అదీ అద్భుతమైన జీవితం. దాని దిశగా ప్రయత్నం చేయటానికి సాహసం కావాలి. ఆలోచన కావాలి... సంకల్పం కావాలి.

## ఏ దిశలో ఏ వృక్షం వుంటే మీ గృహంలో సుఖాలుంటాయి

- దక్షిణదిశలో అత్తిచెట్టు... తూర్పుదిశలో మర్రిచెట్టు... ఇక పడమర దిశలో జమ్మిచెట్టు, ఉత్తర దిశలో జువ్విచెట్టు, ఈశాన్యంలో రావిచెట్టు, ఆగ్నేయంలో మేడిచెట్టు.. వాయవ్య దిశలో మోదుగ చెట్టు వుండటం వల్ల గృహంలో నివశించే వారికి, ఇంటి యజమానికీ సుఖమయ జీవితం.

## రుక్మిణీ దేవి గౌరీదేవిని వేడుకున్న వైనం

శ్రీకృష్ణుడే తన భర్తగా తలచి రుక్మిణి బాధగా 'అడవికి రారాజు సింహం తినాల్సిన ఆహారం నక్క ఎత్తుకుపోవటానికి చూస్తోంది. ఓ శ్రీకృష్ణా ... నిన్నే భర్తగా వరించాను. నా వివాహ లగ్నం ముందే



వచ్చి నన్ను తీసుకెళ్ళు. ఊరిబైట గౌరీదేవి ఆలయంలో పూజ చేసే సంప్రదాయం ప్రకారం అక్కడికి వస్తాను' అని రుక్మిణి శ్రీకృష్ణుడికి సందేశం పంపింది... గౌరీదేవిని పూజిస్తూ... 'తల్లీ గౌరీదేవీ... సకల శుభమంగళాలను ఇచ్చే నీకూ.. నీ పుత్రుడైన విఘ్నేశ్వరునికీ నమస్కరిస్తున్నాను' అని సమస్కరించింది. వెనక్కి తిరిగేసరికి శ్రీకృష్ణుడు... లోకమాత చేతిని లోకేశ్వరుడు అందుకున్నాడు.

- రుక్మిణీ కళ్యాణం నుంచి

## ఏ ఆధ్యాత్మిక గ్రంథాలు ఎప్పుడు చదవాలి

దేవీ భాగవతం... తిరుప్పావై... పతివ్రతల గాథలను ఉదయం పూట చదవాలి. శ్రీమహాభారతము మధ్యాహ్నం సమయంలో, శ్రీభాగవతమును సాయం సమయంలో చదవాలి. ఇక శ్రీరామాయణము వివాహం కాక ముందు చదవాలి. లేదా సంతానం కలిగే ముందు చదవాలి. ముప్ఫయి అయిదు తర్వాత శ్రీరామాయణం చదవటంవల్ల ఏం ప్రయోజనం? ఇక శ్రీ భగవద్గీతను గెలవాలనుకున్నప్పుడూ, పూర్తిగా ఓడిపోయినప్పుడూ చదవాలి. సమయం, వయసుతో నిమిత్తం లేకుండా అన్నీ అర్థం చేసుకుని చదివే వారు దేవుడి ప్రతినిధి. సన్యాసి ఎప్పుడైనా చదవచ్చు. గురువు తెల్లవారుజామున చదవాలి. గృహస్థు పై తెలిపిన ఆయా సమయాల్లో చదివితేనే భక్తి.. ముక్తి.. రక్తి.



## భగవంతుడు ఇచ్చిన అవకాశాలను వినియోగించుకోవాలి

దేవుడు ప్రతివారికి అవకాశం ఇస్తాడు. వారసత్వము.. లేనితనమూ.. పేదరికం.. ఇలా ఎవరికైనా ఇస్తాడో అవకాశం. అది వినియోగించుకోలేకపోతే ఈసారి భగవంతుడు మరోసారి అవకాశం ఇస్తాడు. దాన్నీ వినియోగించుకోకపోతే నీ ఖర్మ అని వదిలేస్తాడు.

## తొలిసారి గుడ్డిగా నమ్మండి

కొత్తవారితో ఆర్థిక పరమైన పరిచయం... అనగా వ్యాపార పరంగాగానీ మరేదయినా ఆదాయ మార్గం ద్వారా గానీ తొలిసారి చేస్తున్నప్పుడు మొత్తం అతనికే అప్పచెప్పండి.. మీరేం పట్టనట్టు.. అంతా నీకే అప్పచెప్పాను అన్నట్టు ప్రవర్తించండి. మధ్య మధ్యలో ఎలా వుంది.. ఎంతొచ్చింది? లాంటి ప్రశ్నలు మాత్రమే వెయ్యండి. అతని మనస్తత్వము ఏమిటో అర్థమవుతుంది. బైట పడద్దు. సమయం రాగానే ఆ నాలుగు రోజుల లెక్క చెప్పమనండి. లెక్కలు చూసుకోండి. ఆ తర్వాత అతను నిజాయితీపరుడని తేలితే జాగ్రత్తగా కలిసి ప్రయాణించండి. తేడా చేశాడంటే చేసిన విషయం మీకు తెలిసిపోయిందన్న విషయం కూడా తెలియనీయకుండా దూరంగా వుంచండి. చాలా సంవత్సరాల దాకా తననెందుకు మీరు రానివ్వటం లేదో అర్థంకాక చస్తాడు. తెలిశాక సిగ్గుతో చస్తాడు. వ్యాపారం లేదా కార్యము అప్పచెప్పేటప్పుడు పరిమితకాలం అనగా వారం లేదా పదిరోజుల ట్రాన్సాక్షన్ మాత్రమే అప్ప చెప్పండి సుమా. మరీ ఎక్కువయితే మీరేసిన వలలో మీరే పడాల్సి వస్తుంది.



## రావాల్సిన బాకి వందయినా వదలొద్దు

'ప్రతి దుకాణంలోనూ మీ ప్రాడక్ట్ వుంటుంది. అంత సాధన ఎలా చెయ్యగలిగారని' అడిగాను. దానికి అతను 'వంద బాకీ వున్నా పదిసార్లు తిరిగయినా వసూలు చేస్తాను. దానికి కారణం వంద గురించి కాదు.. ఆ వంద గురించి అతను మా దగ్గరికి రాడు. ఏదో వకటి దానికి నకలో, నా పోటీ వ్యాపారిదో తెచ్చి అమ్మేసుకుంటాడు. బాకీ వదిలెయ్యటం వల్ల డబ్బుతో పాటు వ్యాపారం కూడా నష్టమని నేను పైసా కూడా వదలను... అలా ఉండటం వల్లే నేను నా వ్యాపార సామ్రాజ్యాన్ని పటిష్ఠ పరచగలిగాను' అని చెప్పాడు. 'కానీ అదే వారు ఆర్థికంగా పూర్తిగా నష్టపోయినప్పుడు లక్ష అయినా మేం ఎప్పుడూ ఒత్తిడి చెయ్యం' అని కూడా చెప్పాడు.

## రివెంజ్ మనస్తత్వం గల వాళ్ళకి దూరంగా వుండండి

చిన్న మాటంటే చాలు గుర్తుపెట్టుకొని ఏదో రకంగా దెబ్బ తియ్యాలనుకునే మనస్తత్వం గలవారుంటారు. వారు పైకి చాలా అమాయకంగా కనపడతారు. అలాంటి వాళ్ళతో తేడా వస్తే కనుక్కోవటం తేలిక. ప్రవర్తన క్షణంలో మారిపోతుంది. వ్యాపారం బాగా చేసుకోవటం ఒక కళ. ఆ సామ్రాజ్యాన్ని కూల్చాలనుకునే వాళ్ళతో ఏమరుపాటుగా, లౌక్యంగా వుండాలి. తెలివిగా, మర్యాదగా అలాంటి వారిని పూర్తిగా దూరంగా వుంచాలి.



## దగ్గరుండి మరీ పెద్దోడ్ని చెయ్యకండి

మీ రంగంలోనే కొత్తగా వచ్చి చిన్నగా ఏదో చేసుకుంటు న్నాడనుకోండి. వాడ్ని తొక్కేయాలని చూడకండి. చాలా దూరంగా వుండండి. కదిలించారో తేనెతుట్టే. నేనేదో చేసుకుంటుంటే కదిలిస్తాడా అని కసి వాడిలో బైలుదేరుతుంది. కాన అలాంటివి వద్దు. కాదని కదిలిస్తే థైరాయిడ్ టెస్ట్ చేయించుకున్న తర్వాత లేబరేటరి వాళ్ళు ఏం లేదని చెబితే నిర్లక్ష్యంగా ఆ రిపోర్ట్‌ని పక్కన పడేసి మీ పని మీరు చూసుకుంటే ఎంత ప్రమాదం జరుగుతుందో అంత ప్రమాదం జరగటానికి ఆస్కారం వుంది. మీకు ఏమీ లేదని చెప్పాల్సింది డాక్టర్ గాని లేబరేటరి వారు కాదు. అలాగే పెద్దోడవ్వాల్సింది వాడు... మీరే ఇన్స్పిరేషన్ అవ్వకూడదు.

## చిల్లర మర్చిపోతే...

చాలామంది చిల్లర తీసుకోవటం మర్చిపోయి వెళ్ళిపోతుంటారు. ఆ తర్వాత గుర్తుకొచ్చి వచ్చి అడుగుతుంటారు. వారి డబ్బు వారికి గల్లాలోంచి తీసి ఇవ్వకండి. ఎవరైనా మర్చిపోతే పొట్లం కట్టి ఓ పక్కన పెట్టండి. వచ్చినప్పుడు ఆ పొట్లాన్ని వారి ముందే తీసి ఇవ్వండి. ఆ చిన్న చర్య అతను చేత మీ గురించి మీ దుకాణం గురించి వందమందికి చెప్పిస్తుంది. అది మీ వ్యాపారానికి పెద్ద ప్రచార మాధ్యమము అవుతుంది.

## భూమి మీద పడ్డప్పుడే వీడికింత అని రాస్తాడు

వాడు పదికోట్లు సంపాదించాడు. వీడు ఇరవై కోట్లు సంపాదించాడు అని తెలిసిన వారిని చూసి మధనపడితే వ్యాపారం



కుంటు పడుతుంది. చొక్కాలు చించుకుంటూ వ్యథ చెందితే ధనం రాదు. కృషి చేయాలి. వచ్చేది ఎలాగూ వస్తుంది. రానిది ఎంత కొట్టుకున్నా రాదు. అయినా మీ దగ్గర లక్ష వున్నా, కోటి వున్నా మీరు అనుభవించేది అదే. తినేది అంతే. డబ్బు కావాలి... ఓ పరిధి దాటితే డబ్బు సుఖాలనివ్వదు. జీవితానికి సరిపోయే ధనం సుఖాన్ని ఇస్తుంది. ఎక్కువయిన కొద్దీ సమస్యలూ, కష్టాలూ, బాధలే. కాన ధనరాబడీ, కోట్ల ఆస్తులకన్నా.... వ్యాపారం, ఆరోగ్యం, అందం, ఆనందం... సుఖాలు. ఇవే ముఖ్యం.

## పిల్లనిచ్చేటప్పుడు ఇల్లు వాకిలి చూస్తారు... మరి వ్యాపారంలో అప్పు

ఇల్లు, వాకిలి చూడకుండా పిల్లనివ్వరు. అలాగే వ్యాపారంలో అప్పు ఇచ్చేట్పుడు దుకాణం చూసి ఇవ్వాలి. అలా కాకుండా పెద్ద ధనమున్న వ్యాపారిలా ప్రవర్తిస్తున్న అతని మాటలూ, చేతలూ, చేతికున్న ఉంగరాలని చూసి అప్పిస్తే రోజూ ఉదయం పూట వాకింగ్ చెయ్యక్కర్లేదు.

## మంచికి పోయి తోటి వ్యాపారి గురించి మాట్లాడొద్దు

మీరు నిజమే చెప్పి వుండచ్చు. కానీ అవతల వాళ్ళు మీ మాటలను ఆదర్శంగా, అవకాశంగా తీసుకుని పనిగట్టుకుని వెళ్ళి మరీ చెప్పి వారి పబ్బం గడుపుకుంటారు. ధర్మం... న్యాయం, మంచి.. చెడు చెప్పే వృత్తిలో మీరు లేరు. వ్యాపారంలో అన్నీ అందరికీ తెలుసు. మీరు మంచికి చెబుతారు వాళ్ళు దాన్ని రహదారిగా చేసుకుంటారు. వాళ్ళు బ్రతికితే పర్వాలేదు.. మీ పొట్టగొడతారు. మీకూ, వారికీ గొడవలు పెడతారు.



## దయచేసి ఒక్క మాట వినండి

ఉదయం పూట అల్పాహారం వారానికి ఒక్కసారన్నా మానండి. మీకు శ్రీవేంకటేశ్వరుని మీద భక్తి వుంటే శనివారం, ఈశ్వరుడి మీద భక్తి వుంటే సోమవారం రోజున అల్పాహారం మాని ఒక గ్లాసు నీటిలో మూడు చెంచాల తేనె, ఒక చెక్క నిమ్మరసం కలిపి తీసుకోండి. మధ్యాహ్నం మీ ఇష్టం. మీరెంత ఏక్టివ్‌గా మీ వ్యాపార సామ్రాజ్యాన్ని విస్తరిస్తారో చూడండి. పై హెడ్డింగ్ నేను చెప్పింది కాదు.

## చెడు అలవాట్లుంటే పనిలోకి పెట్టుకోకండి

మద్యం.. పొగ ఇత్యాదివి వారి జీతంతో వారే ఖర్చు పెట్టుకుంటారు మనకెందుకు అనుకోవటం తగదు. వచ్చే జీతమెంత? అయ్యే ఖర్చెంత? ఎక్కడ్నించి వస్తాయి. అలవాట్లు, వ్యసనాలు మనిషిని ఎంతకయినా దిగజారుస్తాయి. సాధ్యమైనంత వరకు బాగు చేయటానికి ప్రయత్నించండి. వ్యసనాలు లేనివారు మీ దగ్గర పనిచేస్తుంటే మీకెంత హాయిగా వుంటుందో అనుభవించండి. ఇప్పటికే మీ దగ్గర అలాంటి వాళ్ళుంటే మీరు శ్రద్ధ తీసుకుని మాన్పించండి. కడుపున పుట్టిన వాళ్ళే కాదు, మన దగ్గర పనిచేసే వాళ్ళూ మన పిల్లల లాంటి వారేనని భావించండి. అప్పుడే మీ వ్యాపారం మూడు పువ్వులు, ఆరు కాయలుగా వుంటుంది.



## మీ వ్యాపారం కళకళలాడిపోతుంటే...

ధనం సంపాదన ఒక్కోసారి వరదలా వచ్చేస్తుంది. వ్యాపారం కళకళ లాడిపోతుంటుంది. అందరి దృష్టి మీ పైనే. పైకి మంచి మాటలు.. వినయంగా మాటలు. ఎక్కడో తేడా వస్తుంది. వాడిది వాపు అది తగ్గినప్పుడు చూడమా వీడి బ్రతుకు.... అన్న నరఘోష. అలాంటి ఘోషలు పోవాలంటే వారానికి ఒక్కసారి లేదా బాగా వ్యాపారంలో మంచి రాబడి లేదా గొప్ప మార్పు తీసుకొచ్చిన రోజు ఇంటికి రాగానే తల్లి లేదా భార్య చేత చీపురును వెనక్కి తిప్పి ఎడ,పెడ ముఖంగా మూడేసిసార్లు తిప్పి, ఆపై అదే వెనక్కి తిప్పిన చీపురుతో కాళ్ళ ముందు మూడుసార్లు కొట్టించి దిష్ఠి తీయించుకోవాలి. అలా చేయటం వల్ల మీ వ్యాపారానికీ, మీకూ తగిలిన దిష్ఠి అంతా తొలగిపోతుంది. ఆపై కాళ్ళు కడుక్కొని తలపై నీళ్ళు చల్లుకుని ఇష్టదేవతా మంత్రాన్ని 11సార్లు స్మరించుకోవాలి.

## కాస్ట్లీ మిస్టేక్ చేయద్దు...

పొరపాట్లు మానవ సహజం. జీతమిస్తున్నాను కదాని ఎక్కడ పడితే అక్కడ, ఎవరిముందు పడితే వారిముందు పనివారిని అరవవద్దు. వ్యాపారానికి అత్యంత మూలస్థంభం ఉద్యోగే. కడుపు తిప్పల కోసం పనిచేసేవాడ్ని కడుపుకోతకు గురి చేస్తే మహా మానవతప్పిదం జరిగినట్టే. మీ వ్యాపారానికి వినియోగదారుడూ, సేవకుడూ రెండు కళ్ళ వంటివారు. వారు వ్యాపారం పెరగకూడదనీ, చెయ్యకూడదనీ భావిస్తే అసలకే తిప్పలు వస్తాయి. మీరు వంద కాదు వెయ్యి అయినా ఇవ్వండి రూపాయి తేడావచ్చినా ఆ నిమిషం



అక్కడికక్కడే పంపించేయండి మర్యాదగా. రూపాయే కదా అని వదిలేస్తే, పనెట్లా అనీ, పనివారు దొరకరనీ భావిస్తే.... ఆలోచిస్తే కరువు, ప్రాంతము నుంచి దేశానికి పాకినట్టు మీ సంస్థలో పనిచేసే అందర్నీ అవినీతిపరులని చేస్తుంది.

## గృహ ఆవరణలో ముళ్ళ చెట్లు వుంటే

రేగిచెట్టు... కుంకుడు చెట్టు... సంపెంగ, చింత చెట్టు(ఈ చెట్టును చింతవృక్షం అని అంటారు), మారేడు చెట్టు సంపద తరుగుదలకి మూలం. అందుకే వాటిని శివాలయాల్లో, ఆధ్యాత్మిక ఆశ్రమాల్లో పెంచుతారు. ముళ్ళ చెట్టు వుంటే శత్రువు వృద్ధి అవుతాడు. మీ జీవితమంతా వారిని ఎదుర్కొనటంతోనే సరిపోతుంది. అలాగే పండ్లవృక్షములు వుండటం వల్ల సంతానం వృద్ధి అవ్వదు. (అరటి, జామ, టమోటా పండ్ల చెట్ల కిందకి రావు).

## ఎక్కడ పడితే అక్కడ సంతకాలు పెట్టొద్దు

కష్టాలూ, సమస్యలూ, ఆపదలూ సహజం. అప్పుడే నిబ్బరంగా ఆలోచించాలి. అలాంటి పరిస్థితుల్లో అవతల వారు చెప్పే షరతులు అప్పుడు బాగానే వుంటాయి. పూర్వము గుర్రాలు అడవిలోనే వుండేవి. ఓసారి ఓ గుర్రాన్ని సింహం వేటాడబోయింది. ప్రాణభయంతో అది పరిగెత్తింది.. దారిలో ఓ మనిషి ఎదురైతే తన సమస్య చెప్పి సహాయం చెయ్యమంది. 'నేను వ్యాపారిని... నిన్ను కాపాడతాను... కాపాడితే నేను చెప్పింది చెయ్యాలన్నాడు.' అది సరేనంది. వ్యాపారి అన్నట్టుగానే గుర్రాన్ని సింహంబారి నుండి



కాపాడాడు. తనతో పాటు గుర్రాన్ని తెచ్చి తన గొడ్లసావిడిలో వుండమన్నాడు. వేళకి తిండి పెడతానన్నాడు. బైటికెళ్ళినప్పుడు స్వారీ చేస్తానన్నాడు. సింహం భయముండదన్నాడు. నిజమేననుకుంది. ఆ తర్వాత అర్థమైంది. తనకి స్వేచ్ఛ పోయిందని. తన సంతానం కూడా ఇలాగే బాధలు పడాలని అణిగి మణిగి వుండాలని అర్థమయ్యింది. అలా మనిషి గుర్రాన్ని ఆపదలో కాపాడి అవసరాన్ని గుర్తించి షరతు పెట్టి మన మధ్యకి తెచ్చాడు. కాన షరతులు ఎప్పుడూ మీరే పెట్టాలి.. అది ఏ వ్యవహారంలోనైనా సరే.

## వ్యాపారమే కాదు ధర్మకార్యాలూ చేయాలి

పూర్వము వ్యాపారస్థులు కొనుగోలు పూర్తయ్యాక ధర్మం అని పావలా, బేడా కలిపేవాళ్ళు. అలా కలిపిన వన్నీ నిజాయితీగా లెక్క గట్టి బావులూ, గుళ్ళూ, సత్రాలూ కట్టించేవాళ్ళు. మొక్కలు అనగా శివాలయాల్లో, విష్ణు ఆలయాల్లో వృక్షాలను నాటించే వాళ్ళు. అలా ఏర్పడినివే చాలా వరకు. (కొంతమంది వేరే వాటికి తగలేసేవాళ్ళు. అది వేరే విషయం). మంచి, చెడూ రెండూ వుంటాయి.

దేన్నుంచయినా మంచే తీసుకోవాలి. ఇప్పుడు ధర్మం అని వేస్తే ఎవ్వరూ ఒప్పుకోరు. కాన మీ లాభంలోంచి అయిదుపైసలు వాటా తీసి ధర్మకార్యాలకి వినియోగిస్తే మీ వ్యాపారం మీ ముని, ముని మనవళ్ళ దాకా నిలుస్తుంది.



## నీవు బలహీనపడితే... అధైర్యం చెందితే...

- నిన్న కూలికొచ్చిన వాడు కూడా నిన్ను బెదిరిస్తాడు.
- వందమంది ష్యూరిటి పెట్టేవాళ్ళున్నా.. నిన్నే పెట్టమని అడుగుతాడు.
- నీ దగ్గర అరా కొరా మిగిలిన విలువైంది వుంటే దాన్ని కూడా పొందటానికి చూస్తాడు.
- చెప్తాడు.. శాసిస్తాడు.. మీ భయాన్ని మరింత పెంచుతాడు. ఆపై నేనున్నానంటాడు. కేవలం మాటలే...
- పూర్తిగా దిగజారిన తర్వాత తన దగ్గర టీ తేవటానికి లేదా పనిమీద వెళ్ళేటప్పుడు తోడుకి తీసుకెళ్తాడు.
- సకల కోపాలూ నీ మీదనే చూపిస్తాడు.
- నీ శత్రువంటే భయాన్ని తనూ పొంది... తప్పంతా నీదేనన్నట్టు అందుకే అలా అయ్యావని తిరిగి మీకు నీతులు చెబుతాడు.

కానీ... ఆటుపోట్లు సహజం.. సింహం జూలు విదిలిస్తే ఎంతసేపు.. అంతే. ఓడిపోవటం ఎవ్వడైనా ఓడతారు. గెలవటము ఎంతోమంది గెలుస్తారు. కానీ ఓడి.. ఆ తర్వాత అత్యంత క్రిందిస్థాయికి వెళ్ళి మళ్ళీ ఉవ్వెత్తున ఎగిసిన కెరటంలా మారాలి. చూసేవాడికేం తెలుస్తుంది.. కెరటం ఎంత వేగంగా.. ఎంత వూపుగా ... ఎంత అహంగా... ఎంత గంభీరంగా ఎంత ఆత్మవిశ్వాసంతో లెగుస్తుందో. అలా లెగవాలి. గెలిస్తే మజా కన్నా ఓడి గెలిస్తే వుండే మజా వేరు.



## గృహంలో అరటిచెట్టు ఆంజనేయస్వామికి ఆకు పూజ చేసినంత ఫలం

హనుమను 'కదళీవనచారి' అని సంబోధిస్తుంటారు. అరటిచెట్టు గృహంలో వుండటమంటే శుభకరం. ఆంజనేయునికి అత్యంత ప్రీతికరం. అరటిచెట్టు నాటడమంటే ఆంజనేయస్వామి విగ్రహప్రతిష్ఠ చేసినట్టే. అంత ఫలం కూడా. అయితే అరటిచెట్టు ప్రధాన గృహ ద్వారం ఎదురుగా ఉండరాదు. ఉదయం లేవగానే చూడరాదు. ఎందుకంటే ఆంజనేయస్వామి బ్రహ్మచారి. వయసైపోతున్నా ఇంకా వివాహం కానివారిని ప్రొద్దున్నే లేవగానే చూడకూడదని పెద్దలు చెప్పింది అందుకే.

## రామదేవుని ప్రసాదం

ఆవుపాలు.... గోధుమరవ్వ.... బెల్లం.... (పంచదార కాదు). ఆవుపాలల్లో బెల్లం కలిపి ఆపై గోధుమరవ్వ కూడా కలిపి ఉండలుగా చేసి నైవేద్యంగా పెట్టాలి. గృహంలో ఎంతమంది వుంటే అన్ని వుండలు చేసి శ్రీరామదేవునికి పెట్టడం వల్ల గృహశాంతి లభిస్తుంది.

## ఏకాదశి నాడు భుజించాల్సిన పదార్థాలు

లోకంలో ధన బాధలు పోవటానికి సృష్టికర్త బ్రహ్మదేవుడు కుబేరునికి ఏకాదశి తిథిని ఇచ్చాడు. ఆ రోజున అగ్నిలో మండించిన పదార్థాలని కాకుండా.... అనగా ప్రకృతి ప్రసాదించిన పండ్ల వంటివి తినటం ద్వారా పోయిన ధనం లేదా రావాల్సిన ధనం తిరిగి వస్తుంది.



## పువ్వుల్లో పెట్టి.. కాలుకదపకుండా చూసుకునే భర్త కోసం

పద్నాలుగు భువన భాండాలని పాలించేవాడూ, శ్రీలక్ష్మీ వల్లభుడూ.. ధర్మరక్షకుడూ అయిన వైకుంఠవాసుని దివ్య ఆశీస్సులు కలిగిన భర్త కోసం ఏకాదశి నాడు శ్రీమహావిష్ణుపూజ చేయాలి. పూజలో... 'ఓం నమో మనోభవాయ' అని పలికి లక్ష్మీపతి శిరస్సును 'నమః కామాయా' అనీ, భుజాలని 'నమఃఅనంగాయ' అనీ, 'నమఃసుశాస్త్రాయ' అని నడుమునూ, ... 'నమో మన్మథాయ' అని ఉదరాన్నీ, పాదాలని సమస్కరించి 'నమో హరయే నమః' అని మొత్తం శ్రీమహావిష్ణు దివ్య మంగళ స్వరూపాన్ని స్మరించాలి. శ్రీమహావిష్ణువుకి ప్రీతికరమైన పూలను విరివిగా సమర్పించాలి.

- పద్మ పురాణం

## శ్రీమహావిష్ణు దర్శనం కలిగించే పుణ్యం

ఎంత నీచవృత్తి చేస్తున్నా వృత్తి ధర్మాన్ని ప్రేమించే వాడినీ, తల్లి తండ్రిలను పరమ భక్తి ప్రపత్తులతో సేవించేవాడ్నీ, సకల సద్గుణవంతురాలూ, మహా పతివ్రతా ధర్మాలని పాటించే స్త్రీలనీ, వ్యాపారంలో సహితం అసత్య మాడని వైశ్యుడ్నీ, ధర్మం తప్పకుండా జీవనం సాగించే వాడినీ... పై ఇంతమందిలో ఒక్కర్నయినా రోజుకి ఒక్కసారి దర్శనం చేసుకుంటే చాలు... వారి మార్గంలో ప్రయాణిస్తే చాలు... శ్రీమహావిష్ణువే మీ ముందు ప్రత్యక్షమవుతాడని పద్మపురాణం శెలవిస్తోంది.



## ఆగ్నేయమున ఈ వృక్షాలు వుండరాదు

క్షీరవృక్షములు.. ఔదంబర వృక్షములు... జువ్విచెట్టు.. కదళీ వృక్షము, చెంపకములు(దక్షిణదిశలో) వుండరాదు. అలావుంటే పీడలూ, భయాలు కలుగుతాయి. ప్రమాదాలు ... అనగా చిన్న చిన్న హానికరం గాని ప్రమాదాలు సంభవిస్తుంటాయి. ఆ దిశగా అలాంటి వృక్షాలుంటే పనస చెట్టు నాటుకోవాలి. పనసచెట్టు ఆయా చెట్ల దోషాలను దూరం నుంచి అరికట్టి అమృతవీచికలుగా చేస్తుంది. అందుకే పెద్దలు పెరటిలో కొబ్బరిచెట్టు లేదా పనసచెట్లని పెంచమని చెప్పేది.

## ధనాన్ని తెచ్చిపెట్టే అయిదు మొక్కలు

మొదటిది తులసి.. నెగిటివ్ ఎనర్జీని నిరంతరం తొలగిస్తుంది. రెండవది మనీప్లాంట్. మనీప్లాంట్ని చాలా మంది పై నుంచి ప్రాకేలా వుంచుతారు. కానీ క్రింద నుంచి పైకి పాకాలి. మూడవది వెదురు బద్దలకి ఎర్ర రిబ్బన్ కట్టే మొక్క. అది గృహంలో వుండటం వల్ల కుటుంబ ఐక్యత. నాలుగవది నాలుగే ఆకులు గల మొక్క... ఉదయాన్నే బైటికెళ్ళే వాళ్ళు ఈ మొక్కని చూసి వెళితే శుభం జరుగుతుందని పాశ్చాత్త్యుల నమ్మకం. దాన్ని వారు ఫోర్ లీఫ్ క్లోవర్ అని అంటారు. ఇక ఐదవది స్నేక్ ప్లాంట్. గృహంలోకి విషగాలులనూ, క్షుద్ర శక్తులనీ రానీయకుండా చేస్తుందని పాశ్చాత్తుల నమ్మకం.

## విజ్ఞుల లక్షణాలు ఇవికావు

- ద్రోహం చేసిన వారికి తిరిగి ద్రోహం చెయ్యటం.
- మొగుడు తిరిగాడని తానూ తిరగాలని భార్య అనుకోవటం.
- చావుకు... చావే అనే తత్త్వము...
- బాధించిన వాడ్ని బాధించాలనుకోవటం..
- తను చెడిపోయాను గాబట్టి తనతో వున్న వాళ్ళనీ చెడగొట్టాలనుకోవటం...
- తన నాశనానికి కారణమైన వాళ్ళని నాశనం చెయ్యాలనుకోవటం...
- తను నష్టపోయినట్టు వాళ్ళూ నష్టపోవాలనుకోవటం...

ఇవన్నీ విజ్ఞులూ, శ్రేష్ఠులూ చెయ్యదగ్గవి కావని పురాణాలు చెబుతున్నాయి. అయితే శ్రీమహాభారతం మాత్రం ప్రతీకారమే పరమసోపానమని ఖచ్చితంగా చెబుతోంది.

## పూర్వము ప్రతి పెరటిలోనూ తులసి వనం వుండేది

- తులసి గాలి పీలుస్తేనే సకల రోగ వినాశనము.
- పాముల నుంచి రక్షణ కోసం ఎక్కువగా తులసిని పెంచేవారు. ప్రమాదం జరగగానే తులసి రసం తీసి తాగించే వాళ్ళు.
- వనాలు పెంచే నేల లేకపోయినా ప్రతి ఇంట్లో ఓ తులసి మొక్కనయినా వుండేలా చూసుకుంటే భక్తి, ఆధ్యాత్మికతలతో పాటు చక్కటి ఆరోగ్యం కూడా.



## రత్నాల్లో మీకెన్ని తెలుసు.. ఎన్ని ధరించారు....

వజ్రాలు... పద్మరాగ... ముక్తా.. మహానీల... వైఢూర్య... ఇంద్రనీల.. గంధసస్య..భ్రామర.. వజ్రమణి ... టిట్టిబ... భుజంగమణి...గరివ్రజ.... ప్రవాళ.. పీలు... సీస... తుష్యక... మరకత... ధూరీ... భల్లాతక.. రుధిరాక్ష.. గోమేద.. బ్రహ్మమయ... శంఖ.. గంజ...శుభసౌగంధిక.. రాజమయ.. రాజపట్ట.. జ్యోతిరస... పుష్పరాగ.. కర్కేతన... పులకస్ఫటిక... సూర్యకాంత.... చంద్రకాంత.

- నీటిలో తేలేవి అభేద్యములు.
- చిలుక రెక్కల రంగుకల వజ్రం అత్యంత శుభకరమైనది.
- స్ఫటికం నిర్మలంగా వుండాలి.
- మరకతమణి సువర్ణ చూర్ణ సమానమైన సూక్ష్మ బిందువులు గలది అయి వుండాలి.
- ముత్యపు చిప్పలో పుట్టినవాటి కన్నా శంఖములో పుట్టిన ముత్యములు నిర్మలములు.
- ఇంద్రనీల మణిని పాలల్లో వుంచితే మరింత ప్రకాశవంతంగా కాన వస్తుంది.
- నీలము.. రక్తకాంతి గల వైఢూర్యము సర్వ శ్రేష్ఠం.
- కాంతి తక్కువవున్నవీ... బీటలు పడినవీ.. దోషములు.
- పద్మరాగం అరుణ కాంతితో వుంటుంది. అదే శ్రేష్ఠం.

అగ్నిలో వేసినా తరగని బంగారంతో జత చేసి ఈ రత్నాలన్నీ ధరించటానికి పెట్టి పుట్టాలి.



## ప్రాతఃసంధ్య... సాయం సంధ్యలలో కామవికారాలు వద్దు

మన్మథుడితో పాటు జన్మించిన సంధ్య పద్ధతి తెలియకుండానే శివుని గూర్చి తపస్సు చేసింది. ఆ తపస్సు ఫలంగా ఈశ్వరుడు ప్రత్యక్షమయ్యాడు. వరాలు కోరుకోమన్నాడు. పరపురుషుడు నన్ను మోహంతో చూస్తే నపుంసకుడవ్వాలని కోరుకుంది. ఈశ్వరుడు కాదన్నాడు. ఆపై యజ్ఞకుండంలోకి దూకి ఆత్మార్పణం చేసుకుంది. సకల జీవకోటికీ అన్న ప్రదాత అయిన సూర్యభగవానుడు ఆమెను రెండు భాగాలుగా అనగా ప్రాతః సంధ్య... సాయం సంధ్యలుగా మార్చాడు. కాన ఆ రెండు సమయాల్లో కామ కోరికల ఇత్యాదివాటిని మనసులోకి కూడా రానీయకూడదు. శరీర దోషం తగులుతుంది. అందుకే ఆ సమయాల్లో కోరికలను అదుపులో వుంచుకోవాలని పెద్దలు చెప్పింది.

## చైత్ర మాసంలో సుబ్రహ్మణ్యస్వామికి నవపుష్ప అర్చన

'సంతానం, ఆరోగ్యం, భూమి, గౌరవాన్ని, నాయకత్వాన్ని ఇచ్చే సుబ్రహ్మణ్యస్వామికి నవపుష్పపూజ అనగా తొమ్మిది రకాల పూలతో పూలాభిషేకం చేయిస్తే తప్పక ఫలితం కలుగుతుంది. ఎర్రకలువ పూలు ఇల్లు కట్టుకోవటానికి.. చామంతులు సౌభాగ్యానికి.. గులాబీలు గ్రహ దోష నివారణకు.. మల్లెలు భార్యాభర్తల సఖ్యత కోసం.. కనకాంబరాలు ప్రశాంతతకు... విరజాజులు శత్రువినాశనానికి... మందారము మనోభీష్టానికి..



సంతానం, సుఖశాంతుల కోసం, అత్తింట పుత్రిక ఆనందం కోసం కమలములు.

వీలయితే చెయ్యగలిగతే తొమ్మిది రకాల పూలతో సుబ్రహ్మణ్యునికి పూలాభిషేకం చేయించండి. మీరు నాటిన, పెంచిన మొక్కల నుంచి కనీసం రెండు పూలన్నా వాటిల్లో కలిపి చేయించండి. వందలకొద్ది ఇత్తడి పాత్రలతో శివలింగానికి పాలాభిషేకం చేసినా ప్రయోజనం ఉండనట్టు కనీసం కొన్ని పూలన్నా మీరు పెంచి పోషించినవి వుండాలి. అలా కాకపోతే ఇత్తడి పాత్రతో అభిషేకం చేసినట్టే.

## నూతన గృహ నిర్మాణంలో ఎంతోకొంత ఖర్జూరపు కలపను ఉపయోగించండి

- మానవునికి తొలి ఆహారవృక్షం.
- నూతన గృహనిర్మాణంలో ఎక్కడైనా కొంత ఖర్జూరపు కలప వాడటం వల్ల ఆ గృహం మహా పవిత్రమవుతుంది. ఎలాంటి దోషాలనైనా అరికడుతుంది. భగవంతుని గృహానికి కలపనిచ్చిన వృక్షం ఖర్జూరపు చెట్టు.
- ఖర్జూరం రుచి అందరికీ తెలుసు. ఖర్జూరపు పుష్పాల రుచి? ఆహారం... ప్రసాదాల్లో ఖర్జూరం వాడటమంటే తొలి ఆహారపు వృక్షాన్ని సేవించినట్టే.

## మహా మృత్యుంజయ మంత్ర తపము...

నందీశ్వరుడి భార్య పేరు సుయశ. సప్తమదుత్తుల పుత్రిక... ఆయుష్షు తక్కువ వుండటంతో మహామృత్యుంజయ మంత్రాన్ని నందుడు పఠించి శివుణ్ని మెప్పించాడు. తత్ఫలితంగా నందుని నందీశ్వరునిగా తన ఎదురుగానే వుంచుకున్నాడు.

## కోరికలు తీర్చే కామ్య స్నానాల

❀ విఘ్నాలు పదే పదే కలుగుతుంటే అనవసర భయభీతులు కలుగతుంటే.. ఉన్నత పదవి రాకుంటే.. హస్త, పుష్యమి, అశ్విని, మృగశిర, శ్రవణానక్షత్రాల్లో ఆవాలు నూరి నేతిలో తడిపి శరీరమంతా రాసుకొని గంధము కలిపిన నీటితో స్నానం చేసి విఘ్నేశ్వరునికి దద్ధ్యోజనము, పాయసములను నైవేద్యంగా సమర్పిస్తూ పూజ చేయాలి. ఆపై పార్వతీ పరమేశ్వరులను పూజించి ఆలయంలో అభిషేకం చేయించుకోవాలి.

❀ ఘృత స్నానం ఆయుష్షును పెంచుతుంది.

❀ గోమయ స్నానం లక్ష్మీ వృద్ధి.

❀ గోమూత్ర స్నానం ద్వారా చేసిన పాపాలు పోతాయి.

❀ క్షీరస్నానము మహా శక్తినిస్తుంది.

❀ ఉసిరికాయల స్నానం ఆకస్మిక ధనప్రాప్తి.

❀ సువర్ణోదక స్నానం శుభమంగళకరం.

❀ రత్నస్నానం మహా విజయ సిద్ధి.

❀ సర్వగంధ మిశ్రిత స్నానం సౌభాగ్యం.

❀ ఫలోదక స్నానం ఆరోగ్యం.

❀ కదంబ మిశ్ర స్నానం బంగారుప్రాప్తి.

❀ పంచగవ్య స్నానం సర్వకామములను తీర్చును.

- అగ్నిపురాణం



## పరులకి కీడు చేసేవారిని చూస్తేనే దోషం

భర్త కోసం వెదుకుతున్న జ్యేష్ఠాదేవికి శ్రీమహావిష్ణువు తారసపడ్డాడు. తన భర్త తనని వదిలేశాడని ఏడ్చింది. బాధపడకు.... ధర్మాన్ని తప్పిన వారి ధనం, భగవంతుడ్ని నిందించిన వాని ధనం అంతా నీదే అవుతుంది. నీ భర్త త్వరలోనే నిన్ను కలుస్తాడని చెప్పి ఊరడించాడు. జ్యేష్ఠాదేవి దర్శనం వల్ల కలిగిన దోషాన్ని పోగొట్టుకోవటానికి శ్రీమహావిష్ణువు అంతటి వాడూ రుద్రాధ్యయనం చేశాడు. ఇక్కడ జ్యేష్ఠాదేవిని పోల్చటం లేదు... నీచుల పరిచయం ఎంతటి దోషమో అర్థం చేసుకోండి. దుష్టుడికి దూరంగా వుండాలని పెద్దలెందుకు చెప్పారో అర్థం చేసుకోండి.

## మహా సుఖాలనిచ్చే పుత్రుడికోసం

'ఓం ఈం లీం భీం రం వం వామలోచనే వీర్యం స్తంభయ స్థంభయ నాదే మా కురస్వాహా'...

రాత్రి పడుకోవటానికి గంట ముందు అనగా భోజనం తర్వాత ఇష్టదైవాన్ని స్మరించి ఆపై ఈ మంత్రం మీకు మాత్రమే వినపడేలా పదకొండుసార్లు చదువుకోవాలి. తద్వారా మహా సుఖసిద్ధి... అభీష్టసిద్ధి.

## శివపూజలో మొగలి పువ్వును ఎక్కడ వాడాలి...

బ్రహ్మ, విష్ణువుల ఆధిపత్య పందెంలో మొగలిపువ్వు అబద్ధం చెప్పటం వల్ల శివపూజలో స్థానంలేదని శాపం ఇచ్చాడు పరమేశ్వరుడు. తర్వాత 'నీవు శివపూజకు దూరమయ్యావని చింతించవలదు... మండపం పైకప్పు అలంకరణలో నీ పూలను వాడటం వల్ల వారికి ఇష్టసిద్ధి కలుగుతుందని' వరం కూడా ఇచ్చాడు.



## కామాన్ని పెంచే విధంగా ప్రవర్తించకండి

దాని వల్ల చాలా దుష్ఫలితాలు వస్తాయి. అందం ... అవయవ బింకం.. ఎత్తులు వున్నాయని ప్రదర్శించటం వల్ల, ప్రేరేపించటం వల్ల అవతలవాళ్ళు విచలితులవుతారు. అలా తన అందమైన రూపం వల్ల మన్మథుడు బ్రహ్మాదులంతటి వారిని కామానికి గురిచేశాడు. దాని వల్ల బ్రహ్మాదులు కూడా తలవంచుకోవాల్సి వచ్చింది. అలా చేసినందుకే .... ఆ దోషం వల్లనే మన్మథుడు ఆపై శివుని మూడోకంటి జ్వాలలో మసి అయ్యాడు. ఆ దోషం స్త్రీ పురుషులెవ్వరికైనా సమానంగా తగులుతుంది.

## మహా గౌరీదేవిని మందార పూలతో పూజిస్తే...

చతుర్భుజ.. వృషభవాహిని అయిన ఈ అమ్మ మహా శక్తిమంతురాలు. సకల వాంఛిత ఫలములను సిద్ధింపచేస్తుంది. భార్యాభర్తలను మరింత కలుపుతుంది. సుఖభోగాలను అందిస్తుంది. మానసిక ఆనందాన్నిచ్చి భర్త ప్రేమని పరిపూర్ణంగా అందేలా ఆశీర్వదిస్తుంది. ఉదయం పూజ అవ్వగానే ఈ గౌరీదేవి ధ్యాన శ్లోకం పఠించండి.

**శ్వేతే వృషే సమారూఢా శ్వేతాంబరధరా శుచిః।**
**మహాగౌరీ శుభం దద్యాత్, మహాదేవ ప్రమోదా ॥**

## కమల గన్నేరు పూలతో
## సిద్ధిదాత్రీ దేవిని పూజిస్తే

అష్టాదశ సిద్ధులు లభిస్తాయి. విజయం... ఆయుష్షువృద్ధి. మహదానందాలు. ఎన్నిసార్లు ప్రయత్నించినా సాధించలేని విజయాన్ని ఈ సిద్ధిదాత్రీదేవి అందిస్తుంది. ఉదయం పూజ పూర్తిఅవ్వగానే ఈ ధ్యాన శ్లోకం నూట ఎనిమిది రోజుల పాటు విడువకుండా పఠించండి.



**సిద్ధగంధర్వయక్షాద్యైః అసురైరమరైరపి।**
**సేవ్యమానా సదా భుయాత్ సిద్ధిదా సిద్ధిదాయినీ ॥**

## మహాకాళీదేవి, తారా దేవిలను ఎర్రమందారాలతో పూజిస్తే

మహాజ్ఞానం.. శత్రువినాశనం.. విద్యాసంపద... మహా ఐశ్వర్యాలు, పూర్వజన్మ కర్మల పాపం తొలగి దోషాలు పోయి మహా సుఖాలు లభిస్తాయి. ఉదయం పూజ అవ్వగానే ధ్యాన శ్లోకాన్ని పఠించండి.

**ఖడ్గం చక్ర గదేషు చాప పరిఘాం శూలం భుశుండిం శిరః।**

**శంఖం సందధతీంకరై స్త్రిణయనాం సర్వాంగ భూషావృతామ్ ॥**

**యామస్తౌ త్స్వపి తేహరౌ కమలజో హంతుంమధుం కైటభం**

**నీలాశ్మద్యుతి మాస్యపాద దశకాంసేవే మహాకాళి కామ్ ॥**

## గృహంలో వృక్షాలుగా పెరిగే మొక్కలు నాటేటప్పుడు

⚘ మొక్కనాటేటప్పుడు చంద్రుణ్ని, వరుణుడ్ని, విష్ణువుని, మేఘాన్ని ధ్యానించాలి.

⚘ ధన్వంతరి శెలవిచ్చినట్టు గృహానికి ఉత్తరాన ప్లక్షము, తూర్పున వటము, దక్షిణాన అమ్రము.. ఇక పశ్చిమాన అశ్వత్థ వృక్షములు సర్వదా భద్ర రక్షణములు. సకల శుభ మంగళకరములు.

⚘ గృహ ఆవరణలో ముళ్ళ చెట్లు పుడితే తీసి వేయండి. అయితే దక్షిణం వైపు ముళ్ళ చెట్లను పీకరాదు. అవి మీకు శుభాలని తెస్తాయి.



❁ స్వాతి, హస్త, రోహిణి, శ్రవణ, మూల నక్షత్రాలలో మొక్కలను నాటండి.

❁ వృక్షాలు పెరగకపోతుంటే మత్స్యములున్న నీటిని... అనగా చేపలు తిరిగే నీటిని పోయటం ద్వారా వృద్ధి అవుతాయి.

## మధుర మీనాక్షి.. కంచి కామాక్షిలని ఏ వైపు నుంచుని దర్శించుకుంటే ఏమి ఫలం

జగజ్జనని ఆదిపరాశక్తి.. సకల లోకాలని సష్టించిన భవానీ శక్తిని దర్శించుకునేటప్పుడు అపూర్వ విద్య కావాలంటే ఎడమవైపు నుంచుని, అపార లక్ష్మీ కటాక్షం కావాలంటే కుడివైపు నుంచి దర్శించి ధ్యానించాలి. ఇరువైపుల వింజామరలతో సరస్వతి, లక్ష్మీలు విసురుతుండే దృశ్యాన్ని మననం చేసుకుంటూ హృదయంలో ముద్రించుకుని నమస్కరించాలి. మీరు కుడివైపున నుంచుని దర్శించుకుని లక్ష్మీ కటాక్షానికి పాత్రలవ్వాలనుకోకండి. ఎడమవైపు నుంచుని నమస్కరించండి. అదే దైవ రహస్యం... శాస్త్ర రహస్యం.

## మదన తాపం తగ్గే శైత్యోపచారాలు

సరోవరంలోని చల్లటి జలంతో శరీరాన్ని తడుపుకోవటం... తామరాకుల పాన్పుపై శయనించటం.. తీసిన చందనపు గంధంను వంటి నిండా పూసుకోవటం వల్ల... చంద్ర దర్శనం కాగానే సముద్రం పొంగినట్టు విరహమనే మోహంతో పొంగిన శరీరం చల్లబడుతుంది.



**అయిదు పౌర్ణమిలు ఉపవాసంతో సత్యన్నారాయణ స్వామి దర్శనం ఆపై అయిదో పౌర్ణమి నాడు దంపతులు సత్యనారాయణ స్వామి వ్రతం చెయ్యటం ద్వారా మొదటి పౌర్ణమి నాడు స్వామిని దర్శించి కోరుకున్న కోరిక ఆరో పౌర్ణమిలోగా జరుగుతుంది.**

## ఏ మొక్క నాటితే ఏం ఫలితం

- జాజిపూల మొక్క నాటితే దుష్టగుణాలు తొలుగుతాయి.
- పారిజాతం నాటితే కాలసర్ప దోషం పోతుంది.
- మల్లె చెట్టు నాటితే దీర్ఘ రోగాలు సమసిపోతాయి. సంతానంలేని వారికి సంతానం కలుగుతుంది.
- కల్హార మొక్క నాటితే కీర్తి కలుగుతుంది.
- వ్యాపార వృద్ధి కోరుకునే వారు పాటలీ పూల చెట్టును నాటాలి.
- కనకాంబరాల మొక్క నాటితే ఆధ్యాత్మికత ... ఆనందం... అయితే వీటితో భగవంతునికి పూజ చేయకూడదు.
- నందివర్ధనం మొక్క నాటితే కుటుంబశాంతి.
- పొద్దు తిరుగుడు పూలతో హెూమం చేయిస్తే అష్టభోగాలు, ఐశ్వర్యాలు కలుగుతాయి.
- మాధవీపుష్ప మొక్క నాటితే విద్యాప్రాప్తి.
- మొగలిని పెంచితే అధికార ప్రాప్తి. (సొంత పొలంలో... గృహానికి దూరంగా)
- సంపెంగ చెట్టు పెంచటం శత్రునాశనం. (గృహ ఆవరణలో కాదు)



పై వాటిని నాటడం, పెంచడం ఆపై ఆ పూలని మీ ఇష్టదైవానికి సమర్పించటం ద్వారా సంబంధించిన కోరికలు నెరవేరతాయి. దోషాలు పోతాయి. సకల కార్యాల్లోనూ విజయం తథ్యం.

**ఓం శ్రీ జ్యేష్ఠాదేవ్యైనమః**

గోవులో ముక్కోటి దేవతలుంటారు. ఆవు ముఖం శ్రీజ్యేష్ఠాదేవికి ప్రముఖ స్థానాన్ని దేవతలంతా ఇచ్చారంటే ఆ తల్లి గొప్పదనం తెలుసుకోండి. శ్రీలక్ష్మిని పూజించటం వల్ల ధనం ఇవ్వచ్చు... ఇవ్వకపోనూవచ్చు. కానీ జ్యేష్ఠాదేవిని ఆడిపోసుకుంటే దరిద్రం వచ్చేయటం ఖాయం. నా ఖర్మ.. నా దరిద్రం.. వీడ్ని కట్టుకుని ఇలా అయ్యాను.. అని శాపనార్థాలు పెడితే ఆమె మీ వద్దకు రావటం ఖచ్చితమే. అంటే దారిన పోయే వాళ్ళని తిట్టి గొడవ తెచ్చుకున్నట్టే. శని మనకి కష్టాలు తెచ్చిపెడతాడనుకుంటాము. నిజానికి ఆ కష్టాలు తెచ్చేది శ్రీజ్యేష్ఠాదేవే. తెలియక నిందించి వుంటే ఈ శ్లోకం ద్వారా మిమ్మల్ని క్షమించమని ప్రార్థించండి. దోషం పోతుంది.

**క్షమాపణ స్తోత్రం :**

**యదక్షర పదభ్రష్టం మాత్రాహీనంతు యద్భవేత్।**
**తత్సర్వం క్షమ్యతాం దేవీ జ్యేష్ఠాలక్ష్మీ నమోస్తుతే॥**



## తెల్ల తామర పుష్పాలతో బ్రహ్మచారిణీ దేవిని పూజిస్తే

శక్తి.. అధికారం.. జ్ఞానసంపద.. ఆకస్మిక లాభం... యోగ సిద్ధి. పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రములలో జన్మించిన వారు శక్తి వుంటే నక్షత్ర హోమం... శాంతి హోమం చేయిస్తే దోషాలు పోయి కోరిన సిద్ధి కలుగుతుంది. అంత శక్తి లేనివారు ఈ క్రింది మంత్రాన్ని నలభై వక్క రోజులు రోజుకి రెండు సార్లు పఠిస్తూ బ్రహ్మచారిణీదేవిని స్మరించండి.

**దధానా కరపద్మాభ్యాం అక్షమాలాకమండలూ।**
**దేవీ ప్రసీదతు మయి బ్రహ్మచారిణ్యనుత్తమా॥**

## శివకేశవులకి ఎక్కడి పూజా పూలన్న ప్రీతి

❀ శివపూజలో పూలను అడవిలో పూసినవి వాడటం ఈశ్వరునికి ప్రీతికరం.

❀ శ్రీలక్ష్మీనారాయణులకు భక్తులు స్వయంగా నీరు పోసి పెంచిన రకరకాల అందాల సుగంధాల పూలమాలంటే ప్రీతి.

❀ ఇక అమ్మవారికి ఎర్రని పసుపు పూలంటే అవి అడవిలోనివైనా, పెరటిలోనివైనా సరే ప్రీతికరం.

## జాజిపుష్పాలతో చంద్రఘంటాదేవిని పూజిస్తే...

మీ ఎదుగుదల చూసి ఏడ్చేవారి దిష్టి పోతుంది. ఆనందాన్ని, ఆయుష్షుని తగ్గించే మనోవేదన మనసు పొరల్లోంచి మాయమౌతుంది. దాంపత్య గొడవలు సద్దుమణుగుతాయి. ఇంకా కార్యసిద్ధి సఫలం అవుతుంది. ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి



నక్షత్రములలో జన్మించిన వారు నక్షత్ర శాంతి హోమం చేయించండి. ఆ దేవిని పూజిస్తూ ఈ శ్లోకం పఠించండి....

పిండజప్రవరారూఢా చండకోపా స్త్రకైర్యుతా।
ప్రసాదం తనుతే మహ్యం చంద్రఘంటేతి విశ్రుతా॥

## దేవ మందార పూలతో కూష్మాండా దేవిని పూజిస్తే

ఎదుట వారి కుయుక్తులని ముందు తెలుపుతుంది దేవి. నరదిష్ఠి తొలగటంతో పాటు అలా దిష్ఠి పెట్టిన వాళ్ళు మీ వైపు రావాలన్నా, అనాలన్నా భయం కలిగేలా చేస్తుంది. మఖ, మూల, అశ్వని నక్షత్రాలలో జన్మించిన వారు నక్షత్ర హోమం.. శాంతి హోమం చేయించటం వల్ల గ్రహదోషాలు కూడా తొలగిపోతాయి. శక్తిలేనివారు ఈ క్రింది శ్లోకాన్ని రోజూ క్రమం తప్పకుండా పఠించవచ్చు.

**సురాసంపూర్ణకలశం రుధిరాప్లుతమేన చ।**
**పధానా హస్తపద్మాభ్యాం కుష్మాండా శుభదాస్తుమే॥**

**రుద్రాక్ష ధరించటంతో పాటు రుద్రాక్ష చెట్టుని నాటి పూజించటం అంటే గౌరీశంకరులను ప్రతిష్ఠించి పూజించనట్టే.**

## వ్యాపార సంస్థలో పూలపాత్ర

- నిత్యం మల్లెలు..సన్నజాజి.. చామంతి.. విరజాజులను స్త్రీ ధరించటం వల్ల గృహంలో ఆర్థిక సమస్య తలెత్తదు.
- అలాంటి పూలమొక్కలను లేవగానే లేదా రోజులో ఎక్కువసార్లు కనపడేలా నాటుకుంటే అదృష్టం పదే పదే



కలుగుతుంది. అందుకే పెద్దలు పండ్ల మొక్కలు, ఆహారపు మొక్కల కన్నా ముందు ఆవరణలో పూలమొక్కలను నాటమని చెప్పారు.

రాతిపాత్రలో నీరుపోసి అందులో సుగంధ పరిమళాలు వెదజల్లే పూలను పేర్చి వ్యాపార స్థానంలో యజమాని కూర్చుండే ముందు ప్రదేశంలో ఆయనకి కనపడేలా పెట్టుకుంటే వ్యాపారం చెక్కు చెదరని పూలలా ఆహ్లాదంగా వుంటుంది. రాబడి పెరుగుతుంది. పూలనీ, నీటినీ ఏ రోజు కారోజు మార్చాలి. నిర్లక్ష్యం చేస్తే వరం శాపంగా మారే ప్రమాదం. మరుసటి రోజు ఆ నీటిని ఎవరూ తొక్కని ప్రదేశంలో పోసి తిరిగి మంచినీటిని నింపాలి.

గృహం ముందు నాటే పూలమొక్కలు సకల గృహ వాస్తు దోషాలను పోగొడతాయి. మీ ఆవరణలో మీరు పెంచిన పూలమొక్కల నుంచి పూలు సేకరించి పూజ చేసి చూడండి.. అది మహా యజ్ఞాన్ని స్వయంగా చేసినట్టే.

## ఆయుష్షును పెంచే ఏకైక ఫలం రుద్రాక్షే...

రుద్రాక్ష చెట్టు నూటఇరవై అడుగులకు పైగా పెరుగుతుంది. ఆకులు మామిడి ఆకుల్లా వుంటాయి.

ద్రాక్షవలే గుత్తులు గుత్తులుగా కాస్తాయి. చిన్న నిమ్మకాయ సైజులో వృద్ధి చెంది చెట్లపైనే పండిపోతాయి.

వగరుగా, చేదుగా వుండే రుద్రాక్ష పండు తింటే ఓ రోజు ఆయుష్షు పెరుగుతుందని మహా ఋషుల వచనం. రుద్రాక్ష ధరించిన వారు ప్రవర్తన సరిగా లేనివారితో ఒక్కక్షణం తిరిగినా



మీ జీవిత ఆయుష్షు ఒక్క క్షణం తగ్గిపోతుంది. నెలలో ఒక్కసారైనా మౌనవ్రతం చేయాలి.

⚘ మనిషి చేతివేళ్ళు ఒకరితో ఒకరివి సరిపోనట్టు ఓ రుద్రాక్ష మరో రుద్రాక్షతో పోలి ఉండదు.

⚘ రుద్రాక్ష ఎన్ని ముఖముల గలది అన్న నిర్ధారణ సాంకేతిక పరిజ్ఞానంతో సరిచూసుకోవచ్చు(అనగా ఎక్స్‌రే కిరణాలూ, స్కానింగ్ ద్వారా). పైన చెక్కినా లోపల ఎన్ని ముఖాలో స్పష్టంగా తెలిసిపోతుంది.

⚘ ఎక్కువ డూప్లికేట్ రుద్రాక్షలను పంచముఖి రుద్రాక్షల నుంచే తయారు చేస్తారు.

**పన్నీరులో ముంచిన వత్తులను ఆరపెట్టి తర్వాత వాటిని భద్రపరిచి శుక్రవారం లక్ష్మీదేవి పూజలో ఆ వత్తులు వేసి దీపము వెలిగిస్తే ధన సంపత్తి నిలిచి వుంటుంది.**

## శ్రీలక్ష్మీనారాయణుల సంవాదము

ఈ సకల బ్రహ్మాండ భాండానికి అవతల మహావిష్ణులోకం వుంది. మహా పవిత్రమైనది.... దోష రహితమైనది. అక్కడ మహా పుణ్యమైన విరజానది ప్రవహిస్తూ వుంటుంది. మనోహర రమణీయ సరోవరం. సుగంధ ఫల పుష్పాలతో పాటు బిల్వ వృక్షము.. ఇంకా అశ్వత్థవృక్షం మహా శోభతో వెలిగిపోతూ వుంటాయి. మహా పుణ్యం చేసుకున్న పుణ్యాత్ములూ, పుణ్యాంగనలూ విహరిస్తూ ఆనంద లోకంలో తేలిపోతుంటారు.

ఆ విష్ణులోకంలో మహా సుందర నవరత్న మణులతోనూ,



బంగారంతోనూ నిర్మించబడిన సౌధములో శ్రీమహావిష్ణువు శ్రీదేవి, భూదేవి, సీతాదేవిలతో వేంచేసి వుంటారు. ముగ్గురు భార్యలు సేవిస్తుండగా మునులూ, దేవతలూ కొలువు తీరి వున్న సమయంలో శ్రీమహాలక్ష్మి తన మనసులోని మాటలను బైటపట్టి... "మహా పురుషా.. సకల లోకాల ప్రాణుల లయలకి నీవే కదా కారణం... బ్రహ్మాది రుద్రులు కూడా నీ ఆదేశాల మీదే కదా నిర్వర్తిస్తుంటారు. అనేక అవతారాలను ఎత్తావు.. మానవకోటి అంతా నీకు సమానమే కదా. ఒకరికి మహా కష్టాలు... మరొకరికి మహా సుఖాలు, కొందరికి వద్దంటే ధనం.. ఎంత కష్టపడ్డా చిల్లుకాణి వుండదు మరికొందరికి. ఈ బేధం ఎందుకు. ఒకరికి కష్టాలూ, సమస్యలూ.... మరొకరికి భోగాలూ, సుఖాలు. పరంధామా.. ఏమిటీ భేదం.. ఏమిటి ఈ పక్షపాతం..."

శ్రీమన్నారాయణుడు శ్రీలక్ష్మీదేవితో చెప్పాడు.

"దేవీ! నీవు లోకాలకి తల్లివి. అందుకే తల్లడిల్లిపోతున్నావు. నాకూ వారంతా బిడ్డలే. ఎవరిపైనా పక్షపాతం లేదు. అందరూ ఒక్కటే. తక్కువ ఎక్కువలు లేవు. కానీ పూర్వజన్మ.. ప్రస్తుత జన్మ.. పుణ్య పాప కార్యాలను బట్టి వారి జీవన గతి వుంటుంది.'

'ఏదో జన్మలో చేసిన ఫలం అనుభవింపక తప్పదా స్వామీ...'

"లేదు దేవీ! దివ్యక్షేత్రాల సందర్శన... పూజాదికాలు.. చేయటం ద్వారా... దివ్యమంగళకరమైన మొక్కలు నాటడం, వృక్షాలుగా వాటిని పెంచటం వంటివి చేయటం ద్వారా, అలాగే దివ్యక్షేత్రాల దర్శనం వంటివి పాపఫలాలను తగ్గిస్తాయి. ఆర్థికపరమైన ఇబ్బందితో పుణ్యక్షేత్రాల దర్శనం చేసుకోలేనివారు ఆయా పుణ్యక్షేత్రాల



గురించి స్మరించుకున్నా చాలును. వెళ్ళిన ఫలం కలుగుతుంది. ఉన్న చోటనుంచే కాశీ విశ్వేశ్వర విశాలాక్షీనీ, శ్రీరంగధామేశ్వరినీ మధుర మీనాక్షినీ తలుచుకున్నా చాలును. ధన శక్తి లేని వారికి నేను ఇస్తున్న వరం ఇది. తద్వారా పుణ్య సంపదలని పొందవచ్చు."

## ప్రతిస్త్రీ ఉదయం నిద్ర లేవగానే మంగళ సూత్రాలను చూసి కళ్ళకద్దుకునేది

ఎరుపురంగు.. తామర పువ్వు.. సముద్రం.. పూలు.. అద్దంలో తనకి తాను చూసుకోవటం, పుణ్యస్త్రీ.. ఏనుగు.. ఆవుదూడ.. బంగారము.. వీటిలో ఏదన్నా ఒకదానిని ఉదయాన్నే నిద్ర లేవగానే చూడాలని అవి చూసి దినచర్య ప్రారంభిస్తే కుటుంబానికీ, భర్తకీ క్షేమం, లాభం అని శాస్త్రం. పైవన్నీ ప్రతిసారి అందుబాటులో లేకపోవచ్చు. అందుకనే ప్రతి స్త్రీ ఉదయం లేవగానే మంగళసూత్రాలను అనగా బంగారాన్ని చూసి దినచర్య ప్రారంభిస్తుంది. ఇంటి ఇల్లాలు లేచీ లేవటంతోనే గృహక్షేమాన్ని కాంక్షిస్తూ ఆ చర్య చేస్తుంది.

## బల్లి మీద పడి కైలాసం చేరితే....

నెత్తిమీద పడితే మీ వారితో గొడవ.. కాళ్ళ మీద పడితే ధనం తరుగుదల.. కుడిచెవిపై పడితే అకాల ప్రమాద నివారణ.. కడుపుమీద పడితే ఆకస్మిక ధనం.. అలాగే నాభియందు కూడా. తొడల మీద పడితే పూర్వీకుల ధనం కలిసి వస్తుంది. శరీరం మీద ఎక్కడ ప్రాకినా మంచిదే. నెత్తి మీద పడితే బాధపడే



విషయం వినాల్సి వస్తుంది. ఇక బల్లి మీద పడి ఆపై కింద పడి కైలాసం చేరితే సదరు వ్యక్తి శిరస్నానం చేసి ఆ రోజు ఏమీ తినకుండా దేవాలయంలో అర్చన చేయించుకుంటే దోషం పోతుంది. దేవాలయానికి వచ్చే ముందు పూజామందిరంలో దీపం వెలిగించాలి. దోష పరిసమాప్తి అవుతుంది. లాభమైనా, నష్టమైనా సరే బల్లి పడితే పై విధంగా చేయాలి. దేవాలయ దర్శనమప్పుడు అనగా ముందు పదకొండు లేదా ఇరవై ఏడు ప్రదక్షిణలు చేసి స్వామిని దర్శించుకోవాలి. గృహంలో దీపం వల్ల.. శిరస్నానం వల్ల.. ప్రదక్షిణల వల్ల బల్లి పడిన సకల దోషం పరిసమాప్తి అవుతుంది.

## నైమిశం ఎంత గొప్పది

సృష్టికర్త బ్రహ్మదేవుడు లోకహితం కోసం.. చక్రం చేసి దాన్ని సత్యలోకం దిశగా దొర్లించాడు. ఆ చక్రం అలా... అలా .. దొర్లి లోకాలను దాటుకుంటూ భూమి మీద పడింది. అలా పడినప్పుడు ఇరసు అక్కడే విచ్చిపోయింది. అందువల్లే నైమిశంగా పిలవబడుతోంది. ఆ పుణ్య ప్రదేశంలో శౌనకాది మునులు ద్వాదశ వర్ష సత్రయాగం చేశారు. అనేక పురాణ సంహితులను అక్కడే సూతుని నుంచి విన్నారు. అంతటి పుణ్యమైన ప్రదేశాన్ని దర్శించి పూజిస్తే మహా విద్యావంతులైన సంతానం కలుగుతారు.



## ఏ రంగంలోనైనా మహర్దశ ఇలాగే సాధ్యపడుతుంది

- గురు సన్నిధానంలో జ్ఞానసముపార్జన చేయాలి.
- సాహసంతో చేసిన ప్రతిజ్ఞ సాధించాల్సిందే.
- తనకి ధీటయిన శత్రువు వుంటే తుడిచెయ్యాలి. లేదా నిద్రుండదు. రతికేళిలో సుఖముండదు.
- ఒకరితో గొడవలొద్దు.. వచ్చిందా అలా ఇలా కాదు చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించేలా పగతీర్చుకోవాలి (ధర్మబద్ధంగా).
- పగవాడి చేష్టలు ఎంతో భయంకరంగా వుంటాయి. దావాగ్ని కూడా కలిగించదు. అంత వ్యధ అయితే ఓర్చుకోవాలి. సమయం, సందర్భం చూసి తాచుపాములా పడగ విప్పాలి.
- చింత వుంటే... బుద్ధి...నిద్ర.. ఉత్సాహం... ఆకారం... తేజస్సు... ఆకలి ... గౌరవం.. అన్నీ నశిస్తుంటాయి. అలాంటి స్థితిలోనున్న వారిని చరక ధన్వంతరిల వల్ల కూడా కాదు నయం చెయ్యటం. కాన కష్టాలు తనకే కాదు సృష్టిలోని ప్రాణులన్నింటికీ వున్నాయని గ్రహించి ముందుకు నడవాలి.

**సూర్యుడు మకరరాశిలో వుండగా ప్రయాగ తీర్థంలో స్నానం చేసిన వారికి సమస్త దోషాలు పోయి సుఖాలు కలుగుతాయి.**

**- కాశీఖండం నుంచి**

## భగవంతునికి వేసే మాలలు ఎంతవరకు వుండాలి

- వైకుంఠవాసునికి... శ్రీలక్ష్మీపతికి హృదయం వరకు రకరకాల పూలు కట్టి మాలవేస్తే సాధారణ ఫలం.



అదే నడుం వరకూ వచ్చే మాలను సమర్పిస్తే సుఖసంతోషాలు.

ఇక పాదాలకి తాకే వనమాల... అనగా నిలువెత్తు పూలమాలను స్వామికి సమర్పిస్తే అత్యుత్తమమైనది...సకల శుభకరం. స్వామి పాదాలను తాకుతున్న మాల స్వామి మెడలో వున్నంత సేపు స్వామికి పాదసేవ చేసిన ఫలం. ఎంతటి కష్టసమస్యైనా, తీరని కోరికైనా స్వామికి వనమాల సమర్పిస్తే నెరవేరుతుంది.

అమ్మవారి మాలలో పొగడపూలు ఎక్కువగా వుండేలా చూసుకోండి. మొగ్గలు లేకుండా ఉండాలి.

నల్లకలువలతో దుర్గాదేవికి వనమాల సమర్పిస్తే దరిద్రనాశనం, శత్రునాశనం.

సన్నజాజి మాలను సమర్పిస్తే కోరుకున్న కన్య భార్యగా అవుతుంది.

శ్రీలక్ష్మీదేవికి సమర్పించే మాలలో దేవకాంచన, తులసి లేకుండా చూసుకోవాలి.

ధనం కావల్సిన వారు మల్లెల మాలను, సంతానం కావాల్సిన వారు కమలమాలను, విద్యాప్రాప్తికి బాగా మరువం కన్పించే మాలను.. పొగడపూల వనమాల ద్వారా సొంతింటి కల నెరవేరుతాయి.

పూజ కావచ్చు...యజ్ఞం కావచ్చు. ఎంత చిన్నదైనా కష్టపడి సంపాదించినదే స్వామికి అర్పించాలి. పూల మొక్కలను నాటి



వాటి ద్వారా వచ్చే పూలతో తయారు చేసిన మాల స్వామికి పరమ ప్రీతికరం. మాల కట్టేటప్పుడు వెంట్రుకలు పడకుండా, రాకుండా జాగ్రత్త వహించాలి.

## పనస వృక్షమంటే దత్తాత్రేయుల వారి వామభాగమే

పనస వృక్షంలో దత్తాత్రేయుని వామభాగం.. ఔదంబర వృక్షంలో కుడిభాగం వుంటుంది. ఆ రెండు వృక్షాలు కలిపివుంటే సాక్షాత్తు మహాద్భుత పుణ్య ప్రాంతమే.

పనస చెట్టు నందు మహాలక్ష్మి, మహంకాళి, మహా సరస్వతి, శ్రీరాజరాజేశ్వరీ దేవిల అంశలుంటాయి.

మంగళవారం, గురువారం, శుక్రవారం శ్రీదత్తాత్రేయుడ్ని స్మరిస్తూ పనసచెట్టు చుట్టూ ఇరవై ఏడు ప్రదక్షిణలు చేసి మూడు బిందెల నీటిని సమర్పించటం ద్వారా అష్టసిద్ధులు కలుగుతాయి. ఇక పనస చెట్టు నాటడమంటే సాక్షాత్తు అనఘాదేవి విగ్రహాన్ని స్థాపించినట్లే. దత్తాత్రేయుడి శక్తి స్వరూపిణి అనఘాదేవి ఈ వృక్షంలో తన శక్తి అంశలతో వేంచేసి దత్తాత్రేయుని భక్తుల కోర్కెలని నెరవేరుస్తుంది.

**వెలుపల వున్న మూడునాళ్ళు విభుని కంట పడకూడదు. దూరంగా వుంటూ నాలుగోనాడు సూర్యోదయాన స్నానం చేసి ముందుగా భర్తనే చూడాలి.**

**- లోపాముద్ర**



## సంతానం కలుగకపోవటానికి
## ఏ దోషం కారణం కావచ్చు...

పవిత్రపుణ్యక్షేత్రాల దర్శనం హడావుడిగా చేసుకోవటం... ఎప్పుడెప్పుడు దర్శనం అయిపోతుందా అని అనుకోవటం... గృహానికి వెళ్ళి శృంగార ధ్యానంలో మునిగిపోవాలీ అని అనుకోవటం... దర్శనం తర్వాత ఆలయంలో ఆవు కనిపించినా చూసీ చూడనట్టు హుటాహుటిన వెళ్ళటం.. ఇంకా ఉపవాసం చేసినవాడు కరువు ప్రాంతం నుంచి వచ్చినట్టు దాహం తీర్చుకునేలా తలుపులు బిడాయించుకుంటే సంతానం ఆలస్యమవుతుంది. పూర్వం వైవస్వతమనువు వంశంలో జన్మించిన దిలీపుడు ఋతుస్నానం అయిన భార్య గురించే ఆలోచిస్తూ కామధేనువు కనిపించినా పూజించకుండా... ఇంకా నమస్కరించకుండా వెళ్ళిపోయాడు. ఆపై వశిష్ఠ మహర్షి ద్వారా దోషం తెలుసుకుని ధేనువుని పూజించాడు. గోవ్రతం చేశాడు. దిలీప సుదక్షిణాదేవి దంపతులకు మహోన్నతమైన రఘువు జన్మించాడు.

**కాశీలో లలితాఘాట్‌లో భూమిలో వున్న వారాహి ఆలయంలోని దేవిని పూజించటం ద్వారా అపమృత్యు నివారణ.. అక్కడ మృత్యుంజయ మంత్రం జపించటం ద్వారా మీ కుటుంబ సభ్యులకి కూడా అపమృత్య నివారణ.**



## సాటి ఆడదాని అందం గురించి భర్త దగ్గర మాట్లాడద్దు

అలా చేస్తే సవితి పోరు ఖాయం. కుబేరుని పుత్రుడు నలకూబరుడు వాని ప్రియసఖి రంభ.. తనని మించిన అందగత్తెలేదని అహం. నారదుడు ఓసారి ద్వారకలోని పూల తీగెల తూగుటయ్యలలో ఊగుతున్న కుసమకోమలమైన పడతిని... అప్సరకాంతలతోనే కయ్యానికి కాలుదువ్వుతున్నట్టుగా ఉన్నట్టుగా ఉన్న ఆ అందకత్తెని చూసి 'ఆహా.. ఏమి అందం... ఎంతటి అందగత్తె' అన్నాడు. ఆ మాటలు నలకూబరునితో విహారానికి వెళ్తున్న రంభ వింది. ఆవేశం పట్టలేక నారదుని వద్దకెళ్ళి 'చక్కదనంలో నన్ను మించిన వారెవరున్నారు... తమరు ఆ భూలోక కాంత గురించి అలా ఎందుకన్నారు...ఏమి ఉంది ఆమెలో' అంది. అలా చాలాసేపు వారిరువురి మధ్య వాదన జరిగింది. నలకూబరుడు ఆ వాదనను విన్నాడు. ఆమె ఎలా ఉంటుందో తెలుసుకోవాలన్న ఉత్కంఠతతో ఆమెను చూశాడు. అంతే.. నలకూబరుని మనసు ఆమెపై పడింది. కాన పరకాంత గురించి వాదనను ప్రియుని పరిసరాల్లోకి కూడా తేగూడదు. వైభవం స్థానాన విచార లక్ష్మి వచ్చి చేరుతుంది.

## రావి చెట్టు మూలాలు స్వర్గం దాకా వుంటాయి

రావిచెట్టు మూలలు స్వర్గంలో వుంటాయి. ఆ చెట్టు క్రింద దేవతలు విందులు చేసుకుంటారు. యజ్ఞయాగాదుల్లో వాడే పాత్రలు ఈ రావిచెట్టు మొదలుతోనే చేస్తారు. శ్రీకృష్ణునికి



ప్రతిరూపం. దేవతలు యక్షులు గంధర్వుల నివాసస్థానం. రావిచెట్టుకి అద్భుత శక్తులుంటాయి. అందుకే కొన్ని పూజలకీ, కోరికలకీ రావిచెట్టును ఆశ్రయించేది. సంతానం కోరే వారు ఎరుపు...తెలుపు..పసుపు దారాలని చుట్టడం ద్వారా సంతానసిద్ధి. దేవాలయంలో నిల్చుని, గృహంలో కూర్చుని తీర్థం తీసుకోవాలి. రావిచెట్టు క్రింద ఎలా తీసుకున్నా పర్వాలేదు. గర్భవతులు నీళ్ళ చెంబు పట్టుకుని చాలా నిదానంగా, మౌనంగా ప్రదక్షిణలను చేయాలి. రావి చెట్టంత శక్తి గల వాడు జన్మిస్తాడు. ఆ నీటిని చెట్టుకే పోయాలి. ఆ ప్రదక్షిణ నీరు అత్యుత్తమమై ఆశీర్వదిస్తుంది.

## యాగం జరుగుతుంటే కుటుంబమంతా కలిసి వెళ్ళండి

యజ్ఞం... యాగం.. చేసేవారూ, చేయించేవారూ, చూసేవాళ్ళ, ప్రేరేపించే వాళ్ళూ... అందరూ సమపాళ్ళలో పుణ్యఫలాలని అనుభవిస్తారని వేదం శెలవిస్తోంది. మంత్ర జపాలతో.. విశేష పూజలతో భక్తుల దైవ శరణ ఘోషలతో మారుమ్రోగే ఆ ప్రాంతంలోకి వెళ్ళటం ద్వారా... అదే విధంగా శ్రీలలితా, విష్ణు సహస్రనామాలని పైకి చదివినప్పుడు వాటిని వినటం ద్వారా శుద్ధ తరంగాలు వెలువడి వింటున్న వారి శరీరాలకీ, పరిసరాలకీ ఎంతో మేలు చేస్తాయి. అవి మీకు ఆయుష్షునూ...శక్తినీ... పెంచుతాయి. తెల్లమద్దిచెట్టుకి మల్లెతీగ అల్లుకొని కనిపిస్తే శివపార్వతుల సాక్షాత్కారం లభించినట్టే. అట్టి ఫలం యజ్ఞ యాగాదుల్లో పాల్గొనటం ద్వారా కలుగుతుంది.



## సప్త మాతృకల ఆరాధన - సకలసిద్ధి

**బ్రాహ్మీదేవి :** ఈ మాతృకను కొలవటం ద్వారా జ్ఞాపకశక్తి, విద్యాజ్ఞానం పెరుగుతాయి. బ్రహ్మదేవునికి హంసవాహనం ఇచ్చింది ఈ బ్రాహ్మీదేవినే.

**మహేశ్వరీదేవి :** పరమేశ్వరునికి ఢమరుకం, త్రిశూలం, త్రినేత్రం... ఈ తల్లి ద్వారానే సంక్రమించాయి. సౌభాగ్యం.. తేజస్సు.. ఆయుష్షు, దాంపత్య సౌఖ్యం ఇస్తుంది తల్లి.

**వైష్ణవీదేవి :** వైకుంఠవాసునికి గదా.. శార్ఙ్గం.. శంఖమును ఇచ్చిన ఈ వైష్ణవీదేవిని కొలవటం ద్వారా సంపదలు వృద్ధి అవుతాయి. పూర్వజన్మల పాపదోషాలు పోతాయి. పెళ్ళి కాని వాళ్ళు ఈ వైష్ణవీదేవిని పూజించటం ద్వారా చక్కటి సంబంధం వస్తుంది.

**కౌమారీదేవి :** రాక్షసులను సంహారం చేసే అపార శక్తులను కుమారస్వామికి ఇచ్చింది ఈ కౌమారీదేవినే. గృహంలో.. వున్న దుష్టశక్తులు సమసిపోతాయి. సంతానం లేనివారికి సంతాన ఫలం.. అన్నింటికీ మించి అన్యోన్య దాంపత్యం సిద్ధిస్తాయి.

**ఇంద్రాణిదేవి :** దేవేంద్రునికి కామధేనువు, ఐరావతం, కల్పవృక్షం ఇచ్చింది ఈ ఇంద్రాణీదేవినే (పాలసముద్రం నుంచి వచ్చిన అవి ఈ తల్లి సృష్టే). ఈ ఇంద్రాణీ దేవిని పూజించటం అంటే సంపదలనీ, మహా పదవినీ ఆహ్వానించినట్టే. భూమిపై సకల సుఖాలను అందించేది ఈ ఇంద్రాణి దేవినే.



**చాముండాదేవి** : మర్రిచెట్టు నివాసం చేసుకనే భక్తులకి వరాలిచ్చే దేవత. సకల రోగ నాశనము. భయభీతులు తొలగుతాయి. వ్యవసాయ దారులకి ఈ తల్లి పూజ మహా శ్రేష్ఠం. పాడిపంటలను కాపాడుతుంది. మహా ప్రశాంతతను ఇస్తుందీ చాముండాదేవి.

**వారాహి మహాదేవి** : యమునికి అంకుశం, పాశంను అనుగ్రహించింది ఈ వారాహీదేవే. మహావిజయం లభించి శత్రువులు దూరమవుతారు.

## శమీవృక్షం

⚘ ఆదిపరాశక్తిని జమ్మి ఆకులతో పూజిస్తే శత్రునాశనం. శ్రీరాముడు ఈ ఆకులతోనే ఆదిశక్తిని పూజించి రావణసంహారం చేశాడు.

⚘ శమీ వృక్షమంటే అపరాజితాదేవి.

⚘ విజయదశమినాడు రావి ఆకులను ఇవ్వటమంటే, పుచ్చుకోవటమంటే బంగారు రావి ఆకులను దానం ఇచ్చినట్టే..పుచ్చుకున్నట్టే. అందుకే దసరా రోజు జమ్మి ఆకులను ఒకరికొకరు ఇచ్చుకుంటారు.

⚘ పూర్వం అగ్ని వెలిగించటానికి ఈ వృక్షం వేర్లనే ఉపయోగించేవారు.

⚘ శమీవృక్ష నీడన విశ్రాంతి సర్వరోగ వినాశనము.

⚘ శ్రీరాముడు అరణ్యావాసంలో పంచవటి కుటీరానికి వాడింది ఈ శమీ వృక్షపు మొదళ్ళనే.



❀ జమ్మి ఆకులను గల్లాపెట్టెలోనూ, మీ విలువైన నగల పెట్టెలోనూ ఉంచండి. సంపదంతా పరులకి పాముల్లా కనపడతాయి.

## ఎర్ర గులాబీలతో స్కంధమాతను పూజిస్తే

సంతానం లేదని బాధపడేవారికి సంతాన ప్రాప్తి.. శత్రు నాశనము. ఆలుమగల అన్యోన్య దాంపత్య ఆనంద భోగాల సిద్ధి. ఈ స్కంధమాతను అరవై నాలుగు రోజుల పాటు పూజిస్తూ శ్లోకమంత్రాన్ని పఠించటం ద్వారా అభీష్టసిద్ధి.

**సింహాసనగతా నిత్యం పద్మాశ్రితకరద్వయా।**

**శుభదాస్తు సదా దేవీ స్కందమాతా యశస్వినీ॥**

## కాత్యాయినీ దేవిని బంతిపూలతో పూజిస్తే

మహాసౌభాగ్యం.. కుటుంబమంతా కలిసి పూజిస్తే ఆరోగ్య లక్ష్మి, కుటుంబ వృద్ధి. ఎంతోకాలంగా వేధిస్తున్న సమస్యలకి పరిష్కారం. క్రమం తప్పకుండా నూట ఎనిమిదిరోజులు ఈ క్రింద శ్లోకాన్ని ధ్యానించండి.

**చంద్రహాసోజ్జ్వలకరా శార్దూలవరవాహనా।**

**కాత్యాయనీ శుభం దద్యాద్దేవీ దానవఘాతినీ॥**

## కల్పవృక్షం క్రింద వంట చేస్తే

కదంబ వృక్షమంటే కల్పవృక్షమే. ఎక్కడో అరుదుగా వుంటాయి ఈ వృక్షాలు. శివ, విష్ణు క్షేత్రాల్లో, పుణ్య ప్రాంతాల్లో వుంటాయి. దానికింద వంట చేసి కుటుంబసభ్యులతోనూ,



బంధువులతోనూ భోజనం చేస్తే గ్రహబాధలూ, శరీరానికి పట్టిన పీడలు తొలిగిపోతాయి. కదంబ వృక్షం కింద కొంతసేపు వుండటమంటే సాక్షాత్తు కల్పవృక్షం నీడలో వుండటమే.

## కాళీరాత్రీదేవిని నల్లకలువలతో పూజిస్తే

కాళీరాత్రీదేవి గృహంలోని సకల పీడలను పారద్రోలే మహాశక్తి గలది. త్రినేత్రధారి. మహా భయంకరి అయినా భక్తుల పాలిట అమృతవల్లి. అపమృత్యు నివారణి. దుఃఖాలను పోగొడుతుంది. శత్రువులు కాళ్ళ వద్దకు వస్తారు. అలాంటి శుభంకరి ధ్యాన శ్లోకమును రోజూ పఠించండి.

**ఏకవేణీ జపాకర్ణపూరా నగ్నా ఖరాస్థితా**

**లంబోష్ఠీ కర్ణికాకర్ణీ తైలాభ్యక్తశరీరిణీ ॥**

**వామపాదోల్ల సల్లోహలతాకంటక భూషణా**

**వర మూర్ధ్వజా కృష్ణా కాళరాత్రిర్భయంకరీ ॥**

## దీపయజ్ఞం చేయుటం కుబేర ఫలమే

గృహంలోని పూజా మందిరంలో పూజ అపార దైవశక్తినీ, గృహశక్తినిస్తుంది. ప్రతిరోజూ పూజనంతరం దేవాలయంలో హుండీలో వేసినట్టు చిల్లరను పూజామందిరంలో ఉంచండి. కొంతకాలమైన తర్వాత ఆ ధనంతో రెండు దీపాలు కొని వెలిగించండి. ఇరవై రెండు దీపాలతో.. అఖండ దీపంతో మహాపూజ వరకూ మీ దీప పూజాయాత్ర సాగనీయండి. ఒకేసారి ఎన్ని దీపాలైనా కొనగలిగే వారికి చెబుతున్నది కాదు. ఆర్థిక స్తోమత లేక ఏరోజుకారోజు, ఏనెలకానెలా తెచ్చుకునే వారు మహా వైభవోపేతమైన



పూజ చేయాలనకునే వారి కోసం... పైన చెప్పిన విధంగా చెయ్యటం వల్ల అనంతమైన భక్తి, శక్తి భావాలతో మంచి ఉన్నతి సాధించగలరు.

**లోక కల్యాణం చేసేవాడు జన్మించాలంటే**

గర్భంతో వున్న స్త్రీకి నమస్కారం పెట్టడం అంటే సాక్షాత్తు శ్రీలలితాంబికకు నమస్కారం చేసినట్టే. అలాంటి వారికి దైవ గ్రంథాలనివ్వటం లోకకళ్యాణం కోసం చేసిన యజ్ఞం లాంటిదే. (ఆ పురాణాలు ఆ సమయంలో చదవటం వల్ల పుట్టే సంతానం లోకకాళ్యాణాన్ని కాంక్షించే వాడూ, చేసేవాడూ అవుతాడు)

**సముద్రంలో నీళ్ళు పొయ్యటం.... నీళ్ళున్న బావిలో నీళ్ళు పోయటం... దానం.... ధర్మం అవ్వదు.**

**వ్యాపారంలో వ్యవహార క్రమశిక్షణే కాదు ఆర్థిక క్రమశిక్షణ చాలా ముఖ్యం**

మిగతా వాటిల్లో నిర్లక్ష్యంగా వున్నా పెద్ద ప్రమాదమేమీ వుండదు. ఆర్థిక క్రమశిక్షణ లేకపోతే సకలం పోగొట్టుకోవాల్సి వుంటుంది. ఎంత వస్తుందో అన్నది కాదు.. ఎంత పోతోంది, ఎంత వెనక్కి వెళ్తున్నాము అన్నది ముఖ్యం. వెనక్కి వెళితే ఇక అంతే. మీ తెలివితేటలూ, గౌరవం, మర్యాద, కోరికలూ, సుఖాలూ, బాంధవ్యాలూ అన్నీ మంట గలిసిపోతాయి. ఆర్థిక క్రమశిక్షణ చాలా చాలా ముఖ్యం. జేబులో ఎంత వేసుకెళ్తామన్నది ముఖ్యం కాదు. ఎంత వెనక్కి తెచ్చామో బాగా లెక్కించి, లెక్కించి సాగండి. ఆర్థిక క్రమశిక్షణ లేకపోతే మొత్తం మీ పునాదులే చరిత్రలో కలిసిపోతాయి.



## సృష్టిలో బలహీన వృక్షం మునగ కాదు

❀ మునగచెట్టు ఎక్కించవద్దని సామెత. అంటే మునగ మనకి నేర్పింది మాటలు చెప్పి పబ్బం గడుపుకునే వారితో జాగ్రత్త అని.

❀ అహం పెరగకూడదు. పెరిగితే మునగచెట్టు ఎక్కినట్టే. మునగ చెట్టు ఎక్కితే కిందపడి కాళ్ళు చేతులు విరగకొట్టుకోవటం ఖాయం. అందుకనే మునగచెట్టు ఎక్కకూడదనేది. దాని పరమార్థం అహం పెరగకూడదని.

❀ నిజానికి మునగచెట్టు బెరడు ఆవుపాలలో మరిగించి ఆ కషాయాన్ని వడగట్టి కొత్త పెళ్ళికొడుక్కి ఇచ్చే వారు అత్తింటివారు. అంటే వంట చెయ్యలేక మునగకూర చేసి పెడుతున్నారు అని కాదు. మునగ పూలను పాలల్లో వేసి కొత్త పెళ్ళి కూతురిని గదిలోకి పంపే సాంప్రదాయం చాలా చోట్ల వుంది. అంత సామర్థ్యం కలది.

❀ మునగ చెట్టు పెరటిలో పెంచటమంటే సంపదలని పెంచినట్టేనని శాస్త్రము.

## యజ్ఞం చేసి రంకు బైటపెట్టుకున్నట్టు

వ్యాపారంలో అనేక అవకాశాలు వస్తుంటాయి. అప్పనంగా మిగిలే అవకాశం వచ్చినప్పుడు ఆచితూచి అడుగు వేయండి. ఎంతో కాలంగా మీరు సంపాదించినది ధనం మాత్రమే కాదు. గౌరవం, మర్యాద. మీరంటే మంచితనానికి మారుపేరు. ఏ చిన్న పొరపాటు చేసినా ఒక్కసారిగా మొత్తం కదిలిపోతుంది. ఇంత సంపాదించినది ఆ మార్గం ద్వారానేనా.. అని అంతా ఆడిపోసుకుంటారు. వెనకటికి లోకకళ్యాణం కోసం యజ్ఞం చేసి, యజ్ఞానికి ప్రియురాలిని పిలిచి కక్కుర్తిగా సరసాలాడంట... ఫలితం ఏముంది మొత్తం బూడిదలో పోసిన పన్నీరే.



## ఏదయినా మీ దగ్గరే వుండాలి

గొప్పవాడు కదా... మహాశక్తివంతుడు కదా.. అపార ధనరాసులున్నవాడు కదా అని మీ అపూర్వమైన ధనాన్ని వారి వద్ద వుంచిదే భంగపాటు తప్పదు. పూర్వము అనర్ఘమైన వస్తువులన్నీ సముద్రాన్ని ఆశ్రయించాయి. రత్నరాసులకు పుట్టినిల్లు, సకల నదీ జలాలు చేరే ఏకసూత్ర స్థానము కదా అని అనుకున్నాయి. కానీ అగస్త్య మహర్షి ఒక్కమాటుగా సముద్రాన్ని దోసిట్లోకి తీసుకుని త్రాగేశాడు. దాంతో అనర్ఘ వస్తువులన్నీ తెల్లబోయాయి. సముద్రపు నీటితో పాటు అగస్త్యుడి పాలయ్యాయి. ఎవరూ ఎప్పుడూ గొప్పవాళ్ళు, శక్తిగలవాళ్ళు, ధనవంతులు కాదు సుమా.. మీది మీ దగ్గర వుంటేనే భద్రం.

## ఈ సకల చరాచర సృష్టిలో ఏది గొప్పది

ఇదే విషయాన్ని మహాచక్రవర్తి తన సభలోని వారిని అడిగాడు. ఒకరు చెప్పిన దానికన్నా మరొకరు గొప్పగా చెప్పాలన్నాడు. మహా బహుమతి అన్నాడు.

'ఓ రాజా.. సకల భూమిని జయించిన నీ వీరత్వం గొప్పది....' అన్నారు ఒకరు.

మరొకరు 'సకల భూమిపై ఉన్న నగరాల్లో కీర్తిగల నీ నగరం గొప్పది' అని చెప్పారు.

ఇంకొకరు లేచి 'ఓ రాజా! సకల నగరాల్లోని భవనాల్లోకన్నా నివశించు నీ భవనం గొప్పది...'

చక్రవర్తి నిరాశగా కూర్చున్నాడు.



'ఓ ప్రభూ! పైవాటన్నింటికన్నా నీ విశ్రాంతి భవనం అద్భుతం..'

'కాదు ప్రభూ! అందరూ చెప్పి దానికన్నా గొప్పది నీవు శయనించే శయ్య గొప్పది...'

'పైవన్నీ కాదు ప్రభమూ.. ఆ శయ్యపై కాశ్మీరపుష్ప లేపనం (కుంకుమపువ్వు) పెదవులకు, లత్తుకకు రాసుకోకుండానే తామ్ర వర్ణంగల పెదవులు గలిగిన నీ ప్రియురాలు అన్నింటికన్నా గొప్పది... సకల వీరత్వాలనీ, సుఖాలనీ ఇచ్చేది అదే ప్రభూ....'

చక్రవర్తి అతనికి ఓ రాజ్యాన్ని బహుమానంగా ఇచ్చాడు.

## పేరు గొప్ప.... బంగారు దిబ్బ అని కొనద్దు

బాగా పేరున్నదని వున్నదంతా పోసి కొంటే ఆగిపోయిన సినిమాని కొన్నట్టే. నిజంగా బంగారవే అయితే ఎందుకు అమ్ముతారు. ఎవ్వరైనా బంగారు గనిని అమ్ముతారా? అదికొంటే పేరొస్తుందనీ, ఆ గుడ్‌విల్ అంతా తనదవుతదనీ కొంటే... అంతే. ఇంకా చెప్పాలంటే ఎవరి ధనాశకో మిమ్మల్ని బలిపశువుని చేస్తున్నట్టే. ఎవరో పునాది వేసిన దాని మీద ఇల్లు కట్టుకున్నట్టే. మీకై మీరు స్థాపించి నిర్మించితే అందులో వుండే ఆనందం, తృప్తి దేనిలో వుండవు.

## రెండు వ్యాపారాలొద్దు

ముఖ్యంగా మగాళ్ళకి రెండో ఇల్లుంటే ఎంత నరకమో(మొదట బాగానే వుంటుంది) తెలుసు. వుంటే నరకమే. అందుకే అలా తిరిగేవాళ్ళు చివరకు పెళ్ళాం వక్కతే సరి అని కాళ్ళ దగ్గరికి వచ్చేస్తుంటారు. రెండో వ్యాపారం కూడా అంతే. తర్వాతగాని తెలీదు.



అటూ, ఇటూ, ఇటూ, అటూ చూసుకోలేక తలప్రాణం తోకకొచ్చి భగవంతుడా.. వున్న ఒక్కదాన్ని ఐమీన్ ఒక్క వ్యాపారాన్ని ఎంత అభివృద్ధి చేసుకోవచ్చో... ఎంత ఆనందంగా వుండచ్చో .. వుండేవాళ్ళమో అర్ధమవుతుంది. అలా అని రెండో వ్యాపారం... రెండో ఇల్లు పెట్టి విజయం సాధించిన వారు లేరా అనుకుంటే నేను చెయ్యగలిగింది ఏమీ లేదు. ఒక్కటే వ్యాపారం.. ఒకే భార్య. జీవితంలో ఆనందం అంచులని చూపిస్తుంది. నేను చెబుతున్నది మధ్య తరగతి ఆపై తరగతి వారి గురించి...

## నష్టపోయిన వాడు ఆకలిగొన్న పులి

వ్యాపారంలో ఎత్తులు పై ఎత్తులు కొంతమందికి సహజం. నిజానికి వ్యాపారం అంటే ఎదుట వ్యాపారిని దెబ్బ కొట్టి పైకి రావటం కాదు. అలా దెబ్బకొట్టి నష్టం చేస్తే అవతల వాడు వూరుకోడు. ఆర్ధికపరమైన వాటినీ, అవమానాలనూ అన్నీ లెక్కించుకొని వడ్డీతో సహా తీరుస్తాడు. మీరు వ్యాపారం చేస్తున్నారు... ధనాన్ని సంపాదించాలనికుంటున్నారు. శత్రువులని కాదు. వ్యాపారంలో శత్రుత్వం వస్తే పొలం గట్టు సమస్యకన్నా... అన్నదమ్ముల ఆస్తిపంపకాలకన్నా... పెళ్ళాంతో గొడవ కన్నా... హద్దులు లేని పొలం కొనటంకన్నా భయంకరంగా వుంటుంది. కాన ఆ దారిలో వద్దు.

## ధర్మానికీ, న్యాయానికీ తేడా

వ్యాపారికి ఎన్నాళ్ళు చేసినా రూపాయి కూడా మిగలటం లేదు. దాంతో లాభం లేదని దేవునితో నాకెంతొస్తే అందులో నీకు సగమన్నాడు. ఆ రోజుకి అన్ని పోను రూపాయి (పూర్వము)



మిగిలింది. అనవసరంగా దేవుడికి మాట ఇచ్చానే అనుకుంటూ రెండు అర్ధరూపాయి బిళ్ళలను రెండు చేతుల్లో పట్టుకుని నడుస్తున్నాడు. ఎదురురాయి తగిలి పడ్డాడు. అంతే ఓ చేతిలోని అర్ధరూపాయి వెళ్ళి మురికి కాల్వలో పడింది. తాపీగా లేచి 'స్వామీ.. నీ వాటా కాల్వలో పడింది' అని చెప్పి ఎంచక్కా ఇంటికొచ్చేశాడు. అది న్యాయం. ధర్మమేమిటో తెలుసా.. మిగిలిన అర్ధరూపాయిని మార్చి పావలా దేవుడికివ్వటం. అదే ధర్మము. ధర్మము చేసిన వాడి భోజనంలోకి ఆహారం దేవాలయాల్లో కాసినవి (చింత..ఉసిరి... మునగ ఇత్యాదివి) వస్తాయి. న్యాయతర్కం చేసిన వాడి భోజనంలోకి ఆహారం ఎక్కడ పండినవి వస్తాయో వారి విజ్ఞతకే వదిలేస్తున్నాను. సంవత్సరం పచ్చళ్ళు పెట్టుకుందామనుకునేవారు దేవాలయాల్లో కాసినవి పెట్టుకోవాలని అర్థం చేసుకుంటే నేను చెయ్యగలిగింది లేదు.

## డబ్బే విలువని ఇస్తుంది, విలువని తీస్తుంది

ఆస్తుల గురించి కాదు.. వ్యాపారంలో డబ్బు గురించి. మీరు అనుకున్న సమయానికి జమ చేస్తుంటే ఇచ్చేవాడు ఎంత సరుకైనా క్షణాల్లో పంపిస్తాడు. అదే ఇవ్వకపోతుంటే అదిగో వస్తుంది... ఇదిగో వస్తుందని చెబుతాడు. వ్యాపారం విలువ తగ్గటమంటే రాబడి పోయినట్టే. ఇచ్చాడుగా వాడే తిరుగుతాడు... వాడు కాకపోతే ఇంకో దగ్గర కొందామనుకుంటే మీరు వెనకడుగు వ్యాపారంలో వేసినట్టే.



## సంబంధం తప్పిపోయిందని చింతించకండి

కొంతమంది ఆడాళ్ళు మొదట వచ్చిన సంబంధం చేసుకున్నా బావుండేది మిమ్మల్ని కట్టుకున్నాను అంటూ భర్తని సాధిస్తుంటారు. ఆమె అలా అనేది పైమటే గాని హృదయంలోంచి వచ్చే మాటకాదు. అయితే వివాహం అవ్వాలంటే ~~ఈ~~ భూలోకంలో వాళ్ళు కాదు, అమ్మాయీ అబ్బాయీ కాదు వప్పుకోవాల్సింది. ఆ లోకంలో అగ్ని, చంద్రుడూ, వాయువూ వప్పుకుంటే అప్పుడు సూర్యభగవానుడు తథాస్థు అంటాడు. పెట్టుపోతలు, భోజనాలు..కానుకలూ వంటి విషయాలను కింద ఎలా చర్చించుకుంటారో అలానే పైనవాళ్ళు చర్చించుకుంటారు. అక్కడ తథాస్థు అంటేనే ఇక్కడ మూడుముళ్ళు పడేది. అందుకే పెళ్ళిళ్ళు స్వర్గంలో నిర్ణయించబడతాయని అనేది.

## తలంబ్రాల బియ్యం ఎలా కలపాలి

వెండి లేదా ఇత్తడి పాత్రలో ఆవుపాలు కొన్ని పోసి అందు ఆవునేతిని వేసి ఆపై నూకలు లేని బియ్యాన్ని కలపాలి. అలా సిద్ధం చేసిన అక్షింతలను వివాహం చేయించే బ్రాహ్మణులు అక్షింతల మంత్రాలతో తగు శాస్త్ర విధంగా సిద్ధం చేస్తారు. వరుడూ, వధువూ చేతులలో తలంబ్రాలను బ్రాహ్మణుడు అభిషేకించిన తర్వాత ముందు వధువు శిరస్సుపై వరుడు పోయాలి. ఆ తర్వాత వధువు పోయాలి. అంతేగాని వీధి కుళాయి వద్ద నీళ్ళు పట్టుకున్నట్టు కాదు. అస్సలు తలంబ్రాల పళ్ళాన్ని ఎత్తి పొయ్యకూడదు. భవిష్యత్తులో ధనపరమైన సమస్యలు వస్తాయి. నక్షత్ర దర్శనమప్పుడు అరుంధతి నక్షత్రం పక్కన మహావెలుగుతో వుండే వశిష్ఠ నక్షత్రాన్ని గుర్తించి ఆపై అరుంధతి నక్షత్రాన్ని గుర్తించాలి.



## రొఖ్ఖానికే అమ్మండి

అప్పు వ్యాపారం ఎన్నటికీ మంచిది కాదు. సాయంత్రానికిపది వేలమ్మినా పరవాలేదు. అదే అప్పు వ్యాపారం లక్ష చేసినా సమస్యలు తప్పవు. అప్పు ఇవ్వాల్సి వస్తే అడగకుండా తెచ్చిస్తామన్న వారికీ, మీకు నమ్మకం ఉన్న వారికే ఇవ్వండి. అడిగితే వెంటనే పంపిస్తారన్న నమ్మకం ఉన్న వాళ్ళకి ఇవ్వాలి. నాలుగైదు సార్లుఅడిగి రెండు సార్లు తిప్పించుకుని ఇచ్చేవారికి ఇవ్వాలా... వద్దా.. అనేది మీ ఇష్టం.

## ఆడపిల్లకిష్టమైతే ఎన్ని లక్షణాలనైనా ఎలా సమర్థిస్తుందో తెలుసా...?

పర్వతరాజ పుత్రి పార్వతి ఈశ్వరుణ్ని వివాహం చేసుకోవాలని తలచింది. ధనం లేదనీ, ఆస్తులు లేవనీ నచ్చచెప్పటానికి ప్రయత్నించిన తల్లి, కుమార్తెల మధ్య సంవాదం....

పార్వతీ... అందమైన వరుడు కావాలని ఏ పడతి అయినా కోరుకుంటుంది. నువ్వేమో మూడు కళ్ళ ఈశ్వరుణ్ని.....

'లోకంలో ఎవరికైనా రెండు కళ్ళు వుంటాయి. ఆయనకి మూడు కళ్ళు.. ఎంత గొప్ప.'

కయ్యానికైనా, వియ్యానికైనా సమ ఉజ్జీ కావాలి. నీ తండ్రి రత్నాలకి నిలయమైన పర్వత రాజు.... అతడేమో ఏమీ లేనివాడు...

'అమ్మా ఆయన పేరులోనే ఈశ్వర శబ్దం వుంది. అనగా ఐశ్వర్యం వుంది. అంతకుమించిన ఐశ్వర్యం ఏముంది?'

అటు ఏడు తరాలు ఇటు ఏడు తరాలు చూస్తారు... బ్రహ్మ వంశంలో నీవు పుట్టావు. ఆతడికేమో కులగోత్రాలు కూడా తెలియవు.



'అమ్మా.... బ్రహ్మనే సృష్టించినవాడతను. అట్టి వాని పుట్టు పూర్వోత్తరాలు ఎవరికి తెలుస్తాయి... ఎవరు తెలుసుకోగలరు?'

- శ్మశానంలో తిరుగుతూ, భస్మాన్ని రాసుకుంటాడు. ఎద్దుపై సంచరిస్తాడు. నీవు ఆ ఎద్దు వెనుకే ఎక్కి తిరగాలి.

' వివాహం అయ్యాక భర్తను అనుసరించటం స్త్రీ ధర్మం. నా భర్త వాహనం మొసలి అయినా దాని పైనే ఆయన వెనుకే కూర్చుని తిరుగుతాను.'

- నీవు సుకుమారివి.. సకలాభరణములతో మెరిసిపోయే నీవు పరిచారికలా సర్పాలను ఆభరణాలుగా ధరించిన అతడి పక్కన వుండాలి... ఊహించుకో.

'అమ్మా... ఇన్ని మాటలేల. పడతికి నచ్చిన వాడికన్నా ధనవంతుడూ, గుణవంతుడూ, సాహసవంతుడూ ఎవరుంటారు? నీకు తెలియనిది కాదుకదా....' అని పార్వతీదేవి తిరిగి ప్రశ్నించింది. కాన ఆడపిల్లకి నచ్చితే చెయ్యగలిగింది ఏమీలేదు. కష్టమైనా, సుఖమైనా ఆమె ఇష్టపడుతుంది. కాబట్టి చేసెయ్యటమే.

## మిమ్మల్ని వెతుక్కుంటూ ఎవరూ రారు....

అద్భుతమైన... నాణ్యమైన వస్తువులనే అమ్ముతున్నారు. కానీ అంత ఆదరణ రావటం లేదు. దానికి కారణం అందరికీ తెలియకపోవటం. మీ దగ్గరున్న వస్తువు గురించి విస్తృతమైన ప్రచారం జరిగినప్పుడే సంవత్సరంలో అమ్మే అమ్మకం నెలలో అమ్మగలుగుతారు. అదే అత్యున్నత వ్యాపార సూత్రం.



## దైవ సంబంధమైన ఆపద వస్తున్నప్పుడు

పక్షులు ఘోరాతిఘోరంగా అరుస్తాయి. మనుషులతో కలిసి జీవించే జంతువులు ప్రదక్షిణంగా వెళ్తుంటాయి. అలాంటి శకునముల వల్ల ఏదో ఆపద రాబోతుందని భావం. అలాంటి శకునములే దశరథునికి సీతా కళ్యాణం తర్వాత అయోధ్యకు బైలుదేరుతుండగా కానవచ్చాయి. వరాహ మిహుతుడు శకునశాస్త్రం ప్రకారం గరుడపక్షి.. పాలపక్షి.. కోడి.. కుక్క కుడి నుంచి ఎడమకు వెళితే ప్రయాణిస్తున్న వ్యక్తికి ధనప్రదము. ఎడమ కన్ను క్రింద భాగము అదిరినా... పాదములు తడబడినా మహాశోక విషయం తెలుసుకోవాల్సి వస్తుంది. (మారీచ వధ తర్వాత ఆశ్రమానికి వస్తున్న శ్రీరామునికి అలానే జరిగింది) బాహువులు ఎక్కువగా అదిరితే శత్రువుని ఎదుర్కొనవల్సి వచ్చే పరిస్థితి. స్త్రీలకు ఎడమకన్ను అదరటం శుభం. పురుషులకి కుడికన్ను అదరటం శుభం. స్త్రీలకు ఎడమకన్ను.. ఎడమ భుజం.. ఎడమ తొడ అదిరితే మహా సంతోషకరమైన వార్తను వింటారు. వంటగదిలో దేవతా నూనెల వద్ద కనిపించకూడని జీవులు కనపడినా.... ఆవుపాలు విరిగిపోయినా.. కాకులు గుంపులుగా చేరి అరుస్తున్నా వెంటనే స్నానం చేసి దేవాలయంలో ఇష్టదైవాన్ని దర్శనం చేసుకోవాలి.

## కడుపుతో వున్న వాళ్ళు సాక్షాత్తు

అమ్మవారే. అట్టి వారి ఆశీర్వాదం, మాట... దీవెన అమోఘంగా పనిచేస్తాయి. గర్భిణికి తల్లి లేదా అత్తమామలు శ్రీరామాయణమును ఇవ్వటం ద్వారా ఆమె దాన్ని చదవటం ద్వారా



గర్భం ధరించినప్పుడు చేయాల్సిన విధులు కొన్ని చెయ్యకపోయినా, చేసిన వాటిల్లో దోషాలున్నా సమసిపోతాయి. పుట్టేవాడు లోకహితం కోరేవాడూ, తల్లి తండ్రికి, వంశానికి సుఖాలనిచ్చేవాడూ, కీర్తినిచ్చేవాడూ జన్మిస్తాడు.

## వ్యాపారంలో గుడ్డిగా ఎవ్వరినీ నమ్మకండి

ఎంతమంది ఉద్యోగులుంటే అంతమందికీ ప్రతి పనీ తెలియటం ... చెయ్యటం తెలిసుండాలి. గుడ్డిగా అన్ని పనులు... అన్ని విషయాలు, అన్ని చోట్లకి ఒక్కర్నే పంపుతుంటే ఏదో ఒకరోజు పెద్ద సమస్యే అవుతుంది. తను లేకపోతే మీరేం చెయ్యలేరన్న ధీమా ఏర్పడితే తనకి నష్టం జరిగినా మిమ్మల్ని ఇబ్బంది పెట్టాలని మానేస్తే అంతా సరిదిద్దుకోవటానికీ, తెలుసుకోవటానికీ సమయంతో పాటు ధన నష్టం జరిగి వ్యాపారంలో భారీగా నష్టపోవాల్సి వస్తుంది.

## వ్యాపారంలో ఈ నాలుగు విషయాల్లో సదా అప్రమత్తంగా వుండాలి

కొనుగోలు...

అమ్మకం...

నిర్వహణ...

అధికారులు...

కొనుగోలులో తేడా వస్తే అమ్మకంలో తేడా వస్తుంది. అమ్మకంలో తేడా వస్తే నిర్వాహణ దెబ్బ తింటుంది. దాంతో అన్ని చికాకులు కలిగి ప్రారంభించిన వద్దకే రావల్సి వుంటుంది.



## వరాహమిహిరుడి శకున శాస్త్రం ప్రకారం...

పురుషులకి కుడికన్ను అదిరితే మంచిది.. చెక్కిలి అదిరితే ధనప్రాప్తి.... కుడిభజం అదిరితే మహాశరీర సుఖం.. కింద పెదవి అదిరితే ప్రయాణం.. ఇక అరికాళ్లు అదిరితే సౌఖ్యం.... రొమ్ము అదిరితే ఆకస్మిక ధనప్రాప్తి.

## మహా భయంకరమైన వారు జన్మించకుండా ఉండాలంటే....

సంధ్యాకాలం భర్తతో సమాగమనం వల్ల రాక్షస అంశలతో సంతానం జన్మిస్తారు. అందుకే ఆ సమయంలో ఎంతటి ఏకాంతం వున్నా, ఎంత కోరిక వున్నా ఆపుకోవాలి. అణచుకోవాలి. అవి చెయ్యాల్సింది పురుషులే. ఆ సమయంలో కలిగిన కామవాంఛా దోషం పోవటానికి పరిహారం చేసుకోవాలి. అలా కాకుండా కైకసిలా ముందుకెళితే లోకవినాశకరమైన సంతానం కలుగుతుంది. మాల్యవంతుడు కూతురికి వలదని చెప్పినా వినకుండా కైకసి తన భర్త విశ్రవసుడితో సంధ్యాకాలంలో మహా ఆవేశంతో రమించింది. ఫలితంగా జన్మించిన వారే రావణ కుంభకర్ణాదులు.

## అదృష్ట దర్శనం....

తామరపువ్వు ఎంత అందమైనది. దాన్ని చూడటం కూడా అదృష్టమే. సూర్యాస్తమయం అవ్వగానే ముడుచుకుపోతుంది. పాపం చంద్రుడు ఎంత ప్రయత్నించినా తామర పువ్వు అందాన్ని ఆస్వాదించలేడు. ఇక చంద్రుడు ఎంత అందమైనవాడు. చంద్రుడ్ని చూడని కనులెందుకు. ముకిళించుకుపోయిన తామరపువ్వు



చంద్రుణ్ని చూడలేదు. అలా ఇద్దరిదీ దురదృష్టమే. వ్యర్థమే. ఈ పోలిక ఎందుకో ఆలోచించండి. మీది అనుకున్న అందాన్ని తనివి తీరా చూడాలి....

## జాతకంలో రెండో పెళ్ళి వుంటే

నూతన వరుడి చేత అరటిచెట్టుకి తాళి కట్టించి దాన్ని పెళ్ళికొడుకు చేత నరికిస్తారు. ఆ తర్వాత జాతక ప్రకారం పెళ్ళికొడుక్కి రెండో వివాహం ఉంటే ఆ దోషం అలా పోతుంది. అందుకే ఆ విధంగా చేస్తారు. ఆ శాస్త్రం పక్కన పెడితే అలాచేసే వాళ్ళు పదకొండు అరటి మొక్కలని ఎక్కడైనా నాటాలి. అప్పుడే ఆ దోషం పోతుంది.

**బురద స్నానాలు చేయటం, చెట్లు ఎక్కటం వంటి చర్యల ద్వారా మహిళల బాధలు పోతాయన్నది కేవలం నమ్మకం మాత్రమే. చెట్టు ఎక్కితే కాదు... చెట్లను నాటి పెంచితే శరీరంలోని దుష్ప్రభావాలు తొలగిపోతాయి. అందుకనే మన పెద్దలు ప్రతి గృహంలో ఒక్క తులసి మొక్క అయినా ఉండాలనీ, మంచిదనీ, శాస్త్రమనీ, పుణ్యమనీ పూజాదికాలను చేయించేది.**

## వ్యాపారంలో అప్పు తప్పదు

ఎంతటి వాళ్ళకయినా వ్యాపారంలో అప్పు తప్పదు. వ్యాపారం కోసం అప్పు తీసుకుంటే ఎవ్వరికీ తెలియకుండా తీసుకోవాలి. ఎవ్వరికీ తెలియకుండా ఇవ్వాలి. మీరు రెండు రూపాయిల వడ్డీకి తీసుకున్నారని తెలిస్తే ఆపై ఇచ్చేవాడు రెండున్నరంటాడు. అలా అలా... అది ఎంతకయినా పోతుంది. కాన జాగ్రత్త.



## ఇవన్నీ ఎక్కడివి.. ఎవరు చెప్పారు

❀ గౌరవ మర్యాదలు గలవారికి అపకీర్తి మరణం కన్నా దారుణమైనది.

❀ పిరికితనం వలదు.. ధైర్యమే అన్ని సమస్యలను పారద్రోలి విజయాన్నిస్తుంది.

❀ సంబంధంలేని వాటి గురించి చింతించి ప్రయోజనం లేదు.

❀ ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి.

❀ ప్రతిఫలం ఆశించకుండా చెయ్యవల్సిన ధర్మాన్ని చేస్తే అదే మీకు మహరాజ యోగం కల్పిస్తుంది.

❀ చేసే వృత్తిలో నైపుణ్యమే నిన్ను గొప్పవాడిని చేస్తుంది.

❀ చెడు అలవాట్లు తియ్యగా వుంటాయి. మధురంగా అన్పిస్తాయి. కానీ అవే నిన్ను అధఃపాతాళానికి నెట్టివేస్తాయి.

❀ చేసే పాపాలకీ, పుణ్యాలకీ నీ భార్యాపిల్లలతో పాటు పరమాత్మకి కూడా సంబంధం లేదు. ఆ పాపఫలాన్ని మీరే అనుభవించాలి.

❀ ద్వేషానికీ, కోపానికీ తేడా తెలుసుకో. కోపం ద్వేషంగా మారి నిన్నే నాశనం చేస్తుంది.

పైవన్నీ శ్రీభగవద్గీతలోని సారాంశములు. జీవితంలో అత్యున్నతమైన స్థానానికి చేరాలంటే శ్రీభగవద్గీతను చదవండి. మళ్ళీ మళ్ళీ చెబుతున్నాను... చదివించండి.



## సూర్యుడిలా ఆక్రమించాలి

సూర్యుడు లోకమంతటా తన కిరణాలను వ్యాపింపచేస్తాడు. తూర్పు నుంచి పడమరకు చేరుకున్న తర్వాత తన భార్య సాయం సంధ్యతో సేదతీరుతాడు. అది ఏ వ్యాపారమైనా కావచ్చు... ఏ రంగమైనా కావచ్చు. సూర్యుడిలా పూర్తిగా పని చేయాలి. పాదాక్రాంతం చేసుకోవాలి. ఆపైన భార్యతో, కుటుంబ సభ్యులో సేదతీరాలి. మధ్యలో పక్కకెళితే జరిగేది నష్టమే.

**మహాసముద్రాన్ని నీటికడవలతో కొలిచి ఎన్ని కడవల నీరుందో చెప్పగలమా....? అలాగే భగవంతుడి శక్తి గూర్చి, దయ గూర్చి, గుణాలను గూర్చి ఎవ్వరమూ ఇంతని చెప్పలేము.**

## ఎక్కువగా కొను తక్కువకి అమ్ము...

తన వ్యాపార సామ్రాజ్యాన్ని విస్తృతంగా విస్తరించి అపారమైన ధనాన్ని సంపాదించిన ఒక వ్యాపారి తన అవసాన దశలో వ్యధ చెందసాగాడు. అప్పుడు తన కొడుకుతో 'నా తర్వాత వ్యాపారం ఎవ్వరు చూసుకుంటారు. నీకేమో వ్యాపార దక్షత లేదు. చెబితే నేర్చుకోలేదు...' అన్నాడు. 'ఏం పర్వాలేదు ఇప్పుడు నేర్చుకుంటాను' అని కొడుకు అనటంతో 'నాయనా వ్యాపారంలో ఒక్కటే సూత్రం గుర్తుపెట్టుకో... ఎక్కువ కొను... తక్కువకి అమ్ము' అని మరీ మరీ చెప్పాడు. ఆ తర్వాత ఎంతోకాలం లేడు. తండ్రి చెప్పిన సూత్రం పాటించి ఎక్కువకి కొని, తక్కువకి అమ్మి కొడుకు అంతా చాలా కొద్దికాలంలోనే పోగొట్టుకున్నాడు. మహావ్యధకి గురయ్యాడు. తండ్రి స్నేహితుడు పరామర్శకి వచ్చినప్పుడు ఆ



కొడుకు తన బాధను, తండ్రి మాట చెప్పి బోరుమన్నాడు. అప్పుడా స్నేహితుడు 'నాయనా... మీ నాన్న చెప్పింది సరిగా పాటించలేదు. ఎక్కువకి కొనమంటే అందరూ బండి సరుకు కొంటే నీవు పదిబండ్లుకొను. అందరూ రూపాయికి అమ్ముతుంటే నీవు తొంభయిపైసలకి అమ్ము అని అర్థం' అని చెప్పాడు. ఆ తర్వాత ఆ బిడ్డ ఏం చేశాడు.. సంపాదించాడా లేదా అని కాదు మీరు ఆలోచించాల్సింది.

## సంవత్సరం తర్వాత కూడా లెక్క ఇవ్వగలగాలి

ఎలాంటి వారికైనా కొన్ని మొండి బాకీలు వుంటాయి. అవి సదా తొలుస్తూనే వుంటాయి. చాలాకాలం తర్వాత అడిగితే ఇచ్చాను కదా.... లేదా అంత వుందా? అన్న ప్రశ్నలకి మీ దగ్గర సమాధానం ఖచ్చితంగా వుండాలి. అలా లేకపోతే డబ్బు రాకపోగా అబద్ధాలు చెప్పేవారన్న బిరుదు కూడా వస్తుంది. ఆ నెలలో ఆ రోజు ఎక్కడికి పంపింది అన్న ఖచ్చితమైన వివరాలు ఇవ్వగలిగినప్పుడు ఆ బాకీ ఏనాటికైనా తిరిగి వస్తుంది. అన్నింటికీ మించి వారితో అభిప్రాయ బేధం రాదు.

## గిరాకి వస్తువులు

ఏ వ్యాపార రంగంలోనైనా సరే కొన్ని వస్తువులకి విపరీతమైన కొరత ఏర్పడుతుంది. ఆ సమయంలో ఎవ్వరైనా అధిక మొత్తంతో అమ్ముతుంటారు. అలాంటప్పుడు కూడా మీరు మామూలు లాభంతో చేస్తే ఆ గుడ్‌విల్ మీకు భవిష్యత్తులో రాచమార్గం వేస్తుంది. అందరూ అధికమొత్తంతో అమ్ముతుంటే మీ కష్టమర్‌కి సాధారణ



లాభంతో ఇవ్వటమనేది మీకే తెలియకుండా మీరు మీ వ్యాపారానికి బంగారు బాట వేసుకున్నట్టే. మీ దగ్గరికి రెగ్యులర్‌గా వచ్చేవారో.. పక్క పోటీదారులో వారిని పంపి కొనిస్తున్నారేమో ఒక్కసారి సరిచూసుకోండి.

## ఎదుటవాడ్ని చెడగొట్టడం కోసం వ్యాపారం చేయద్దు

వ్యక్తిగతమైన ద్వేషం కొద్దీ... మరేదో కారణం చేత.. అవతలవార్ని నష్టపరచాలని మీరు ధర తగ్గిస్తే నష్టపోయేది మీరే. ఆ ఒక్క వస్తువే కాదు భవిష్యత్తులో మీరే వస్తువు అమ్ముతున్నా అదే ధరకి అదే పద్ధతికి అడుగుతారు. అది చాలా సమస్యలను తెస్తుంది. పోటీగా నాణ్యత ఇవ్వాలి. విస్తృతంగా అన్ని చోట్ల వుంచాలి. నలుగురికీ తెలియచేయాలి. అప్పుడే మీరు వ్యాపారంలో స్థిరంగా వుంటారు. చాలా ముతక సామెత ఒకటుంది. పావలాకి ఒక్కసారి సరేనంటే......

## వ్యాపారం తగ్గుతోందా....

- అధిక ధరకి అమ్ముతున్నారేమో చూసుకోండి.
- మీ పోటీదారుడు నాణ్యతా.. మీకన్నా తక్కువ ధరకి ఇస్తున్నాడేమో సరిచూసుకోండి.
- మీ కోపం... అసహనం, గొడవల వల్లనేమో కూడా చూసుకోండి.
- మీ మీద చెడు ప్రచారం జరుగుతుందేమో....
- వేళకి వుండటం, తీయటం లేదేమో చూసుకోండి.



- మీకన్నా అన్ని రకాల వసుతులతో పోటీదారుడు నిర్వహిస్తున్నాడేమో చూసుకోండి.
- పదిమంది కలిసి మీ వ్యాపారాన్ని దెబ్బతీస్తున్నారేమో విచారణ చేయండి.
- కొనుగోలులో నాణ్యత లేనివి వస్తున్నాయేమో మీరే స్వయంగా చూడండి.

## గంట గంటకీ కొనుగోలు చేయాలి

నిత్యం రద్దీగా వుండే వ్యాపారం అయితే అమ్మిన సొమ్ముతో ఎప్పటికప్పుడు ఖరీదు చేస్తుండాలి. అమ్మకం మీదున్న శ్రద్ధ కొనుగోలులో కూడా వుండాలి. అమ్మకం పక్కనుంచితే అనగా రొఖ్ఖం చేతిలో వుంటే మనసు అనేక విషయాల మీదకెళ్తుంది. ఆపై ఖర్చయిపోతుంది. ఆ తర్వాత అప్పు చెయ్యాల్సి వస్తుంది. అప్పు ఇచ్చేవాడికి మీ ఆదాయంలో వాటా ఇచ్చినట్టే. దాంతో పాటు మీ శ్రమా, తెలివితేటల్లో కూడా వాటా ఇచ్చినట్టే.

## సొంత చెల్లికయినా వూరికే ఇవ్వకండి

మీరే వ్యాపారం చేసినా సరే.. మనదే కదా. మనం తయారు చేసేదే కదా, మన సోదరే కదా.. మనమ్మాయే కదా అని ఎట్టి పరిస్థితుల్లో ఉచితంగా ఇవ్వకండి. ప్రేముంటే లక్ష ఇవ్వండి. వూరికే తీసుకెళ్ళమంటే మీ మీదే కాదు.. మీ వ్యాపారం మీద కూడా చులకన వస్తుంది. 'ఫలానా వస్తువా.. మాకు ఫ్రీగా వస్తుంది' అనే మాట మీ చుట్టూ వున్న వారి కొనుగోలులో తేడా వస్తుంది. స్నేహితుడని వాడికిచ్చాడు... సోదరి అని ఆమెకిచ్చాడు... మరదలని నాకివ్వడా.... అని వెరసి రావాల్సిన వ్యాపారం ఢమాల్.



## పోయే కాలం దగ్గరికొస్తే వచ్చే లక్షణాలు

- ఎవరేం మాట్లాడుకుంటున్నా తన గురించే అనుకోవటం.
- తన మాట విననందుకు అవతల వాడ్ని సర్వనాశనం చెయ్యాలనుకోవటం. ఆ దిశగా ప్రయత్నించడం.
- తన కన్నా అన్ని విషయాల్లోనూ తక్కువైన వారితో కలిసి మంత్రాంగం చెయ్యటం.
- తన కన్నా అందరూ తక్కువ స్థాయి వాళ్ళనుకోవటం... ఎదుట వాడ్ని తక్కువగా అంచనా వెయ్యటం.
- సేవకుల దగ్గర తన గొప్పలు చెప్పటం... శత్రువుని తిట్టడం.

## స్త్రీకుండే మహా అలంకారం...

స్త్రీకి ఎన్ని అలంకారాలు వున్నప్పటికీ, ఎన్ని చేసుకున్నప్పటికీ ఆమె అత్యున్నతమైన, అందమైన అలంకారం ఆమె భర్త మాత్రమేనని సాక్షాత్తు హనుమంతుడు శెలవిచ్చాడు. అట్టి భర్త గురించి ఆయన పలుకుల్లో.

"భర్తానామ ప్రియం నార్యాభూషణం భూషణాదపి"

## శ్రీలక్ష్మి (ధనం) ఇంతకు మించిన గొప్పది....

- సకల సుఖాలకీ, దుఃఖాలకీ లక్ష్మియే కారణం.
- సుఖాల కోసం... శుభాల కోసం తపించేవాడు లక్ష్మి విషయంలో అప్రమత్తమై వుండాలి.
- విచ్చుకత్తుల కమలవనంలో తిరుగాడే తుమ్మెద వంటిది ధనం.
- పురుషోత్తముడి ప్రియురాలైనా.. పాలసముద్రం నుంచి



జన్మించింది కదా... తన తోబుట్టువులైన కల్పవృక్షం నుంచి రాగాన్నీ, ఇక చంద్రుడి నుంచి వక్రతనమూ, ఉచ్ఛైశ్రవం నుంచి చంచలత్వాన్నీ.. కాలకూట విషాన్నించి మైకాన్నీ, అమృతాన్నించి మదాన్నీ, మహా కౌస్తుభమణి నుంచి మహా కాఠిన్యాన్నీ తనతో పాటు పుట్టింటి ఆస్తిగా తెచ్చుకుంది.

ఎన్ని మేకులతో కట్టినా ఆగదు... ఏనుగులనీ, సింహాలనీ కాపలా పెట్టి బంధించినా తాను ఉండకూడదనుకుంటే అక్కడ ఉండదు.

కులం.. గుణం.. పాండిత్యాలు అస్సలక్కర్లేదు.

ఆచారాలూ... ధర్మం.. న్యాయం... సత్యం.. త్యాగం.. పరాక్రమం.. గుణం.. దాత.. ఏవీ ఆమెకి పట్టవు.

లక్ష్మీదేవి పాలసముద్రంలో జన్మించటం వల్లనేమో... ఆ సుడులలో తిరుగుతూ ఆడుకున్న ఆటలు మరవనట్టుగా ఓచోట కుదురుగా కాలు నిలపదు.

సృష్టిలో నమ్మకూడని వాటిలో లక్ష్మి మాత్రమే.

సరస్వతి వుంటే అస్సలక్కడుండదు. అయితే వెళ్ళటానికి సరయిన కారణం వెదికి వెదికి గాని వెళ్ళదు.

సకల లోకాలను కాపాడే శ్రీమహావిష్ణువు అర్ధాంగి అయినా నీచులతో, దుర్మార్గులతో చెలిమి చేస్తుంది. ధనమదాన్ని ఎక్కిస్తుంది. వికారాలను కలిగేలా చేస్తుంది. ఎంతటి నీచ కోరికలకైనా ఉసికొల్పుతుంది. ఎవ్వరి ఔన్నత్యానికైనా కారణం లక్ష్మినే. పతనానికీ కారణం ఆ లక్ష్మియే.

- బాణుడు



**పదకొండు రోజులు గానీ.... పదకొండు వారాలు గానీ... పదకొండు నెలలుగానీ... పదకొండు సంవత్సరాలు గానీ సత్య వ్రతం పాటించి ఆపై పలికితే జరిగి తీరుతుంది. అందులో ఎలాంటి సందేహం లేదు. పదకొండు రోజులు సత్యవ్రతం చేసి ఆపై వాక్కు రూపంలో అనండి. అది ఏదైనా.... జరిగి తీరుతుంది.**

## సంతానం కలగగానే....

పూర్వము ఎంతో తతంగం చేసేవారు. సూతికా గృహంలో ఏ పీడలూ, దోషాలూ రాకుండా ఎన్నో శాంతులు చేసేవారు. బంగారంతో చేసిన నాగలినీ.. రోకలినీ, సూతికా గృహం వద్దే వుంచేవారు. ఇక ద్వారానికి ఏకంగా పులిచర్మం కట్టేవారు. ద్వారం బైట అనేక పూల మాలతో కట్టిన మేకును వుంచేవాళ్ళు. తల్లి మంచం తలాపి వద్ద నవధాన్యాలకు పోసిన కావడి బిందెలను వుంచేవారు. అందులో బొమ్మ వుంచి.. మేక కొమ్ము.. వేపాకులూ, పాముకుబుసమూ పొడిచేసి పొగవేసేవాళ్ళు. అలాంటివన్నీ చెయ్యటం ద్వారా శిశువుకి మహా శౌర్య శక్తీ, తేజస్సు రావటంతో పాటు తల్లి ఆరోగ్యమూ, అందమూ ఇనుమడింపచేస్తాయని అప్పట్లో అన్ని పోకడలను చేసేవారు.

## ఈ ఇద్దరికీ నమ్మక ద్రోహం చెయ్యటమంటే...

భార్య భర్తకి.. స్నేహితుడు స్నేహితుడికి చేసే మోసం... నమ్మకద్రోహానికి నరకలోకంలో కూడా పూర్తి శిక్ష వెయ్యలేకపోవటంతో పుట్టిన దగ్గర్నించే భయంకర వ్యాధిని పెట్టి పంపుతాడు బ్రహ్మదేవుడు. అన్నం పెట్టిన వాడికే ద్రోహం చేసిన ఓ



వ్యక్తితో మాట్లాడుతూ... అలా ఎందుకు చేశావ్ తప్పు కదా నమ్మినవాడికి అంత ద్రోహమా..? దానికి వాడు చెప్పిన సమాధానానికి నాకు పొలమారింది. ఆవుపాలు పితకటానికి... గడ్డితో చేసిన దూడని పెట్టి పాలు పితుకుతారు. నమ్మటం ఆవు తప్పు. నాదెలా అవుతుంది... అయినా దాన్ని బ్రతకనేర్వటం అంటారు అన్నాడు. నాకు నోటి దాకా వచ్చింది...'ఇంట్లో వున్న నీ భార్యని నమ్మే వచ్చావ్... అదే మాట ఆమె కూడా తప్పు చేసి అంటే.. ఏమవుతావ్...' అని. కానీ నేనామాట అనలేదు. అతనెళ్ళిపోయిన తర్వాత పక్కనున్న నా మిత్రుడు అడిగాడు. నేను వాడికి ఒకటే చెప్పాను... ఓ అడవిలో భల్లూకాన్ని కలుసుకోవటానికి వెళ్ళి మాట్లాడుతున్నప్పుడు పెద్ద పులి వచ్చింది. భయంతో భల్లూకం, మనిషీ చెట్టెక్కారు. క్రిందున్న పులి అంది... నేను ఎంతసేపయినా వేచి వుంటాను.. నాకు ఆకలిగా వుంది. నాకు తిండి కావాలి. ఓ భల్లూకమా... నీవు సాటి జంతువువి. కాన ఆ మనిషిని తోశేయ్. వాడ్ని తిని నిన్నొదిలి వెళ్ళిపోతాను అని. దానికి భల్లూకం అంగీకరించలేదు. దాంతో పులి... ఓ మనిషీ నిన్ను వదిలేస్తాను.. ఆ భల్లూకాన్ని తోసేయ్ అంది. ఆ మనిషి ఒక్క క్షణం కూడా ఆలోచించకుండా భల్లూకాన్ని తోసేశాడు.....ఆ తర్వాత పులి భల్లూకాన్ని వదలి ఆ మనిషిని తినేసి భల్లూకం వంక చూసింది... అప్పుడా భల్లూకం 'ఛీ మనుష్యులు' అంది. దానికా పులి 'మనుష్యులంతా ఇతడిలానే వుండరు. ఆకలేస్తుందంటే తన శరీరాన్నే కోసి ఇచ్చిన దిలీప మహారాజు వంటి మహామహాత్ములు కూడా ఉన్నారు' అని-



## భర్త పరస్త్రీ వ్యామోహంలో పడితే

అరిచి గోల చేసి... రోడ్డెక్కితే నష్టపోయేది భార్యే. పూర్వం ఇలాగే కుబేరుడి పుత్రుడు నలకూబరుడికి ఈ తంటా వచ్చింది. ఇద్దరు సఖులు మాటల పోరు సాగించారు. నా వాడంటే.. వాడు నా వాడన్నారు. నారదుడు సహితం ప్రేక్షక పాత్ర వహించాడు. నలకూబరుడు భార్యవైపు కాక కలభాషిణి వైపు మొగ్గు చూపాడు. కాన ఆ వ్యామోహంలో వున్నప్పుడు మొగుడిపై అరిచి ప్రయోజనం లేదు. ఓపిక పట్టండి. నలకూబరుడు కలభాషిణిని వదిలేసినట్టు పట్టుకున్న దాన్ని మీ ఆయనా వదిలి తీరుతాడు. పురుష పుంగవులూ... ఒక్కటే గుర్తుపెట్టుకోండి. దేనికోసమో సముద్ర స్నానానికి వెళితే వున్నది వూడిందట. మళ్ళీ మళ్ళీ చదవండి పై వాక్యాన్ని.

**సూర్యాస్తమయం వేళ పరిమళాన్ని కోరుకునే లక్ష్మీదేవి**
**ముకుళించిన కమలంలోంచి బైటికి వస్తుంది.**

**- కాళిదాసు (రఘువంశం)**

## తమ ధనం పరులు దొంగలించకుండా...

పూర్వం దిలీప చక్రవర్తి పుత్రుడు తన తండ్రికి చెందిన మహా ధనాన్ని దొంగలించబోతున్నదెవ్వరోనని తెలుసుకోవటానికి గోమూత్రంతో కనులు తుడుచుకున్నాడు... తెలుసుకున్నాడు. కాన గోమూత్రంతో కనులు తుడుచుకుంటే మీ సంపదలపై ఎవ్వరు కన్నేస్తారో అర్థమవుతుంది.



## చర్యకి ప్రతిచర్య వుంటుంది

ఆర్థిక పరిస్థితి బాగోలేనప్పుడు ముఖ్యమైన పనులు కూడా మానుకొని వాళ్ళ నెత్తిన మరో రాయి తాము వేద్దామనుకునే వాళ్ళు కొకొల్లలు. చాలా సంవత్సరాల నుంచి మెటీరియల్ ఇచ్చి పని చేయించుకుని తర్వాత డబ్బులు ఇస్తున్నాడు మొదటి వ్యక్తి. ప్రస్తుతం వాని స్థితి బాగోలేదు. అతనికి వర్క్ చేసి ఇస్తున్న వ్యక్తి మెటీరియల్ రాగానే.. తయారు చేసి మొత్తం బాకీ అంతా కట్టి తీసుకెళ్ళమన్నాడు. దాంతో మొదటి వ్యక్తి ఖంగుతిన్నాడు. అతనెళ్ళాక అడిగాను. ఎందుకలా అన్నావ్ అని. ఇదివరకు ఇంతకంటే ఎక్కువ బాకీ పెట్టావ్ కదా.. ఇప్పుడెందుకు అలా అన్నావు అని. నవ్వేశాడు అతను. వాడి పరిస్థితి బాగోలేదు.. చాలా కాలంగా తెలుసు నాకు బాకీ ఏమీ లేదు. అలాంటప్పుడు డబ్బులిచ్చి తీసుకునివెళ్ళు ... లేదంటే నీ మెటీరియల్ అక్కడే వుంటుందని చెబితే అతనే తెచ్చి తీసుకెళ్తాడు. ఆ నవ్వులో శాడిజం కనిపించింది. మొదటి వ్యక్తి కిందా మీదా పడి తెచ్చికట్టి మెటీరియల్ తీసుకెళ్ళిపోయాడు. చూశావా.. ఎలా చేశానో... డబ్బులు కట్టి తీసుకెళ్ళాడు అన్నాడు నాతో. నేను నవ్వేశాను. ఎందుకు నవ్వావన్నాడు. నేను చెప్పలేదు.

ఆ తర్వాత చాలా రోజులకి నా దగ్గరికొచ్చాడు. ఏమయిందని అడిగాను. ఎవ్వరూ నాకు మెటీరియల్ పంపటం లేదు. నమ్మటం లేదు. పాతబాకీ కట్టమని లేదా డబ్బులిచ్చి మెటీరియల్‌తీసుకెళ్ళు అంతే అంటున్నారు. నేను చాలా



నిదానంగా చెప్పాను. చర్యకి ప్రతి చర్య వాళ్ళు చెయ్యక్కర్లేదు. దేవుడే చేయిస్తాడు. పక్కవాడి పరిస్థితి బాగోలేకపోతే అవకాశ వాదం చూసుకుని చేస్తే రేప్రొద్దున మన పరిస్థితి కూడా అంతేగా అనుకుంటారు. ఈ డబ్బు మనిషిని ఎక్కడుంచాలో అక్కడే వుంచాలనుకుంటారు. వెనుకటికి ఒకడు ఇరవై తొమ్మిది రోజులు అన్నంపెట్టాడు. ఒక్క రోజు పెట్టకపోయేటప్పటికి వీర తిట్లు తిట్టాడు. పైవాడు ఇరవైతొమ్మిది రోజులు అన్నం తిన్నవాడు. తేడా వచ్చేసరికి అసలు బుద్ధి చూపించాడు. అలాంటి మనస్తత్వం గలవారితో జాగ్రత్త.

## పధ్నాలుగు విద్యలు

ఋక్కు... యజస్సు.. సామం... అథర్వం... శిక్ష... వ్యాకరణం... ఛందస్సు... నిరుక్తం.. జ్యోతిష్యం... కల్పం... తర్కమీమాంస... పురాణ... ధర్మశాస్త్రాలు... ఇవే పధ్నాలుగు విద్యలు.

## ప్రాణభయం అనవసరం

మంచు పడినందుకే తామర పూవు వాడిపోతుంది. అంత పెద్ద పిడుగు పడినా చెట్టుకేం కాదు. అల్లుకున్న లతను నాశనం చేస్తుంది. కిందకారిపోయే నూనె బొట్టు దీప శిఖను నేలపాలు చేసినట్టు.. పుట్టడం ఎలా మన చేతుల్లో లేదో... చావు అంతే. దాని గురించి భయభీతులనవసరం. అజ మహారాజూ, వాని భార్య ఇందుమతీదేవి ఉద్యానవనంలో విహరిస్తుంటే దక్షిణ సముద్రతీరంలోని గోకర్ణేశ్వరాలయంలోని స్వామి వద్ద వీణాగానం చెయ్యటానికి వెళ్తున్న దేవఋషి వీణ మీదున్న పూలు జారి ఇందుమతీదేవి స్తనాగ్రములపై పడ్డాయి. దాంతో ఆమె అక్కడికక్కడే కూలిపోయింది.



## అజ్ఞాని దుఃఖిస్తాడు... జ్ఞాని దుఃఖించడు...

పెనుగాలికి చెట్టుకదులుతుంది గానీ కొండ కదలదు. జ్ఞానికీ.. అజ్ఞానికీ అదే తేడా.

**వినాయకుణ్ని గరికతో పూజించి ఆ గరికను తల మీద పెట్టుకుంటే విఘ్నాలు**

**తెప్పించడం వినాయకుడి వల్ల కూడా కాదు. (ఒక్కోసారి వినాయకుడ్ని ఎంత పూజించినా వచ్చే విఘ్నం వస్తూనే వుంటుంది. అలాంటి విఘ్నాలను తప్పించేదే వినాయకుడ్ని పూజించిన గరిక)**

## అత్యధిక స్త్రీలతో అనుబంధం సంతానహీనుడిగా చేస్తుంది

కోసల దేశపు చివరరాజు అగ్నివర్ణ మహారాజు ఏకాంత మందిరంలో అంగిక.. సాత్విక... వాచికాలనే మూడు విధాలను అభినయ పద్ధతుల్లో ప్రియురాండ్ల చేత చేయించుకుని సుఖపడేవాడు.

పిలుపు రావటం ఆలస్యం... ఎంత రాచకార్యములున్నా వదిలేసి ప్రియురాండ్ల ముంగురులను సవరించేవాడు.

ప్రియురాళ్ళ పాదాలకి పారాణి దిద్దుతూ... మధ్యలోనే ఆపి ఆగలేక సుఖించేవాడు.

నృత్యాలతో అలిసిన వారి ముఖం మీద చిరుచెమటలను తానే తుడిచి కామించేవాడు.



❀ ఇష్టసఖి కోసం వెళుతూ మార్గ మధ్యలోనే ఆగలేక ధూతికలతో సుఖించేవాడు.

❀ ఉదయాన్నే ఆయన పానుపును సరిదిద్దటానికి గంటల గంటల సమయం పట్టేది పరిచారికలకి.

❀ అందంలో పందేనికి రమ్మని పలిచేంత వయసు కాంతలతో సయ్యాటలాడేవాడు.

❀ కుటజ పుష్పాలు.. అర్జున పుష్పహారాలు.. కడియ పూల పరాగములన్న ఎంతో ప్రీతి. అన్ని ఋతువుల్లోనూ అదే పని.

❀ చివరకు భోగదాసుడయిన రాజుకి ఘోరమైన వ్యాధి వచ్చింది. అధిక స్త్రీలతో సంభోగం వల్ల ఆ రాజుకి సంతానం కూడా కలుగలేదు. అలా... రఘువంశ చివరి రాజు అగ్ని మహారాజు ఆ వంశ శకం ముగించాడు.

## తెల్లకలువలతో బ్రాహ్మీదేవిని పూజిస్తే....

తేజస్సు... జ్ఞాపకశక్తి... విద్య కలిగిస్తుంది. బ్రహ్మదేవునికే శక్తిని ప్రసాదించినది బ్రాహ్మీదేవి. రేవతి... ఆశ్లేష.. జ్యేష్ఠ నక్షత్ర జాతకులు ఈ దేవి పేరు మీద నక్షత్ర హెూమం చేయిస్తే గ్రహదోషాలు సమసిపోతాయి. అంత ఆర్థిక స్థితి లేని వారు... మూడు రోజులు ఈ ధ్యానం చేసినా ఫలితం కలుగుతుంది.

**తత్ర బ్రాహ్మీ చతుర్వక్త్రా షడ్భుజా హంస సంస్థితా**
**పింగాభా భూషణోపేతా మృగచర్మోత్తరీయకా ॥**
**వరం సూత్రం స్రువం ధత్తే దక్ష బాహుత్రయే క్రమాత్**
**వామే తు పుస్తకం కుండీం బిభ్రతీ చాభయం కరమ్ ॥**



## అవిశ పూలతో మహేశ్వరీ దేవిని పూజిస్తే

స్త్రీలకు సౌభాగ్యము.. కుటుంబానికి ఆయుష్షు.. భార్యాభర్తల మధ్య అన్యోన్య దాంపత్యము. మహేశ్వరునికి శక్తినిచ్చిన ఈ వృషభవాహినికి అశ్వనీ, మఖ... మూల నక్షత్రములు గలవారు నక్షత్రహోమం చేయిస్తే గ్రహ దోషాలు పోతాయి. అలా చేయించలేని వారు ఇరవై మూడు రోజులు.. ఈ ధ్యాన శ్లోకాన్ని ఉదయం, సాయంత్రం స్నానాదులు పూర్తి అయ్యాక పఠిస్తే ఫలితం కలుగుతుంది.

**మహేశ్వరీ వృషారుఢా పంచవ క్త్రా త్రిలోచనా**
**శేతవర్ణా దశభుజా చంద్రరేఖావిభూషణా॥**
**ఖడ్గం వజ్రం త్రిశూలం చ పరశుం చాభయం వరమ్**
**పాశం ఘంటాం తథా నాగ మంకుశం బిభ్రతీ కరైః॥**

## ఉమ్మెత్త పూలతో కౌమారీ దేవిని పూజిస్తే...

మీ ఎదుగుదలని చూసి ఏడ్చే వారి నరఘోష వారికే ఎదురు తగులుతుంది. గృహంలో తిష్ఠ వేసిన పీడ శక్తులు పారిపోతాయి. వివాహం ఆలస్యం అవుతున్న వారూ... ఎంతో కాలంగా సంతానం కలగనివారు సేవిస్తే సత్వర ఫలము కలుగుతుంది. ఇంకా భరణీ, పుబ్బ.. పూర్వాషాఢ నక్షత్ర జాతకులు నక్షత్ర హోమం చేయిస్తే గ్రహదోషాలు పోతాయి. అంత స్థితి లేనివారు ఇరవై మూడు రోజులు ఈ ధ్యాన శ్లోకాన్ని ఉదయం, సాయంత్రం పఠిస్తే తగు ఫలం కలుగుతుంది.



షడాననా తు కౌమారీ పాటలాభా సుశీలకా
రవిబాహు ర్మ యూరస్థా వరదా శక్తి ధారిణీ ॥
పతాకం బిభ్రతీ దండం పాత్రం బాణాం చ దక్షిణే
వామే చాప మథో ఘంటాం కమలం కుక్కుటం తథా॥
పరశుం బిభ్రతీ చైన తదధ స్త్వభయాన్వితా ॥

## చామంతి పూలతో వైష్ణవీదేవిని పూజిస్తే...

మహా ఐశ్వర్యం కోసం.... ఆకస్మిక ధనప్రాప్తి కోసం... భోగాల కోసం.... ఎంతవున్నా సుఖం లేకపోతుంటే సుఖాలు కలగటం కోసం ఈ దేవిని పూజిస్తే (పూర్వజన్మ పాపాలు పోతాయి) అన్నీ సిద్ధిస్తాయి. కృత్తిక, ఉత్తరాషాఢ, ఉత్తరా నక్షత్రం గలవారు వారి గ్రహదోషాలు పోవటానికి నక్షత్ర హోమం చేయిస్తే శుభాలు కలుగుతాయి. ఆర్థికస్థితి అంతగా లేని వారు శ్రీమహావిష్ణువుకి సుదర్శానాది చక్రాలనిచ్చిన ఈ వైష్ణవీదేవి స్తోత్రాన్ని రోజూ రెండు పూటలా పఠించండి.

వైష్ణవీ తార్క్ష్యగా శ్యామా షడ్భుజా వనమాలినీ
వరదా గదినీ దక్షే బిభ్రతీ చ కరే బుజమ్ ॥
శంఖచక్రాభయాన్ వామే సా చేయం విలసద్భుజా ॥

## నల్లకలువలతో వారాహీ మహాదేవిని పూజిస్తే....

శత్రువుల నాశనము. పూర్వశక్తి కలుగుతాయి. మునిమనవళ్ళని చూసే ఆయుష్షు సిద్ధిస్తుంది. రోహిణి, హస్త, శ్రవణ నక్షత్రముల వారి గ్రహ దోషాలు తొలుగుతాయి. నక్షత్ర, శాంతి హోమాలు చేయించవచ్చు. ఆర్థిక స్థితి లేని వారు ఈ క్రింది శ్లోకాన్ని ఇరవై మూడు రోజులూ రెండు పూటలా పఠించండి. తప్పక ఫలితం కలుగుతుంది.



**కృష్ణవర్ణా తు వారాహీ మహిషస్థా మహోదరీ**

**వరదా దండినీ ఖడ్గం బిభ్రతీ దక్షిణే కరే ॥**

**ఖేటపాత్రాభయాన్ వామే సూకరాస్యా లసద్భుజా ॥**

## ఎర్రమందారాలతో చాముండాదేవిని పూజిస్తే...

సకల సమస్యలకీ మూలకారణమైన భీతి పోతుంది. వ్యవసాయంలో మంచి దిగుబడి.. ఇంకా శత్రువులు తలవంచుతారు. అనుకున్న కార్యము విజయం అవుతుంది. స్వాతి, శతభిష నక్షత్రములు గలవారికి గ్రహదోషాలుంటే నక్షత్ర శాంతి హోమములు చేయించండి. అంత స్థితి లేనివారు ఈ క్రింద శ్లోకం ఇరవై మూడు రోజుల పాటు ఉదయం, సాయంత్రం పఠించిన మర్రిచెట్టు నివాసస్థానమైన చాముండాదేవి చక్కటి ఫలాన్ని అందిస్తుంది.

**చాముండా ప్రేతగా కృష్ణా వికృతా చాహిభూషణా**

**దంష్ట్రా లాక్షీణదేహా చ గర్తాక్షీ కామరూపిణీ ॥**

**దిగ్బాహుః క్షామకుక్షీ చ, ముసలం చక్రచామరే**

**అంకుశం బిభ్రతీ ఖడ్గం దక్షిణే చాథ వామకే ॥**

**ఖేటం పాశం ధను ర్దండం కుఠారం చాపి బిభ్రతీ ॥**

## పెళ్ళాన్ని కొడితే పుట్టగతులుండవు

- ఎన్ని చేసినా ఆఖరికి అహోరాత్రయాగం ఇరవై మూడు రోజులు చేసినా కష్టాలు తప్పవు.
- శనీశ్వరుడు ఒక్క సెకను కూడా ఆలోచించకుండా పట్టేస్తాడు.



⚘ వివాహంలో అప్పగింతల సమయంలో అబ్బాయికి అమ్మాయి తల్లి, తండ్రి భార్యనెలా చూసుకోవాలో చెప్పేవాళ్ళు (ఈ కలియుగంలో వదిలేశారు).

⚘ పురాణాలు.. ఇతిహాసాలు.. ఎందులో కూడా ఆఖరకు రావణుడు..... కీచకుడు లాంటి వాళ్ళు కూడా భార్యపై చేయి చేసుకోలేదు.

⚘ భార్యపై చెయ్యి చేసుకోవటం వల్లే తాటకిని ఒంటరిదాన్ని చేసి అగస్త్యుడి శాపానికి గురవ్వాల్సి వచ్చింది.

⚘ ధర్మం కోసమైనా సరే ఆడదాన్ని శిక్షించాలంటే స్త్రీ చేతనే చేయించాలి.

⚘ స్త్రీని మొహం మీద కొడితే అల్పాయుష్షు తథ్యం...

⚘ అస్త్ర సన్యాసానికి భీష్ముడు సిద్ధపడ్డాడుగానీ శిఖండి మీద బాణం వెయ్యలేదు. అందుకే ధర్మరాజు అంతటి ధర్మపరుడికి శ్రీవిష్ణు సహస్రనామాన్ని బోధించగలిగాడు.

⚘ గురువాజ్ఞ ధిక్కరించకూడదని తాటకిపై బాణం వేశాడు శ్రీరాముడు. దాని వల్ల కూడా పడరాని కష్టాలు పడ్డాడు.

⚘ భీమేశ్వర దేవాలయంలోని చిచ్చుర తోరణం నుంచి వెళితేనైనా పాపనివృత్తి పోతుందేమో కాని స్త్రీని కొట్టిన పాపం మాత్రము పోదు.

⚘ వ్యాపారంలో నష్టాలూ, స్నేహితుల వల్ల మోసాలూ... తరచూ అనారోగ్యం ఇత్యాదివన్నీ ఆ దోష ఫలితాలే.

⚘ స్త్రీ మీద చెయ్యి చేసుకోని పురుషుణ్ని వింధ్య పర్వతం కూడా వంగి పాదాలంటి నమస్కరిస్తుందని పురాణ వాఖ్య.



ధర్మ ప్రచారం చేస్తే తెలియక చేసిన ఆ దోషం పోతుంది. నిరంతరం సూర్యనమస్కారాలని చేయటం వల్ల శరీరంలో మలినాలు ఎలా పోతాయో... అలా నిరంతర ధర్మ ప్రచారం వల్ల ఏదోనాడు స్త్రీని కొట్టిన ఆ దోషం నుంచి విముక్తి కలుగుతుంది.

## ధైర్యమంటే....

తన శరీరంపై కాంక్షవున్నవాడినీ.. చేతిలో చిల్లుఖాణి లేని వాడ్ని... అలుసుగా మాట్లాడేవాడినీ... లొడా లొడా అందరితో వాగే వాడ్ని, నవ్వించే వాడ్ని... ముఖ్యంగా తనని ఇష్టపడేవాడ్ని.. కామించేవాడ్ని స్త్రీ ఇష్టపడదు. స్త్రీ తను ఇష్టపడాలి. అప్పుడే ఏదైనా చేస్తుంది. అసలు సిసలు ధైర్యమంటే ఏమిటో చూపిస్తుంది. అదీ ధైర్యమంటే. ఆ ధైర్యం చూస్తే ఎంతటి మగాళ్ళకయినా వణుకొస్తుంది.

## తామర పుష్పాలతో శైలపుత్రీ దేవిని పూజిస్తే....

ఇష్టకామ్యసిద్ధి... దంపతుల మధ్య అపోహలు తొలిగిపోతాయి. మహా యోగాన్నిచ్చే శైలపుత్రి ధ్యాన శ్లోకాన్ని రోజూ రెండు పూటల ఇరవై ఒక్క రోజులు జపించటం ద్వారా మహా శాంతి. పునర్వసు, విశాఖ, పూర్వాషాఢ జాతకులు దోష నివారణ కోసం నక్షత్ర, శాంతి హెూమాలను జరిపించండి. శక్తిలేనివారు కింద విధంగా జపించండి.

**వందే వాంఛితలాభాయ చంద్రార్ధకృతశేఖరామ్ ।**

**వృషారూఢాం శూలధరాం శైలపుత్రీం యశస్వినీమ్ ॥**



## వ్యాపారాభివృద్ధి కోసం

ఎర్రటి గుడ్డ తీసుకోండి. అందులో స్పటిక రాయి పెట్టండి. ఎంత బరువున్నదయినా ఒక్కటే.. ముక్కలు వద్ద. దానిపై పసుపు... కుంకుమ... అక్షింతలు... చామంతి పూలు వెయ్యండి. ఎవ్వరూ చూడకుండా నమస్కరించి ఇష్టదైవానికి సమస్కరించి ఉదయాన్నే ముందుగా దుకాణానికి వచ్చి గడప లేదా షట్టర్‌కి పైన సరిగ్గా మధ్యలో కట్టండి. అలా చెయ్యటం వల్ల దిష్ఠి దేవత లోనికి వచ్చే వారి చెడు తలంపును మరిపిస్తుంది. నివసించే గృహానికి కూడా ఈ విధంగా చెయ్యటం వల్ల చుట్టప్రక్కల వారి దిష్ఠి తగలకుండా ఉంటుంది.

**విశ్వావసుడి వీణ... బృహతి, తుంబురుడి వీణ.... కళావతి, నారదుని వీణ... మహతి, శారదాంబ వీణ...కచ్ఛపి... ఆ నలుగురూ ప్రీతికరంగా పురుషోత్తముని గూర్చి గానం చేస్తుంటారు.**

## అవమానం నుంచి విజయం దిశగా వెళ్ళాలి....

ఓసారి వైకుంఠంలో శ్రీమహావిష్ణువు కొలువుతీరి వున్నాడు. అత్రి, మరీచి, అగస్త్యుడు, అక్షపాదుడు.. వాయుదేవుడు, దుర్వాసుడు వంటి పుణ్య పురుషులు స్వామి దర్శనం గూర్చి వేచి చూస్తూ ఉన్నారు. మేఘం లోంచి వచ్చిన మెరుపుతీగ వలే శ్రీమహాలక్ష్మీదేవి వచ్చింది. ఆ తల్లికి పక్కగా దూతలు నడుస్తూ సభలోని వారిని తొలగండి.... తొలగండి.. అంటూ ఆమె వెళ్ళేందుకూ ఏ అడ్డంకీ లేకుండా దారి చేశారు. ఆ సమయంలో బ్రహ్మదేవుడు



కూడా పక్కకి తొలగాల్సి వచ్చింది. లక్ష్మీదేవి లోనికి వెళ్ళాక తుంబురుడ్ని మాత్రం లోపలికి అనుమతించారు. శ్రీలక్ష్మీసమేతుడైన నారాయణుడు తుంబురుని గానం విన్నారు. చక్కటి కానుకలనిచ్చారు. బైటికొచ్చిన తుంబురుడు నారదాది వారందరికీ ఆ కానుకులను చూపించాడు. తుంబురుణ్ని పిలవటమే కాక కానుకలివ్వటం... తగదునమ్మా అనుకుంటూ తుంబురుడు వాటిని తమకి చూపించటం చూసి నారదుని మనసులో అహం... మత్సరం పెరిగిపోయాయి. తానే సంగీతంలో గొప్ప అన్నట్టుగా ప్రవర్తించటంతో నారదుడు పట్టుదలతో మహా నిష్ఠగా మహామహుల వద్దకు వెళ్ళి సంగీతాన్ని మరింతగా అభ్యసించాడు. అయినా పరిపూర్ణుడవ్వలేదు. ఆపై శ్రీలక్ష్మీనారాయణుల అనుగ్రహం కోరాడు. ద్వాపరయుగంలో శ్రీకృష్ణునిగా జన్మిస్తాను అప్పుడే సంగీతం నేర్పుతానని చెప్పాడు. అప్పటి వరకూ సాధన చేసి ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడూ, రుక్మిణిల వద్ద సంగీతాన్ని నేర్చుకుని విజయం సాధించాడు. అవమానం.. ఈర్ష్యలు అనవసరం. ప్రయత్నిస్తేనే ఎవ్వరైనా ఏ స్థాయికైనా చేరగలరు.

## తాటిచెట్టు నీడపడకూడదు

ఎంత ఎండలోనైనా శాస్త్రం తెలిసిన వారు తాటిచెట్టు నీడన అనగా కింద నుంచోరు. దాని నీడపడినా చాలు దరిద్రం ఆవహిస్తుంది. కారణం కలిపురుషుడు ఆ వృక్షాన్ని ఆశ్రయించుకుని ఉంటాడు. వెనువెంటనే ఆవహించి పెట్టాల్సిన బాధలు పెట్టేస్తాడు. ఉన్న ధనాన్నంతా ఏదో రకంగా బైటికి పంపిస్తాడు.



## దంపతులు సంప్రదించుకుని వరం కోరుకోండి

మహాయాగం చేసినా, వ్రతం చేసినా భార్యాభర్తలిరువురూ సంప్రదించుకుని ఏ విషయముగానైనా ఒకే వరాన్ని కోరుకోవాలి. అలా కాకుండా సుగాత్రి జగదంబను పూజించి మహాశౌర్యవంతుడు పుత్రుడిగా పుట్టాలని కోరుకుంది. భర్త శాలీనుడు సరస్వతీదేవిని పూజించి సుగాత్రి అందం తరిగిపోకూడదని గర్భం రాకుండా వుండేలా వరం కోరుకున్నాడు. ఏకాంత సమయంలో గుస గుస లాడుకుంటున్న సమయంలో ఇరువురూ తమ వరాలని గూర్చి చెప్పుకున్నారు. తమ తమ వరాలకి ఇరువురూ భిన్నంగా కోరుకున్నందుకు కోపించుకుని గొడవపడ్డారు. చివరకు మడుగుల్లో దూకే వరకు గొడవ వెళ్ళిపోయింది. కాన....!?

## ప్రణయ రహస్యాలు పదిలం...

ఓ రోజు బ్రహ్మదేవుడూ, సరస్వతీ దేవి ఉద్యానవనంలో విహరిస్తున్నారు. కల్పవృక్షం నీడలో పాన్పుపై పవళించాడు బ్రహ్మ. సరస్వతిదేవి బ్రహ్మదేవుని పాదాలు వత్తుతోంది. ఆ సమయంలో బ్రహ్మదేవుడికి ప్రేమ అతిశయించింది. దగ్గరికి వెళ్ళాడు. వద్దు వద్దు అని చెబుతున్నా దగ్గరికి వెళ్ళాడు. కోపం... అలక.. బ్రతిమిలాడటం.. అన్నీ మామూలే. ఇదంతా వారి పెంపుడు చిలుక చూసింది. చిలుకే కదాని వదిలేసి వాళ్ళు సుఖాలలో విహరించారు. ఆ తర్వాత.. బ్రహ్మ దర్శనానికై ఇంద్రుడూ, రంభ వచ్చారు. చిలుకని ఏంటి సంగతలుని అడిగారు. అది ఆపుకోలేక సృష్టికర్త శృంగారమంతా ఒలకబోసింది. చిలుక చెప్పటం విన్న సరస్వతి



ఆగ్రహంతో 'ఎంతో నమ్మకంతో వదిలేస్తే మా ఆలుమగల మధ్యలో వుండే ప్రణయ రహస్యాలని చెబుతావా.... భూలోకంలో వేశ్యగా పుట్టమని' శపించింది. ఈలోగా బ్రహ్మదేవుడు వచ్చి చిలుకని ఓదార్చి 'ఈ గాథని విన్న వారికి పుత్రపౌత్రాభివృద్ధి కలుగుతుందని' వరం ఇచ్చాడు. ఇదంతా రాస్తుంది ప్రణయ రహస్యాలని పదుగురికీ చెబితే ఎంతటి దోషమో అని కాదు. మన పూర్వ సాహిత్యంలో... అనగా ఇది పింగళి వారి కళా పూర్ణోదయంలోని ఓ ఘట్టం. అంతటి అత్యున్నతమైన సాహిత్యాన్ని మీరెంతవరకు ఆసాద్వించుతున్నారూ అని. సకల రుచులూ చూసినా సాహిత్యపు రుచి చూడకపోతే అసంపూర్ణ రుచే.

## అత్యంత ప్రతిష్టాత్మకమైన కుటుంబంలోనికి కోడలిగా వెళ్ళాలంటే

తెల్లవారుజామున శ్రీఆంజనేయస్వామికి గుడిలో 108 ప్రదక్షిణలు నలభై ఒక్క రోజులు చేయాలి. ప్రతిరోజు ప్రదక్షిణలు పూర్తి అవ్వగానే శ్రీమహావిష్ణు ఆలయంలో తులసి తీర్థమును స్వీకరించండి. మధ్యలో మీ కార్యం సఫలమయినా మానద్దు. పూర్తి చేయండి. ఆ ఆంజనేయ స్వామే మీరే యింట కాలుమోపాలో నిర్ణయిస్తాడు. వివాహం కొరకు చేస్తున్నారు కాబట్టి మీరు చేసిన సకల పుణ్యాల ఫలంగా ఓ వైభవోపేతమైన ఇంట్లోకి కోడలిగా పంపిస్తాడు శ్రీరామదూత హనుమ. వీలయితే ఆదివారం నవగ్రహ మండపం చుట్టూ తొమ్మిది ప్రదక్షిణలు చేసి శనీశ్వరునికి తైలాభిషేకం.. మిగతా గ్రహదేవతలను పూలతో అలంకరించి పండ్లని పంచి పెట్టండి.



## ఎవరిని పూజిస్తే ఏ శక్తి వస్తుంది

వరుణదేవుణ్ని పూజించటం వల్ల వర్షాలూ, కుబేరుని పూజించటం ద్వారా అప్పు, యముడ్ని పూజించటం ద్వారా శిక్షించే శక్తీ, మహేంద్రుణ్ని పూజించటం ద్వారా పాలించే అనగా నాయకత్వ లక్షణాలు వస్తాయి.

## సీతాదేవే కాదు ఆ యుగంలో పురుషులు అపనిందలు పడ్డా అగ్నిప్రవేశం చేసేవారు

ఆ కాలంలో ఓ రాజుకి అందాల త్రిభువన రూపంతో మెరిసేపోయే ముద్దుగుమ్మ అయిన భార్య వుండేది. తప్పని సరి పరిస్థితుల్లో చాలా రోజులు వేరే దేశానికి ఆ రాజు వెళ్ళి వుండాల్సి వచ్చింది. అంత అందాల రాకుమారిని ఎక్కడుంచాలో అన్న మీ మాంస ఏర్పడించది అలా వెదకి వెదకి సత్యవాది, ధర్మాన్ని చెప్పేవాడూ.. ఆచరించే వాడూ అయిన వాని దగ్గర వుంచాడు. కొంతకాలం తర్వాత తిరిగి వచ్చిన భర్తకి సత్యవాది అగ్నిప్రవేశం సిద్ధం చేసుకోవటంతో ఆశ్చర్యపోయాడు. తండ్రి, సోదరుడు, మామ ఇళ్ళల్లో కాకుండా పర గృహాల్లో వున్నందుకు నీ భార్య వల్ల నాకు వినకూడనివి లోకులనోట వినాల్సి వచ్చింది. అందుకే లోకానికి నీ భార్య పాతివ్రత్యాన్నీ, నా ధర్మాచరణనీ నిరూపించుకోవటానికి అగ్ని ప్రవేశం చేస్తున్నానని చెప్పి అగ్నిలో దూకాడు. దేవతలు పూలవర్షం కురిపించారు. సత్యవాది మరింత కాంతివంతంగా బైటికొచ్చాడు. రాజు తన భార్యని భద్రంగా అక్కున చేర్చుకున్నాడు.



## 'మనుమరాళ్ళు' అని సంబోధించకూడదు

మనువరాండ్రని చూడటం భగవంతుడిచ్చిన మహా అదృష్టం. మనువరాంఢ్రు అని పిలవటం వల్ల వాళ్ళ ఆయుష్షు వృద్ధి అవుతుంది. నూతన శక్తి వస్తుంది. 'మనవరాళ్ళు' అని కూడా సంబోధించటం వల్ల దోషం కలుగుతుంది. కాన అలా సంబోధించవద్దు. సంబోధించిన వారికి కూడా సరిచేసి చెప్పండి.

## గరుడపురాణంలోని 'ఓఖండం' మాత్రమే గల

గరుడపురాణంలోని 'ఓ ఖండం' మాత్రమే గల (గరుడ పురాణం పేరుతోనే వుంటుంది) పుస్తకం మాత్రమే కాదు గృహంలో వుంచుకోకూడనిది. 'శ్రీరామాయణం' ... ఈ గ్రంథాన్ని పట్టాభిషేకంతో పూర్తయిన రామాయణాన్ని మాత్రమే గృహంలో ఉంచుకోవాలి. ఉత్తరకాండతో కలిపి వున్నది వుంచరాదు. విడివిడిగా వుండవచ్చు. శ్రీరామాయణాన్ని రచించిన వారు సహితం పట్టాభిషేకంతో పూర్తి చేస్తారు. ఉత్తరాకాండ వ్రాయరు. అలాగే శ్రీమహాభారతం వ్రాసేవాళ్ళు సహితం తొలుత విరాటపర్వం రాసి ఆపై ఆదిపర్వం నుంచి ప్రారంభిస్తారు.

## తపస్సు ఎలా చేస్తారు

నాలుగు భుజములతో శంఖ చక్ర గదా పద్మహస్తుడు, సుందరమైన వాడు, ముల్లోకాలను మోహింప చేసే ముఖవదనంతో పీతాంబరి ధారియైనవాడు, కౌస్తుభ మణి హార నవరత్న ఖచిత కిరీటి కుండల ధారుడు, శ్రీవత్స చిహ్నంతో వైజయంతీ వనమాలను ధరించినవాడు, సువర్ణ కంకణ భుజకీర్తులను ధరించిన వాడూ



అయిన శ్రీమన్నారాయణుడ్ని మనోఫలకంపై ముద్రించుకోవాలి. ఆ పరమాత్ముని పాదపద్మాలపై మనస్సుని నిలిపి... శ్రీదేవితో కూడిన వక్షస్థలం గల ఆ విశ్వరూపుణ్ని జపిస్తూ చేసేదే తపస్సు.

## మూడుసార్లు తరచి తరచి సోధించాలి

కొత్తగా ఏ కార్యము ప్రారంభిద్దామని నిర్ణయించుకున్నా అందులో లోటుపాట్లని మూడుసార్లు తరచి చూసి నిర్ధారించుకోవాలి. ఆ తర్వాతే చేయాలి. తొలుత కార్యపద్ధతి... ఆపై అందులోని లోటుపాట్లు.. ఆపై నలుగురిలో నిర్ధారణ. పూర్వము బ్రహ్మదేవుడు వేదాలను మూడుసార్లు తరచి తరచి విశ్లేషించి మనకు అందిచ్చాడు.

## ఏ కోరికలు కోసం ఎవ్వరిని పూజించాలి

- బ్రహ్మవర్చస్సు కోసం సృష్టికర్తను.
- ఇంద్రియశక్తి కోసం వజ్రాయుధధారి ఇంద్రుడను.
- భోజన కాముకులు అదితినీ...
- ధన కాముకులూ, సిరిని కోరుకునేవారు దుర్గను.
- తేజస్సు కోరువారు అగ్నినీ..
- వస్తువులనూ, వీరత్వాన్నీ కోరువారు రుద్రులను.
- ఆయుష్షు కోరువారు అశ్వనీదేవతలను.
- సౌందర్యకాముకులు గంధర్వులను...
- స్త్రీల సాంగత్యము కోరువారు ఊర్వశిని.
- కీర్తి కొరకు యజ్ఞమూర్తి శ్రీమహావిష్ణువును.
- దాంపత్య సుఖమునకు పార్వతీదేవిని.



- రక్షణ కోసం యక్షులను.
- శత్రు సర్వనాశనం కోరువారు నిర్రుతిని.
- మహా భోగాల కోసం చంద్రుడను.
- అయితే మోక్షం మాత్రం శ్రీమహావిష్ణువు ఒక్కరే ఇవ్వగలరు.

## ఆయుష్షు కోరువారు పూజాదులు చేయాలి

సకల ప్రాణికోటికీ అన్న ప్రదాత సూర్యభగవానుడు అస్తమిస్తూ, ఉదయిస్తూ దైవకార్యం కూడా నిత్యం చేస్తుంటాడు. ధర్మపుణ్య కార్యాలను చేయక, పుణ్యగాథలను వినక, పూజాదులు చేయక ఎవరు కాలం గడుపుతుంటారో అట్టివారిని ఉదయిస్తూ, అస్తమిస్తూ లాక్కొపోతుంటాడు సూర్యభగవానుడు. యమభటులకు సహాయకారియై మార్గం సుగమం చేస్తాడు.

## చతుర్దశ భువనాలు

శ్రీమహావిష్ణువులో నడుమక్రింద నుంచి ఏడు, నడుంపైనుంచి ఏడు చతుర్దశ భువనాలు ఉంటాయి. భూలోకం కటి ప్రదేశం.. భువర్లోకం నాభి.. సువర్ణ లోకం హృదయం.. మహర్లోకము వక్షస్థలం... జనలోకం కంఠం.. తపోలోకం స్తనద్వయం.. బ్రహ్మ నివాసం సత్యలోకం శిరస్సు... జఘన ప్రదేశం అతలం.. తొడలు వితలం.. మోకాళ్ళు సుతలం.. పిక్కలు తలాతలం... చీలమండలు మహాతలం... మునివేళ్ళు రసాతలం.. అరికాళ్ళు పాతాళం.



## నాభి కనిపించరాదు సుమా...

ఒక శరీరాన్ని వదలి మరొక శరీరాన్ని ధరించవల్సి వచ్చినప్పుడు మొదట శరీరం వదలటానికి జీవుడు ఎన్నుకునే ద్వారమే బొడ్డు. ప్రాణం, అపానం బంధించబడే స్థానమది. అది విడిపోవటమే మృత్యువు. పై శరీరాన్ని, క్రింద శరీరాన్ని వేరే చేసేది బొడ్డే. కాన అది పరులెవ్వరూ గాంచరాదు. అందం పేరుతో కిందకి కట్టుకోవటమంటే మీ ప్రాణమున్న భరిణను విప్పదీయటానికి ప్రయత్నించినట్టే. శృంగారంలో సహితం నాభి వద్ద మృదువుగా మీటాలే తప్ప మరోలా బలం చూపించరాదు.

## సంతాన గుణాలే స్వర్గ, నరకాల ప్రవేశం

పూజాదులూ, గతజన్మ కర్మానుసారం సంతానాన్ని అనుగ్రహిస్తాడు పరమాత్ముడు. తల్లి, తండ్రి కర్మగుణాల వల్ల దుష్టుడిగానూ, మంచివానిగానూ జీవిస్తాడు. సత్ ప్రవర్తనాదులతో ప్రవర్తించటం వల్ల పుత్ర వ్యామోహం పెరిగి ఇంకా ఇంకా ధనార్జనతో ధర్మ, పుణ్యాలను మరిచి ఇంకా ఇంకా కర్మను ప్రోగు చేసుకుంటాడు. దుర్గుణాలతో జీవిస్తున్న సంతానాన్ని చూసి, వ్యధ చెంది ఎన్నో రకాలుగా బాగు చేద్దామని విశ్వప్రయత్నం చేసి చేసి ప్రయోజనం లేక గృహ సంసారాదులపై విరక్తితో దైవమార్గం పడతాడు. తద్వారా పుణ్య మార్గాన ప్రయాణిస్తాడు. మళ్ళీ మళ్ళీ కర్మ, మోహం వీడక వారి బిడ్డలకీ, వారి వారి బిడ్డలకీ సంతానరూపుడై జన్మించి తగు కసిని తీర్చుకుంటాడు.



## ఒకప్పుడు.... ఇప్పుడు

- దానం, ధనం ఇస్తామంటే తీసుకునే వారు లేరు.
- గృహస్థ ధర్మాలకూ, పూజాదియజ్ఞ కార్యాలకే ప్రాధాన్యత.
- కొండచిలువలా లభించిన ధనాన్ని (ఆహారాన్ని) గ్రహించి జీవనం గడిపేవారు.
- రాజ్యాల కోసం, ఆడవాళ్ళ కోసం కొట్టుకు చచ్చేవారు.
- కీర్తి కోసం తాపత్రయపడేవారు.
- ఆపై మన కలియుగంలో....

మతాల కోసం... దేవుడు కోసం కొన్నాళ్ళు.. ఆపై ఆధిపత్య పోరు... తర్వాత లక్షాధికారిననిపించుకునేందుకు తాపత్రయం. ఆపై కోటీశ్వరుడు. అంత వరకు బాగానే వుంది.

ఇప్పుడు... డబ్బు... డబ్బు... డబ్బు....అంతే.

పది కోట్లు... ఇరవై కోట్లు.. అస్సలు ఇప్పుడా పదీ ఇరవై డబ్బు కాదు... వందల కోట్ల నుంచి వేలకోట్ల వద్దకెళ్ళి, లక్షల కోట్ల వరకు వెళ్ళింది. ఇన్ని కోట్లని అసలేం చేసుకుంటారు. ఇప్పుడు ఎక్కువమందికి పట్టిన పిచ్చి డబ్బు పిచ్చి. లక్షల కోట్లు.. అస్సలు వారికి డబ్బు ఖర్చుపెట్టడం కూడా రాదు. అంతా దాచాలనే అనుకుంటారు. ఎందరో మహానుభావులు చెప్పినట్టు 'డబ్బు కావాలి... కానీ కొంతవరకే. ఆ తర్వాత ఎక్కువయిన డబ్బు కుటుంబాన్నీ, ఆరోగ్యాన్నీ, ఆనందాలనీ, సుఖాలనీ' దూరం చేస్తుంది. తేనెటీగలు కూడబెట్టిన తేనె ఇతరులు భుజించినట్టు అట్టి వారి ధనం వారికీ, వారి వారికీ కూడా ఉపయోగపడదు.



## పరీక్షిన్మహారాజుతో శ్రీశుక యోగీంద్రుడు చెప్పిన నరకములు

### - శ్రీభాగవతము నుంచి

**తామిస్రము :** పక్కవారి ధనాన్ని దొంగలించేవారినీ, స్త్రీనీ కాక్షించే వారినీ, నీచతత్వములతో ప్రవర్తించే వారినీ ఆ లోకంలో పాశాలతో బంధించి, అన్నం నీళ్ళు ఇవ్వకుండా కటిక చీకటిలో పడేసి పెద్ద లావాటి కర్రలతో చితక కొడతారు.

**అంధతామిస్రము :** మంచి మాటలతో, చేతలతో, బలంతో, తెలివితో పరస్త్రీ భార్యని నమ్మించి ఆమెతో అక్రమ సంబంధం పెట్టుకున్నవారి ఒక్కొక్క అంగాన్ని కోసి అందు నుంచి కారే రక్తధారలను చూసి వికటాట్టహాసం చేస్తూ హింసించబడతారు.

**రౌరవము :** తన శారీరిక సుఖాల కోసం, తన వారి భోగాల కోసం సాటి ప్రాణుల్ని హింసిస్తూ, వంచన చేసిన వార్ని రురువు అనేబడే వాడియైన కొమ్ముల క్రూర మృగంతో నిత్యం ఆపకుండా పొడిపిస్తుంటారు.

**మహారౌరవము :** తన ఆకలి తీర్చుకోవటం కోసం జంతువుల ప్రాణాల్ని తీసి కడుపు నింపుకున్న వారిని హింసకు గురిచేస్తూ రురువు చేత పొడిపిస్తూ ఆ పాపుల మాంసాన్ని పీక్కుని తింటారు.

**కుంభీపాకము :** పక్షులనీ, జంతువులనీ బ్రతికుండగానే కాల్చి తినే వారిని ఆ లోకంలో పెద్ద పెద్ద కుండల్లో నూనె పోసి కింద భగభగమంటలను పెట్టి కాగిన ఆ నూనెలో ఆ పాపుల్ని పడవేసి వేపుతారు.



**కాలసూత్రము :** ఈ లోకం మూకుడులా వుంటుంది. తల్లీ, తండ్రినీ నిర్లక్ష్యం చేసి, ద్రోహానికి ఒడిగట్టిన వారిని ఆ మూకుడులో పడేస్తారు. ఆ మూకుడు కింద మహా మంటలు మండుతుంటాయి. అలాంటి పాపుల్ని ఆ మూకుడులో దొర్లించి... దొర్లించి చిత్రహింసలు చేస్తారు.

**అసిపత్ర వనము :** ధర్మపుణ్యపరమైన వేదమార్గంలో నడవక నాస్తికునిగా మాట్లాడేవారినీ, తిరిగే వారిని కత్తుల వంటి ఆకులు గల అరణ్యంలో పరిగెట్టమని కొరడాలతో కొడుతూ తరుముతారు. శరీరమంతా రక్తం కారుతున్నా, స్పృహ తప్పినా లేపి మరీ పరుగుతీసేలా కొరడాలతో కొడతారు.

**సూకరముఖము :** అధికారం చేతిలో వుందికదాని అమాయకులనీ, తప్పు చేయని వార్నీ శిక్షిస్తే సూదిమూతి గల పందులతో చెరుకుని విరగదీసినట్టు ఇరగదీసి, వాటితో నమిలిస్తారు.

**అంధకూపము :** తమకి అపకారం చేయకపోయినా కీటకాలని చంపేవారిని నూతిలాంటి అంధ కూపములో పడేస్తారు. చంపిన కీటకాలు వాడ్ని నెమ్మదిగా చాలా నెమ్మదిగా భక్షిస్తుంటాయి.

**క్రిమిభోజనము :** అతిథులకు, అభాగ్యులకు పెట్టక ఇంకా.. పాడయిన ఆహారాన్ని పెట్టినవారికి ఆ లోకంలో ఆకలితో అలమటించేలా చేసి ఆహారం దొరకక క్రిములని తినే దుస్థితిని కలిగిస్తారు.

**సందంశము :** ధర్మపరుల ధనాన్ని అధర్మంగా ఏదో రకంగా పొందినవార్ని బాగా కాల్చబడిన ఇనుప ఊచలతో హింసిస్తారు.



**తప్తసూర్మి** : ఏడు అడుగులు తనతో అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్యతో తప్ప అన్యులతో సంగమిస్తే... అలాగే తనతో ధర్మార్థకామమోక్షాలకి పదుగురి యెదుట ప్రమాణం చేసి చేయిపట్టుకున్న భర్తని కాక మరొక మగవానితో కులికితే ఎర్రగా నిగ నిగ భగ భగమండే స్త్రీ విగ్రహాన్ని పురుషుడూ, పురుషుడి విగ్రహాన్ని స్త్రీ గంటలు గంటలు కౌగిలించుకునేలా బిగించి కడతారు.

**వజ్రకంటక శాల్మలి** : ధనం మీద ఆశతో తనని నమ్మినవారిని, తన చుట్టూ ఉన్న వారినీ మోసం చేసి వారి ఎంగిలి కూటికోసం నీచాలు చేసినవార్ని వజ్రాల వంటి మొనలు గల వృక్షాలని ఎక్కించి, దింపించి మళ్ళీ ఎక్కించి... మళ్ళీ దింపించి... అనేక బాధలకి గురిచేస్తారు.

**వైతరిణి** : చీము...నెత్తురు.. మలము కలిసి ప్రవహించే ఈ నదిలోకి అధికారంలో వుండి ధర్మ రక్షణ చెయ్యకుండా చేసిన వారిని పడేస్తారు.

**ప్రమోదము** : ధర్మపుణ్యకార్యాలు మాని వంశాచారం లేని వాటిని అనగా తినకూడనివి తింటూ, చెయ్యకూడని పనులు చేస్తూ, ఇంకా తప్పుడు మార్గాల్లో బ్రతికే స్త్రీలతో కలిసి మెలిసి సంగమం చేసే వారిని కూడా వైతరణి నదిలోనే పడేస్తారు.

**ప్రాణ నిరోధము** : తమకి హాని చెయ్యని జీవులను, తమ సంతోషాలకీ, దర్పాలకొరుకు వేటాడే వారిని బాణాలతో గుచ్చి గుచ్చి హింసిస్తారు.



**విశసనము :** తమ పేరు ప్రతిష్ఠల కోసం.. పక్కవారిని మోసం చేసి వంచించేందుకు ధర్మయజ్ఞాదులు చేయడం, మృగాలని తమ కోరికలకి బలి ఇవ్వటం చేస్తే మహా ఘోరాతిఘోరంగా హింసలు పడాల్సి వస్తుంది.

**లాలాభక్షము :** స్త్రీ సంగమంలో తన వీర్యాన్ని భాగస్వామిచే తాగిస్తే అలాంటిదే ఆ లోకంలో నిత్యం తాగాల్సి వస్తుంది.

**సారమేయాదనము :** సాటి జీవి ప్రాణం తీసిన వార్ని వందలాది కుక్కలచే పదే పదే కరిపిస్తారు.

**అవీచి :** స్వార్థంతోనూ, ధనం కోసమూ, ప్రాపకం కోసమూ అబద్ధపు సాక్ష్యాలు చెబితే మహా ఎత్తైన పర్వతాలూ, కొండల మీద నుంచి పదే పదే పడేస్తారు.

**అయఃపానము :** ధర్మ పుణ్య యజ్ఞ యాగాదులపుడు మద్యపానం చేసిన వారిని కాగుతున్న ఇనుప ద్రవంని తాగిస్తారు.

**క్షారకర్దమము :** అర్హత లేకున్నా చెడు మార్గాల ద్వారా అర్హతలను ఆపాదించుకుని, అర్హతలున్నవారిని రానీయకుండా చేసినందుకు కారపు కూపంలో కుక్కుతారు.

**రక్షోగణ భోజనము :** క్షుద్రదేవతల వరాల కోసం జీవులని బలి ఇచ్చినవారిని మహా క్రూరరాక్షసులు రకరకాల హింసలకు గురిచేస్తారు.

**శూలప్రోతము :** సాధుజీవులని మాటువేసి మరీ బంధించి కాల్చి తిన్న వారిని కాకులూ, గ్రద్దలతో పొడిపిస్తారు.

**దండశూకము :** ఏదన్నా చెల్లు బాటవుతుందని అనరాని మాటలతో బాధలు పెట్టేవార్ని మహా విషపాములతో కరిపిస్తారు.



**అవట విరోధము :** శరీర లోపం గలవారిని హింసించి, గేలిచేసి ఆనందించే వారిని విషఅగ్నిజ్వాలల్లో వేపుతారు.

**అపర్యావర్తనము :** ఇంటికొచ్చిన అతిథులని అవమానం చేసి పంపేవారి కళ్ళని ఆ లోకంలోని గద్దలతో పొడిపిస్తారు.

సూచీముఖం : ఇంటికొచ్చిన వారిపై... పక్కనున్నవారిపై దొంగతనం మోపితే శరీరాన్ని కోసి సూదిదారంతో కుట్టి, మళ్ళీ ఊడదీసి మళ్ళీ కుడతారు.

పైన శిక్షలన్నీ పైన నరకంలో కదా అప్పుడు చూసుకుందామనుకుంటే ఈ కలియుగంలో కుదరదు. కావాలంటే అలాంటి నీచపు పనులను చేసిన వారు ప్రస్తుతం ఎలా వున్నారో గుర్తుకు తెచ్చుకోండి. ఇది కలియుగం. ఇక్కడే వంద శాతం అనుభవించాలి. నెలలు తేడా అంతే. అనుభవించటం మాత్రం తప్పదు. ఇక్కడే....

## శ్రీభాగవత ధర్మాలు

సజ్జన సాంగత్యము.. సద్గురు సేవా.. శ్రీహరి కథా శ్రవణము.. వాసుదేవ వైభవ మననమూ, శ్రీమన్నారాయణుని సంకీర్తనమూ, మహా దివ్యపురుష ఆరాధనమూ, విష్ణుపాద ధ్యానము... విరాట స్వరూప దర్శనము.. సమస్త కర్మల కర్మఫల అర్పణమే శ్రీభాగవత ధర్మాలు. - శ్రీభాగవతము

## సకల భోగాలను ఇచ్చే ప్రహ్లాద నరసింహ స్తుతి

'ఓం నమోభగవతే తుభ్యం పురుషాయ మహాత్మనే
హరయే ద్భుత సింహాయ బ్రహ్మణే, పరమాత్మనే'



## జయ విజయుల మూడు జన్మలు

హిరణ్యాకశిపు హిరణ్యాక్షులు.. రావణ కుంభకర్ణాదులు.. చివరి జన్మలు.. శిశుపాల దంతవక్త్రులు...

## దైవ సంబంధించిన కార్యంలో మోహం, కామం తగదు

ఎంతటి సౌందర్యవతి ఎదురున్నా, పలకరించినా, ధర్మపుణ్య, యజ్ఞ కార్యాల్లో మనసు చలించరాదు. అందుకే భగవత్ కార్యాల్లో శ్రీవిష్ణుపాదాలపైన మనస్సును కేంద్రీకరించాలి. పూర్వము అలాగే అజగరుడను మహా ముని తన పూర్వజన్మలో ఉపబర్హణుడనే గంధర్వుడు. ధర్మ దైవ కార్యంలో వుండగా అక్కడికొచ్చిన అప్సరసలను చూసి చలించాడు. సంభాషించి, సంభోగానికి సహితం వెళ్ళిపోయాడు. దాంతో మహా దురవస్థలుగల బాధలనీ, వ్యధలనీ ఎంతోకాలం పడ్డాడు.

## గోపికా వస్త్రాపహరణము ఎందుకు

గోపకన్యలు మహా మహితాత్ముడైన భర్త కావాలని కాత్యాయనీ వ్రతం చేయసాగారు. మార్గశిరమాసంలో తెల్లవారుజామున లేచి నదిలో స్నానం చేసి ఇసుకతో దేవిని తయారు చేసి పూజించసాగారు. ఓ రోజు భామలంతా నదిలో స్నానం చెయ్యటానికి వొడ్డున వస్త్రాలను వదలి నగ్నంగా జలక్రీడలాడుకోసాగారు. అప్పుడు శ్రీకృష్ణుడు వలువలన్నింటినీ గ్రహించి కడిమచెట్టు ఎక్కాడు. ఒడ్డున వస్త్రాలు కనపడక ఘొల్లుమన్నారు. తమ మానాలని రక్షించమని, చూడటం తగదన్నారు. మా మనసులను దోచుకున్నావు... సిగ్గుని



కూడా అని అర్థించారు. అప్పుడు బ్రహ్మచారి (పదహారువేల భార్యలు, ఇష్ట భార్యలు ఎనిమిది మంది వున్న శ్రీకృష్ణుడు బ్రహ్మచారే.. మృతశిశువు అస్ఖలిత బ్రహ్మచారి చేతిలో పడితే బ్రతుకుతాడని చెప్పటంతో సుభద్ర భీష్ముడ్ని అడిగితే నేను కాదు అందులకు తగిన వాడు శ్రీకృష్ణుడే అని చెప్పాడు. అప్పుడు పరీక్షిత్తు మహారాజును శ్రీకృష్ణుడి చేతిలో పెడితే బ్రతికాడు) పరంధాముడు శ్రీకృష్ణుడు ఇలా చెప్పాడు.

'వ్రత నియమంలో వున్న మీరు దిగంబరంగా నదిలో స్నానం చెయ్యవచ్చా.... ఏ వ్రతంలోనున్నా, ఏ దైవస్మరణలో వున్నా ఎప్పుడూ నదిలో నగ్నంగా స్నానం చేయరాదు. అలా చేస్తే వ్రతఫలం రాదు సరికదా దోషం... అందుకే మీ వలువలని దొంగిలించాను' అని అన్నాడు. కాన నదిలో పూర్తిగా నగ్నంగా స్నానమాచరించటం వరుణదేవతకి చేసే మహా దోషం. కృష్ణుడు గోపికల దుస్తులని దాచింది ఆ ధర్మ నియమం చెప్పటానికే.

## షోడశీదేవిని పూజిస్తే

షోడశీదేవిని గులాబి, తామర పూలతో పూజించటం ద్వారా భోగభాగ్యాలతో పాటు పిల్లలకు వాక్ సిద్ధి. ఈ దేవిని ధ్యానమంత్రంతో పూజిస్తే తత్ఫలితం కలుగుతుంది. శక్తి వున్నవాళ్ళు నక్షత్రహోమం చేయించుకోవచ్చు.

జపాకుసుమసం కాశా వుల్లపద్మా సనస్థితా
అక్షస్రక్పుస్తకాభీతివరహస్తాతు బాలికా॥



## పక్కనున్న వారి కోసం చిన్నమస్తాదేవిలా ఏదైనా చెయ్యగలగాలి

నీ పక్కనున్న వాళ్ళే నీ బలం.. వార్ని జాగ్రత్తగా చూసుకుంటే ఎదురుండదు. చిన్నమస్తాదేవి అడవిలో వెళుతుంటే చెలులకు దాహం వేసింది. ఎక్కడా దాహం తీరే దారి దొరకకపోవటంతో తన తల నరుకుకుని ధారలుగా వస్తున్న రక్తంతో దాహం తీర్చుకోమని చెప్పింది. చిన్నమస్తాదేవిలా శరీరం త్యాగం చెయ్యమని కాదు ఆ పోలిక చెప్పింది. మీ పక్కనున్న వారి బాధలూ, కష్టాలూ మంచి, చెడును గమనిస్తే వాళ్ళు మిమ్మల్ని ఎంతో ఎత్తుకు తీసుకు వెళ్తారు. నలుగురి చేయూత మనం పుట్టిన ప్రతిక్షణం నుంచి చివర వరకూ అవసరమే.

## అసుర సమయాలు చూసుకుని పుణ్యస్నానాలు చేయాలి

సమయాసమయములు చూసుకోకుండా దైవస్నానం చేస్తే మహాచిక్కులు ఎదురవుతాయి. పూర్వము నందరాజు అలాగే ఏకాదశీ పుణ్య రోజున ఉపవాసం వుండి, విష్ణుపూజ చేసి అసుర సమయం అని చూసుకోకుండా ద్వాదశీ స్నానం చెయ్యటానికి యమునా నదిలో దిగాడు. మహాకష్టానికి లోనయ్యాడు. శ్రీకృష్ణుడు వచ్చి విడిపిస్తే గాని నందరాజు ఊరట చెందలేదు. రథసప్తమి నాడు జిల్లేడు ఆకుల్లో రేగిపండ్లు పెట్టి వాటిని నెత్తిన పెట్టుకుని స్నానం చేసి చిక్కుడు ఆకుల్లో పొంగలి పెట్టి భాస్కరునికి నివేదిస్తే వచ్చే పుణ్యం కూడా ఆ దోషాన్ని పోగొట్టలేదు.



## ఉన్నత పదవుల కోసం

మారేడు దళాలు, తెల్లజిల్లేడులతో భువనేశ్వరీ దేవికి పూజ చేయటం, ధ్యాన శ్లోకాన్ని పూజానంతరం పఠించటం వల్ల ఉన్నత పదవులు సిద్ధిస్తాయి. సుఖాలు, భోగాలకి కొదవ వుండదు. శక్తి వున్నవారు శాంతిహోమం చేయించుకోగలరు.

ఉద్యదినద్యుతిమిన్దు - కిరీటం తుఙ్గకుచాం
నయనత్రయముక్తామ్।
స్మేరముఖీం వరదాంకుశ పాశాభీతికరాం ప్రభజే భువనేశీమ్॥

## సృష్టి దశలు

శ్రీలక్ష్మీనాథుడి నుంచి ఆకాశం పుట్టింది. ఆకాశం నుంచి వాయువు, వాయువు నుంచి అగ్ని.. ఆ అగ్ని నుంచి నీరు... ఆ నీటి నుంచి భూమి, ఆ భూమి నుంచి అరవైనాలుగు కోట్ల ప్రాణులు పుట్టాయి. అంతటికీ మూలమైన వాడు శ్రీనారాయణుడే. అట్టి ఆది మధ్యాంతరహితుడ్ని స్మరించినంతనే ధైర్యమూ, శక్తి, జ్ఞానమూ కలుగుతాయి. నారాయణా... నారాయణా.. అని పలుమార్లు తలుచుకోవటమే సకల సుఖాలకి ప్రారంభము.

## వెన్ను చూపకుండా ఎందుకు నడవాలి

బ్రహ్మదేవుడు సకల సృష్టిని చేస్తూ మనుజుడ్ని కూడా సృష్టించి భోగాలూ, సుఖాల కోసం వెంపర్లాడే తత్వమూ, దుఃఖంలో కూడా సుఖాలను వెదికే తత్వమూ పెట్టి, దాన్నించి బైటపడటానికి జ్ఞానాన్ని కూడా ఇచ్చాడు. అలాగే బ్రహ్మదేవుని వక్షస్థలం నుంచి ధర్మమూ,



వెన్ను నుండి అధర్మమూ, మృత్యువూ జన్మించాయి. అందుకే శాస్త్ర ధర్మాలు తెలిసిన వారు భగవంతుని దర్శనానంతరం వెన్ను చూపకుండా వెనగ్గా నడుచుకుంటూ వెళ్తారు. మనకంటే గొప్పవారి దగ్గరికి వెళ్ళినప్పుడు శెలవు తీసుకుంటూ కనీసం అయిదడుగులన్నా వెనక్కి నడిచి వెనుతిరగాలి.

## అష్టలక్ష్మి సిద్ధి కోసం

ఎర్రతామరలతో 'కమలాత్మికా దేవి'ని పూజించటం ద్వారా మహాసుఖమయ జీవితంతో పాటు సిరిసింపదలు లభిస్తాయి. పూజానంతరుం ధ్యానశ్లోకం పఠించటం, పళ్ళు పంచటం వంటి దానకార్యాలు చెయ్యడం వల్ల త్వరితగతిన సిద్ధి కలుగుతుంది.

**కాంత్యా కాంచన సన్నిభాం హిమగిరి ప్రఖ్యైశ్చతుర్భిర్గజైః**

**హస్తోత్క్షిప్త హిరణ్యయామృతఘటైః ఆసిచ్యమానాం శ్రియం ॥**

**బిభ్రాణాం పరమబ్జయుగ్మమభయం హస్తైః కిరీటోజ్వలమ్**

**క్షౌమాబద్ధ నితంబబింబ వనితాం వందే రవిందస్థితామ్ ॥**

**తెల్లవారుజామున బ్రహ్మముహూర్తంలో తలారాస్నానం చేసి పూజ చేసి 'గాయత్రీ మంత్రాన్ని' పఠిస్తే గృహంలోని వారి సమస్యలు తీరిపోతాయి. భర్త తన కార్యాల్లో విజయం సాధిస్తాడు.**

## స్త్రీలకు ప్రవేశం లేని ఆలయాలు

తిరునల్లాయిలోని శ్రీవిష్ణుమూర్తి ఆలయ గర్భగుడిలోకి, ఒరిస్సాలోని విమలాదేవి ఆలయంలోకి, బంగాళాఖాత తీరంలోని శక్తి క్షేత్రంలో, సింగణాపూర్ శనీశ్వరుని ఆలయంలోకి, శబరిగిరి అయ్యప్పస్వామి ఆలయంలోకి స్త్రీలను అనుమతించరు. అలాంటి



ఆ మహాక్షేత్రాల గోపురం చూసినంతనే, తలంచినంతనే, ఆలయ ప్రాంగణంలో కూర్చున్న చోటునుంచే స్మరించిన దర్శించిన ఫలం కలుగుతుంది స్త్రీలకు.

## తలనీలాలు ఇవ్వద్దని శాస్త్ర వచనము

పురుషులు ఏ వయసు వారైనా స్వామికి భక్తిగా తల నీలాలను సమర్పించవచ్చు. అదే స్త్రీలకు అనగా యుక్త వయస్సు వారైన తర్వాత పూర్తిగా తలనీలాలను సమర్పించటం, ఇవ్వటం... మొక్కుకోవటం వంటివి శాస్త్ర విరుద్ధమని శాస్త్రం చెబుతోంది. స్త్రీలు మూడు కత్తెరలు మాత్రమే ఇవ్వాలి.

**కదంబ వృక్షం నాటితే వచ్చే ఫలం పూజించినంతనే కలుగుతుంది. శరీరంలో నిద్రాణమైన సిద్ధులు చైతన్యవంతమవుతాయి. గొడవలు సద్దుమణుగుతాయి. అలాంటి వృక్షం నాటి, పెంచితే శైలపుత్రితో కుబేరుడు శివునితో వున్నట్టు స్నేహంగా వున్నట్టే.**

## ఉన్నత విద్యాభ్యాసం కోసం
## మాతంగీదేవి పూజ

నాగలింగం, తెల్లగులాబీలతో దేవిని పూజించటం, సంబంధించిన ధ్యాన శ్లోకాన్ని రోజూ ఉదయాన్నే పఠించటం ద్వారా ఉన్నతమైన విద్యాజ్ఞానం, వాక్సిద్ధి, బుద్ధిబలం పెరుగుతాయి.

**స్మరే త్ప్రథమపుష్పిణీం రుధిరబిందుశోణాంబరాం**
**గృహీతమధుపాత్రికాం మదవిఘూర్ణనేత్రాంచలామ్।**
**కరస్ఫురితవరల్లకీం విమలశంఖతాటంకి నీం**
**ఘనస్తనభరాలసాం గలితచూలికాం శ్యామలామ్॥**



## అప్పు రేపు.... చూద్దాం....

ఎలాంటి వారికైనా కొన్ని సందర్భాల్లో మొహమాటం, నిర్ణయాన్ని స్పష్టంగా చెప్పలేకపోవటం వంటి వాటి వల్ల చాలా నష్టం వస్తుంది. అలాంటప్పుడే లౌక్యం వినాయకుడిలా ఉపయోగించాలి. శనీశ్వరుడు దేవతల వద్దకెళ్ళి మిమ్మల్ని పడతానని చెప్పి వాళ్ళని పీడించసాగాడు. ఒకనాడు నారదుడు వద్దకెళ్ళి ఇదే సంగతి చెబితే ముందు వినాయకుడు ఆ తర్వాత నా వంతు అని తప్పించుకున్నాడు. తను తప్పించుకున్నందుకు ఆనందంగా 'నారాయణా.. నారాయణా..' అని అనుకుంటూ వెళ్ళిపోయాడు. శనీశ్వరుడు వినాయకుని వద్దకెళ్ళి తన విషయం ఏంటని అడిగాడు. వినాయకుడు అంతా విని 'రేపు పట్టు' అని చెప్పాడు. శనీశ్వరుడు సరేనని మరుసటి రోజు వచ్చి సిద్ధమా అని వినాయకుడ్ని అడిగాడు. నేను రేపు కదా పట్టమన్నది.. కాన 'రేపు రా అ'ని వినాయకుడు సన్నగా నవ్వాడు.

వినాయకుడి సంగతి వదిలేస్తే.. కొన్ని సందర్భాల్లో చూద్దాం.. చేద్దాం.. ఆలోచిద్దాం.. వంటివి చాలా లాభాలనిస్తాయి. 'అప్పు రేపు' అన్న వ్యాక్యాలు చూసి దుకాణాదారుడ్ని అప్పు అడగటానికి వందకి తొంభై మంది సాహసించరు. అందుకే అలాంటివి పెడతారు. 'అప్పు రేపు' అన్న అక్షరాల కింద వినాయకుడి బొమ్మను కూడా ఉంచాలి... అప్పుడే ఏ దోషమూ అంటదు.

## కీర్తి ప్రతిష్టల కోసం... బాధా నివారణ కోసం...

నలభై ఒక్క రోజులు పఠించవల్సిన చిన్నమోస్తా... త్రిపుర భైరవీ దేవుల శ్లోకం....



ఉద్యద్భాను సమప్రకాంతి మరుణాక్షేమాం శిరోమాలికాం।
రక్తాలిప్త పయోధరాం జపపరాం విద్యామభీతిం వరమ్।
హస్తా బ్జైర్దధతీం త్రినేత్ర విలసద్రక్తార వింద శ్రియామ్।
దేవీం బద్ధ హిమాంసురత్న మకుటాం వందే సుమంద స్మితామ్॥

**అదృష్టం వగలాడి వంటిది. కావాలని ఆశిస్తే ఆమె పారిపోతుంది. మోజు చూపకపోతే ఎదురొచ్చి మరీ వేడుకుంటుంది. కాదన్నా వెంటపడుతుంది.**

## నవగ్రహ శాంతి ధూపం

'దశాంగ ధూపం' వేస్తే నవగ్రహ శాంతి జరిగి కార్యాలన్నీ నిరాటంకంగా జరుగుతాయి. (గంధకం.. సర్జరసం.. గుగ్గిలం.. చందనం.. జటామాంసి, నఖం చిప్పలు..కురువేరు, పచ్చకర్పూరం, కస్తూరి, వట్టివేళ్ళు... వీటినే దశాంగ ధూపాలంటారు.)

## అభిషేకప్రియుడికి అభిషేకం ఇలా చెయ్యాలి

దోసిళ్ళతో, చెంబులతో, సీసాలతో పంపులలో పట్టి ఈశ్వరునికి అభిషేకం చేస్తే అభిషేక ఫలం రాదు. నీటిని వస్త్రంతో వడగట్టి ఆ నీటితో అభిషేకం చెయ్యాలి. 1/2/5/8/12/16/24/ 32/64 ఇలా శక్త్యానుసారం ఇష్టమైన, చెయ్యగలిగినన్ని కడవలతో అభిషేకం చేయాలి. వీలయినంతలో ప్రతినెల బహుళ చతుర్ధశి మాస శివరాత్రి రోజులలో అభిషేకం చెయ్యటం మరింత శుభకరం. గరికనీటితో శివలింగ అభిషేకం... పోయిన లేదా నష్టపోయిన ధనాన్ని తిరిగి తెప్పిస్తుంది.



## దుష్టశక్తులు గృహాన్ని వదలిపోవుటకు

గృహంలో దుష్టశక్తులు తొలగుటకు, దుస్వప్న నివారణకు, ఉపద్రవాల నివారణకు ధూమవతీ, బగళాముఖీదేవిల శ్లోకం.. నలభై ఒక్కరోజుల పాటు ఉదయం ఇష్టదైవ పూజానంతరం చేసుకోవాలి.

**సౌవణాసన సంస్థితాం త్రిణయనాం పీతాంశుకోల్లాసినీ।**
**హేమాభాంగరుచిం శశాంక మకుటాం సచ్చంపక స్రగ్యుతా।**
**హస్తైము ద్గర పాశ వజ్ర గసనా స్సంభిభృతీం భూషణై।**
**వ్యాప్తాంగీం బకళాముఖీం త్రిజగతాం సంస్తంభినీం చింతయే॥**

## వచ్చేదారి చెబితే కష్టమే

మార్గమధ్యంలో వున్న వాళ్ళకి వెళ్ళే దారి చెప్పండి.. పుణ్యం... పురుషార్థం కూడా. కానీ ఆ దారే తెలియని వారికి వచ్చేదారి చెబితే అసలకే ఎసరొస్తుంది. పూర్వం ఇలాగే ఓ పేదవాడు ఒక మునీశ్వరుని వద్దకెళ్ళి తన గోడు వెళ్ళబోసుకుని తన దరిద్రం తీరే ఉపాయం చెప్పమన్నాడు. ముని జాలిపడి తన గడ్డంలోంచి ఒక వెంట్రుక తీసి 'గూట్లో పెట్టు గూడంతా బంగారం అవుతుందని' చెప్పాడు. ముని చెప్పినట్టు చేశాడు. కుప్పల కొద్ది ధనం... ఒక్కసారిగా ధనం ఖర్చు పెడుతుండటంతో అంతా రహస్యం ఏంటని అడిగాడు. ధన మదంతో వాడు అంతా చెప్పేశాడు. ఇంకేముంది.. ఊరంతా ముని మీద పడ్డారు. ముని వూరు వదిలేశాడు. కొన్నాళ్ళకి ధనం తరిగిపోయింది. వచ్చేదారి పదిమందికీ చెప్పినందుకు భోరుమన్నాడు. కానీ ప్రయోజనం ఏముంది?



## యజ్ఞ హోమగుండ భస్మం....

రావి, గరిక, దర్భ, జిల్లేడు, మోదుగ, మేడి సమిధలు... పాలు, ఆవునెయ్యి, యాలకలు, గంధం.. ఎండుద్రాక్ష అన్నం ఇంకా వెన్న వేస్తూ మంత్రోచ్చారణతో యజ్ఞం చేస్తారు. అగ్నితో అవన్నీ ప్రజ్వరిల్లి భస్మంగా మారుతాయి. ఆ భస్మం ఎంతో మహిమగలది. ఆ భస్మం ధరిస్తే కోరికలు కోరకుండానే మనోవాంఛలు నెరవేరుతాయి. తెల్లవారుజామున మాత్రమే యజ్ఞ గుండం నుంచి హోమ భస్మాన్ని తీసుకోవాలి.

## వున్నదంతా ఎవ్వరికీ చూపించకూడదు

ధనం ఎప్పుడూ గుప్పిట్లోనే వుండాలి. బహిరంగమయ్యిందా ధనం, స్త్రీ పరులపాలు కాక తప్పదు. ఓ ధర్మపరుడు అడవి గుండా ప్రయాణిస్తుంటే అపార ధన సంపద కాన వచ్చింది. తను సన్యాసి... తనకి వాటి అవసరం లేదు. ఏదైనా గుడికట్టిస్తే అనుకున్నాడు.. బిగ్గరగా కేకలేశాడు. ఇద్దరు, ముగ్గురొచ్చారు. సంపదని చూపించి గుడి కట్టమని చెప్పాడు. అంత ధనంతో దేవాలయాన్ని ఎందుకు కడతామని ఆ ఇద్దరూ ఆ సన్యాసిని హతమార్చారు. నిజానికి ఆ సన్యాసి చెయ్యాల్సింది.. ఆ ధనమంతా వాళ్ళకి చూపించకుండా ధనాన్ని జాగ్రత్త చేసి కొద్దికొద్దిగా ఇస్తూ కార్యాన్ని పూర్తి చెయ్యాలి. ఉన్నదంతా చూపిస్తే ఇదిగో అలాగే ఆ సన్యాసిలా అవ్వాల్సి వస్తుంది.



## సరస్వతీదేవికి ప్రీతికరమైన పువ్వులు

నందివర్ధనం.. మల్లెపూలు... పచ్చగన్నేరు.. పొగడపూలు... (పొగడపూలు... వికసించిన తర్వాత రెండు వారాల వరకూ సువాసనలు వెదజల్లుతూనే వుంటాయి). శ్రీవేంకటేశ్వరునికి ఈ పూలతో సన్నని మాలకట్టి సంధ్య వేళల్లో దీపం వెలిగించి వేస్తే గృహమే వైకుంఠం.

## వీళ్ళు మాత్రమే నీ వాళ్ళు

ఆరోగ్యం బాగాలేనప్పుడు... మహా దుఃఖం కలిగినప్పుడూ, కోపతాపాలతో వున్నప్పుడూ, దరిద్రం ఆవహించి ఉన్నప్పుడూ నీకు గౌరవం లభిస్తున్నప్పుడూ నీ పక్కనున్న వారే నీ వాళ్ళు. ఆ సమయాల్లో పక్కన లేని వారు పరిచయస్థులు మాత్రమే.

- చాణక్యనీతిమాలిక

## ప్రాప్తముంటే పరిగెత్తుకుంటూ వచ్చి వాలుతుంది

శ్రీమహావిష్ణువుకీ, బ్రహ్మదేవునికీ ఇంద్రుడిలా వారి వైభవోపేతమైన భవనాలు లేనందుకు పార్వతి బాధపడి భర్తని ఒప్పించింది. మహా భవనాన్ని నిర్మించుకుంది. గృహప్రవేశ సమయాన రావణుడు తన టక్కరి బుద్ధితో ఆ భవనాన్ని పార్వతి నుంచి వరంగా పొందాడు. మళ్ళీ భవనం కడదామని చెప్పింది. దానికి ఈశ్వరుడు...'శైలజా... ప్రాప్తం అనేది ఒకటి వుంటుంది. అది లేనప్పుడు ఎంత ప్రయత్నించినా వృథానే ' అన్నాడు. 'కర్మ



చేస్తేనే కదా ప్రాప్తముందో లేదో తెలుసేది...' అనగా 'మరి ఓసారి చేసి పోగొట్టుకున్నవుగా' అన్నాడు. స్వామి మాటలు వినకుండా మళ్ళీ మహా భవనం నిర్మింపచేసింది పార్వతీదేవి. ఈసారి శనిని రావద్దని చెప్పింది... వస్తానంటే భవనాన్ని అగ్నికి ఆహుతి చేస్తానంది. ఈశ్వరుడు నేను చెబుతాను.. కాదంటే ఢమరుక శబ్దాన్ని ప్రయోగిస్తాను... శనికి భవనం అప్పగించేకంటే కాల్చి పడేయటం ఉత్తమమని చెప్పాడు. సరేనంది ఆ తల్లి. ఈశ్వరుడు శనిని భవనానికి చాలా దూరంలోని ఆపి విషయం చెప్పాడు. 'తమకి గృహయోగం లేదు అయినా తమరు చెబితే కాదంటానా వెనక్కి వెళతాను.. మీ మాట తప్పక వింటాను' అని... 'ఏదీ ఒక్కసారి మీ ఢమరుకం మ్రోగించండి' అన్నాడు. ఈశ్వరుడు ఢమరుకం అందుకున్నాడు... శబ్దమయ్యింది... అంతే పార్వతి 'హయ్యో... ఈ భవనాన్ని శనికెందుకు అప్పచెప్పాలి...' అని అనుకుంటూ పార్వతి కాల్చేసింది. తర్వాత విషయం తెలిసి ఎంతో బాధపడింది. ఈశ్వరుడు ఆమెని ఓదార్చి 'ప్రాప్తం అనేది ఎవ్వరికైనా ఖచ్చితంగా వుండాల్సిందే. లేనిదాని గూర్చి ఎంత ప్రయత్నించినా శూన్యమే మిగులుతుందని' హిమవంతుని అల్లుడు పరమేశ్వరుడు శెలవిచ్చాడు.

## మహా రక్షణ కోసం అపార ధైర్యం కోసం
## గజేంద్ర మోక్షం

క్షీర సముద్రంలో త్రికూటమనే పర్వతముంది. అనేక ఫల పుష్పాలతో మహా సౌందర్యవంతమైనది ఆ అరణ్యం. అక్కడి చెట్ల పండ్ల నుంచి కారుతున్న ఫల రసాలు కాలువల్లై ప్రవహిస్తుంటాయి.



ఓసారి ఓ ఏనుగుల మంద నీరు త్రాగటానికి వచ్చింది. నీరుత్రాగి గజేంద్రుడు తన భార్యలతో జలక్రీడలాడసాగాడు. ఆడ ఏనుగులతో సరస సంభాషణతో సంతోషంతో మైమరిచిపోయి ఉన్న సమయంలో ఆ కొలనులోని మొసలి గజేంద్రుడి కాలుని పట్టుకుంది.

ఆనందం మటుమాయమయింది. ఘీంకారం చేశాడు గజేంద్రుడు. ఆడ ఏనుగులు బెదిరాయి. ఆనందం చెదిరింది. మహా దుఃఖం. ఆడ ఏనుగులు ఒడ్డుకి పరిగెత్తాయి. గజేంద్రుడు మొసలి పట్టుతో విలవిల లాడిపోయాడు. నీరు త్రాగి వెళ్ళకుండా క్షణికమైన సుఖాల కోసం ఆశపడితే ఇలా జరిగిందా అని బాధపడ్డాడు. అంతకు మించిన బాధ మొసలి పట్టు. అయినా పోరాడాడు. మొసలి మరింత పట్టు బిగించింది. అలా ఇద్దరూ పెనుగులాడారు. ఒడ్డున ఉన్న భార్యలు భర్తకి ఏ సహాయం చేయలేక దిగులుగా చూస్తుండిపోయాయి.

భీషణ, భీకర పోరాటం వల్ల మడుగులో చేపలు.. తాబేళ్ళు... నీటి జంతువులు విలవిలలాడి చితికిపోయాయి. గజేంద్రుడి శక్తి క్షీణించసాగింది. స్థానబలం చేత మొసలి శక్తి ఎక్కువకాసాగింది. పట్టుబట్టినా కాలుని వెనక్కి తీసుకోలేకపోతున్నాడు.

దేహబలమూ, మనోబలమూ క్షీణించసాగాయి. పూర్వజన్మల పుణ్యాపాప కర్మలవల్ల లోకోత్తర శక్తి సకల జీవరాసులకి రక్షణ ఇనస్తుందని స్ఫురణకి వచ్చింది. అంతే భగవంతుడ్ని స్మరించుకున్నాడు.



లోకాలను ఉద్భవింపచేసి, మళ్ళీ తనలోకి తీసుకొని వెలపలా లోపలా తానే అయి వుండే సర్వసాక్షీ... నిన్నే స్మరిస్తున్నాను... సకల లోకాలు అంతరించాక కూడా మిగిలిన గాఢాంధకారము వెనుక అఖండమైన వెలుగులో వుండే ఓ పరమాత్మా... హే ప్రభూ! ఇంద్రియాలకూ, బుద్ధికీ అతీతుడవు.. సనాతనుడవు. నిత్యుడవు. ఆనందమునూ, మోక్షమునే ఇచ్చువాడా.. సృష్టి, స్థితి లయలకు అధిపతివైన నిన్ను స్మరిస్తున్నాను.

ఓ ప్రభూ... నా బాధ ఎక్కువవుతోంది. దీనుల యెడల దయగలవాడా.. వున్నవారూ, లేనివారూ అని విచక్షణ లేనివాడవు. ఓ పరమాత్మా.. ఓ ప్రభూ.. నాలో శక్తి కొంచమైనా లేదు. ధైర్యం సడలిపోయింది. ప్రాణాలు వశం తప్పుతున్నాయి. ఈ దీనుడ్ని ఆదుకో. దీనులను రక్షించే నీ కీర్తి అనన్య సామాన్యమైనది. శరణార్థులు శరణు అని పిలిస్తేనే వచ్చే దయామయీ... ప్రభూ... రక్షించు.. రక్షించు.

**అలవైకుంఠ పురంబులో నగరిలో నామూలసౌధంబు దా**
**పల మందార వనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలో**
**త్పలపర్యంకరమావినోది యగు నాపన్న ప్రసన్నుండు వి**
**హ్వల నాగేంద్రము "పాహి పాహి" యన కుయ్యాలించి సంరంభియై**

అప్పుడు శ్రీహరి అలవైకుంఠపురంలో, రాజప్రసాదములో, అంతఃపుర సౌధములో, మందార వదన మధ్యాన అమృత సరసువధ చంద్రకాంత శిలావేదికపై కలువ పువ్వుల పాన్పుపై రమాదేవితో... ఇందిరాదేవితో వినోదిస్తున్నాడు పరంధాముడు.



గజేంద్రుని మొర 'రక్షించు... రక్షించు' అన్న ఆర్తనాదం వినపడటంతో విభుడు... తొందరపాటుతో...

**సిరికిం జెప్పడు శంఖచక్రయుగమం చేదోయి సంధింపఁ డే**
**పరివారంబును జీర డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణి కాం**
**తర ధమ్మిల్లముఁ జక్కనొత్తడు వివాద ప్రోత్థిత శ్రీ కుచో**
**పరచేలాంచలమైన వీడడు గజప్రాణావనోత్సాహియై.**

గజరాజుని రక్షించాలని శ్రీహరి ఒక్క ఉదుటున లేచాడు. శంఖుచక్రాలను ధరించలేదు. అనుచరగణాలను పిలువలేదు. తన వాహనమైన గరుత్మంతుడ్నీ రమ్మనలేదు. తన జుట్టునీ, తనపైనున్న వస్త్రాలనూ సవరించుకోలేదు. తన ప్రణయములో మునిగి తన పైటచెంగును పట్టుకున్న స్వామి అలాగే లేచి వెళుతుంటే శ్రీలక్ష్మీదేవి తనూ తటాలున లేచి స్వామి ఎక్కడికెళ్తున్నారా అని అనుసరించింది. ఆ సమయంలో....

**తనవెంటన్ సిరి లచ్చివెంట నవరోధ వ్రాతమున్ దాని వె**
**న్కను బక్షీంద్రుడు వాని పొంతను ధనఃకౌమోదకీ శంఖ చ**
**క్ర నికాయంబును నారదుండు ధ్వజనీకాంతుండురావచ్చి రొ**
**య్యన వైకుంఠపురంబునం గలుగు వారాబాల గోపాలమున్.**

తన పైటచెంగును కూడా వదలకుండా తన చేతిలో వున్నదనే ఆలోచన కూడా లేకుండా వడిగా ఆకాశమార్గాన వెళ్తున్న శ్రీమహావిష్ణువు వెంట శ్రీమహాలక్ష్మి అనుసరిస్తూ కదిలి వెళు తుండటంతో అంతఃపురస్త్రీలు ఆలోచనే చెయ్యకుండా లక్ష్మీదేవిని అనుసరించారు. ఆ వెనుకే పక్షిరాజు గరుత్మంతుడు, ఆయన



వెనుకే ధనస్సు... గద... శంఖచక్రాలు... వీరిని గాంచి ఆ వెనుక నారదుడూ.. అంతమంది వెళుతుండటంతో వైకుంఠవాసులంతా.... పరుగెడసాగారు. నారయణుడి చేతిలోని పైటకొంగును రక్షించుకుంటూ శ్రీలక్ష్మీదేవి ఆయన్నే అనుసరించసాగింది.

ఆహా స్వామి ఎక్కడికి వెళుతున్నారు...?! కాముకులెవరైనా స్త్రీ జనులకి కీడు చేస్తున్నారా...? లేదంటే అపహరించారా..? దేవతల నగరంపై రాక్షసులు దండెత్తారా...? అని పరిపరివిధాలుగా ఆలోచిస్తూ శ్రీహరిని వడివడిగా అనుసరించసాగింది మహాసాధ్వి.

భక్తజనులను తరింప చేయువాడూ, శ్రీమహాలక్ష్మి సేవలను అందుకునే జయశీలుడైన శ్రీమహావిష్ణువు ఆకాశమార్గాన ఆ రీతిలో వెళుతుండటంతో దేవతలంతా నమస్కరించి స్తుతించసాగారు. వారి నమస్కారస్తుతులను పట్టించుకోకుండా ఆయన వెడలసాగాడు.

గజరాజుని రక్షించటానికి వెళుతున్న జయశీలుడ్ని చూస్తూ దేవతలూ మరల మరల నమస్కరిస్తూ తరించారు.

త్రికూట సరస్సుకు చేరి శ్రీహరి తన సుదర్శన చక్రాన్ని వదిలాడు. సకల లోకాలను కంపింపచేసే సుదర్శన చక్రము మహా వేగంతో అగ్ని కణాలతో ఆకాశాన్ని చుట్టేయగలదీ అయిన ఆ సుదర్శన చక్రం మొసలి తలని ఖండించి వేసింది. గజేంద్రుడు మబ్బులు తొలగిన చంద్రుడిలా ప్రశాంత చిత్తుడయ్యాడు. ఆడ ఏనుగులు తొండాలతో నీరు పోశాయి. గజేంద్రుడు పరమానందం చెంది శ్రీహరిని పదే పదే స్తుతించాడు. గజరాజును శ్రీహరి వెన్నుతట్టి నిమిరాడు. గజేంద్రుడు ఘీంకరించి మరల మరల నమస్కరించాడు.



వైకుంఠధాముడు పాంచజన్యాన్ని పూరించాడు. భూమి పులకించింది. దేవతలు జయ జయ ధ్వనులు చేశారు. మడుగు నుంచి శాపగ్రస్తుడైన ఇంద్రద్యుమ్నుడు శ్రీహరికి నమస్కరించి తన శాపవిమోచనం అయినందుకు సంతోషాన్ని తెలుపుతూ మరల మునులతోనూ, సజ్జనలుతోనూ అనుచితంగా ప్రవర్తించనని వెడలిపోయాడు.

ఆపై శ్రీహరి తన రమాదేవిని సరసంగా అడిగాడు. 'సుకుమారీ.. నీ పైట చెంగు విడవకుండా వడివడిగా వెళుతుంటే నా వెంట పరిగెడుతూ ఏమనుకున్నావు...'

మందస్మితవదనంతో వైకుంఠనాథుని సతి 'ప్రభూ! ఏం చెయ్యగలను. మీ పాదాలను అనుసరించటమేగా నా కర్తవ్యం.. ముందు వెళుతుంటే వెనుకే నేను రాకుండా ఉండగలనా...'

శ్రీమహావిష్ణువు రమాదేవితో అత్యంత ప్రీతిపాత్రమైన చిరునవ్వుతో "దేవీ... ఈ గజేంద్రుని గాథని చదివినవారూ... చదివి వినిపించిన వారూ శత్రువుల నుంచి రక్షించబడతారు. శత్రుబాధలుండవు వారికి. అఖండ సుఖ ధైర్యాలు కలుగుతాయి. అట్టి ఈ గజేంద్ర మోక్షం చదివిన వారికి నీ అనుగ్రహం కూడా వర్తింప చేయవలసిందని' శెలవిచ్చాడు.

ఈ గజేంద్ర గాథ చతుర్థ మన్వంతరంలో జరిగింది.

## కల్పవృక్ష మహాత్యము

క్షీరసాగర మథనంలో ఐరావతం తర్వాత జన్మించినదే కల్పవృక్షము. అన్ని ఋతువుల్లో విరబూసే మహా దివ్య వృక్షం. రాలిపోని పువ్వులతో, కోరిన కోర్కెలను తీర్చే దివ్యద్రుమమది.



దాన్ని ఇంద్రుడు తనకి అనుగ్రహించమని వేడుకోగా... శ్రీహరి అనుగ్రహించాడు. ఆ వృక్షాన్ని తెచ్చి నందనవనంలో ఉంచాడు ఇంద్రుడు.

## శ్రీమహాలక్ష్మీ పరిణయము

చంద్రుని తర్వాత జన్మించింది శ్రీలక్ష్మీదేవి. విశ్వములోని సౌందర్యమంతా పోగు చేసి సృష్టించాడు బ్రహ్మదేవుడు. దేవాసురులంతా ఆమె వంక చూశారు. ఇంద్రుడు మహా రత్నపీఠాన్ని తెచ్చి కూర్చోమన్నాడు. ఇక నదులు బంగారు కలశాలతో నీరు తెచ్చి స్నానం చెయ్యమన్నాయి. భూమి సుగంధ ఓషధులను ఇచ్చింది. సకల దేవతలకి నిలయమైన గోవులు పంచామృతాలను తెచ్చి ఇచ్చాయి. ఇక మనుజులు ఫలపుష్పాదులను తెచ్చిపెట్టారు. దిగ్గజాలు పూర్ణకలశాలతో అభిషేకం చేశాయి. వేదపండితులూ, ఋషులూ, మునులూ మంత్రాలను చదివారు. సముద్రుడు తన పుత్రికకు పట్టుపీతాంబరాలను ఇచ్చాడు. గంధర్వులు ఆనందంతో నాట్యం చేశారు. వరుణుడు వైజయంతీమాలను ఇచ్చాడు. విశ్వకర్మ మహా ఆభరణాలను ఇచ్చాడు. బ్రహ్మ సరస్వతులు పద్మమునూ, మాలనూ ఇచ్చారు. సరస్వతి ఇచ్చిన మాలను పట్టుకొని తనని ఏలుకోగల అయ్యఎవ్వడా అని అప్పుడు పరికించింది.

తపోధనుల్లో క్రోధం వుండటం గమనించింది.

సకల సద్గుణసంపన్నులైనా కోరికలను జయించలేని వారవటం, నిష్టాగరిష్ఠులైనా దయా ధర్మాలు లేనివారవటం, అపురూప సౌందర్యవంతులైనా కొంతకాలానికి ఆ యవ్వనాన్ని



కోల్పోయే వారయి వుండటం, మహాశక్తివంతులైనా గొప్ప శీలము లేని వారవటం వంటివి అందరిలో కనిపించసాగాయి. ప్రతి ఒక్కరిలో ఏదో ఒక లోపం కనపడింది. తుదకు శ్రీమహావిష్ణువుని చూసింది. ఆమె తనువు ఒక్కసారిగా పులకరించింది. నిర్వికారుడై సకల సద్గుణ సంపన్నుడై, దేనినీ ఆశించనవాడై, దివ్య మోహనాకారుడై ఏ లోపం లేనివాడయిన శ్రీమహావిష్ణువుని చూస్తూ సిగ్గుగా నడుస్తూ తనని స్వీకరిస్తాడా అని ఆలోచిస్తూ అతని వక్షస్థలం చూసి అదే తనకి నివాస స్థలమని తలచి మాల వేసింది. శ్రీమహావిష్ణువు 'తథాస్తు' అని స్వీకరించాడు. పుష్ప వర్షం కురిసింది. బ్రహ్మరుద్రాదులు స్తోత్రాలు చేశారు.

## సౌందర్యవతిని చూడటమంటే, ఆస్వాదించటమంటే కోరి సంసార గొడవలు తెచ్చుకున్నట్టే

క్షీరసాగర మథనంలో వైద్యవిద్యానిపుణుడైన ధన్వంతరి అమృత కలశంతో జన్మించగానే రాక్షసులు అమృతకలశాన్ని లాక్కుని పారిపోయారు. అప్పుడు శ్రీమహాలక్ష్మికన్నా సౌందర్యవంతమైన రూపంతో శ్రీహరి మోహినీ అవతారమెత్తి రాక్షసుల మతిని పోగొట్టింది. తూర్పుపడమర ముఖాలుగా కూర్చుంటే అమృతం పంచుతానని చెప్పింది. అందగత్తె మాటలను విశ్వసించరాదని కూడా చెప్పింది. అయినా రాక్షసులు ఆమెకు దాసులయ్యారు. అమృతం పోగొట్టుకున్నారు.



ఓ దశలో పరమేశ్వరుడూ ఆ అపురూప మోహినిని చూసి ఆమె సౌందర్యానికి విచలితుడై భార్య పార్వతీదేవి వున్నదని కూడా మరచి, ప్రమథగణాలు చూస్తున్నాయని కూడా లెక్కచెయ్యక పూల బంతులాడుతున్న మోహిని వద్దకెళ్ళి పమిట చెంగు పట్టుకున్నాడు. సరస సంభాషణ ప్రారంభించాడు. ఆ తర్వాత విష్ణుమాయకన్నా స్త్రీ మాయ గొప్పదని శివుడు అంగీకరించాడు. పార్వతితో సర్ది చెప్పుకోలేక రుద్రుడు సహితం తికమకపడ్డాడు. అంత గొప్పది స్త్రీ సౌందర్యం. అందుకే ఆ సౌందర్యం చూడటానికే గాని ఆశిస్తే భంగం తప్పదు. ఇది చదివిన వారికి సంసార క్లేశాలు వుండవని పార్వతికి నచ్చచెప్పి వూరడించాడు పరమేశ్వరుడు.

## బలిచక్రవర్తిలా మాట ఇచ్చేయకూడదు

మానవ సంబంధాలన్నీ పూర్తిగా ఆర్థిక సంబంధాలుగా మారిన ఈ రోజుల్లో ఇంకా మాట ఇస్తే నిలబడేవారున్నారు. అందుకే ఈ భూమి శూన్యంలో తన చుట్టూ తాను తిరుగుతూ ఏవైపుకో జారిపోకుండా వుంది. అవతల వాళ్ళెంత అనుకునో, సంపదపరులమని అనుకుంటూ చప్పున మాటిస్తే బలిచక్రవర్తిలా అవ్వాల్సివస్తుంది. అదితి పుత్రుడు వామనుడ్ని చూసి ఏం కావాలో అడగమంటే... మూడు అడుగులు అడిగాడు. దాంతో బలిచక్రవర్తి పసివాడవు... ఏం అడగాలో తెలియనివాడవు నీవు అంటూ సరేనని మాటిచ్చాడు. ఆ తర్వాత గాని అసలు విషయం అర్థంకాలేదు. కాన సంపదలున్న వారు తొందరపడి నలుగురిలో మాట ఇవ్వద్దు. ఎందుకంటే చుట్టూ వున్న వారు ఆ మాట నీ నోటి వెంట చెప్పించటానికే పద్మవ్యూహానికి మించిన వ్యూహాన్ని రచిస్తారు. దాంట్లోపడితే తిరిగి వెనక్కి రావటం వుండదు.



## పూర్వ వైభవం తిరిగిరావాలంటే పయోభక్షణ వ్రతం...

ఫాల్గుణ శుక్ల పాడ్యమి నుంచి ద్వాదశి వరకు పగలూ, రాత్రి అని తేడా లేకుండా శ్రీమహావిష్ణువుని పూజించాలి. పాలు మాత్రమే ఆహారంగా తీసుకోవాలి. 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అని స్మరిస్తూ ఉండాలి. అలా పన్నెండు రోజులు చేయాలి. అదితి పూర్వ వైభవం తిరిగి రావటానికి కశ్యపుడు తన భార్యామణి అదితికి చెప్పిన వ్రతమిది. ఆ వ్రతం వల్లే వామనుడు జన్మించాడు.

## చెప్పిన దానము.. ఇచ్చిన మట తప్పవచ్చు

ఎంతమందిలో చెప్పినా, సర్వస్వాన్ని నష్టపరిచే విధంగా వుంటే ఆడినమాట, ఇచ్చిన మాట తప్పినట్టుకాదని ఋగ్వేదం శెలవిస్తోంది. స్త్రీలని వప్పించాల్సి వచ్చినప్పుడూ, సరస పరిహాసాలప్పుడూ, వివాహాది వేడుకలప్పుడూ, ధర్మపరులని రక్షించాల్సినప్పుడూ అసత్యమైనా ఇచ్చిన మాట తప్పినా దోషం కాదు. పర్వతాలనైనా భూదేవి మోయటానికి ఇష్టపడుతుంది గాని అసత్యవాదులను ఇష్టపడదు. నిజవే. కానీ అది అన్ని సమయాల్లోనూ, సందర్భాలలోనూ కాదు. అలాంటి సందర్భాల్లో భర్త ఇచ్చిన మాటలను బలిచక్రవర్తి భార్య వింధ్యావళిలా తల వూపక ఈ వేద ధర్మాలని ప్రతి భార్యా భర్తకి చెప్పాలి.

**తెల్లమద్ది చెట్టుకి మల్లెతీగ అల్లుకొని కనిపిస్తే శివపార్వతుల సాక్షాత్కారం లభించినట్టే.**



## అతిథిని భోజనానికి పిలిచినప్పుడు సమయానికి రాకపోతే

ఒక్కోసారి ఆ సందర్భం ఎవ్వరికైనా రావచ్చు. అలాంటప్పుడు రాకపోయినా, ఆలస్యమయ్యే అవకాశం వున్నా, గృహస్థు తులసి తీర్థం తీసుకొని కొంతసేపు వేచి చూడటము లేదా భోజనాన్ని చెయ్యటం చెయ్యవచ్చని శాస్త్రం శెలవిస్తోంది.

## అసలు సిసలు గొప్ప ధనం

తినాలనుకున్నప్పుడూ, త్రాగాలనుకున్నప్పుడూ... శరీరంలో పట్టున్నప్పుడూ, వైభవంగా కనిపించాలనుకునే వయసులో, కోర్కెలకి చివరి చిరునామా ఉన్న సమయంలో ధనం వుండదు.. రాదు. అంతా అయ్యాక ఏం చెయ్యలేని, చేసుకోలేని సమయంలో వచ్చే ధనం ధనం కాదు. అలా వచ్చే ధనం మిత్రులనీ, బంధువులనీ, పిల్లలనీ అన్ని రకాలుగా బాధపెడుతుంది. ఆ వ్యక్తికి కూడా. సుఖం లేని ధనం అది. పళ్ళు వూడిన తర్వాత పిటపిట లాడే జామకాయని తినగలమా? అంతే... అది అదృష్టం కాదు. వయసులో అందని ధనం కూడా దురదృష్టం.

## అత్యున్నత స్థాయి విజయపథంపై వుండాలంటే

- ఆ విజయస్థానమెంత మధురమో తెలియాలి.
- ఓ అద్భుతమైన స్ఫూర్తిని పొందాలి.
- వంటి చేత్తో కొండను కొట్టగలనన్న పట్టుదల కావాలి.
- మీరంటే అందరికీ నమ్మకం ఉండాలి.



- ఏ విజయబావుటా ఎక్కి ఎగరవెయ్యాలని భావిస్తున్నారో దాని గురించి పూర్తి నైపుణ్యం వుండాలి.
- పదిమందినీ కలిపే నాయకత్వ లక్షణం వుండాలి.
- ఎన్నటికీ, ఎప్పటికీ ఎలాంటి స్థితిలోనూ ఆత్మస్థైర్యాన్ని కోల్పోకూడదు.
- శరీరంలో శక్తి, మనసులో సామర్థ్యాన్ని సదా రక్షించుకుంటూ, కాపాడుకుంటూ, పెంచుకుంటూ ఉండాలి.
- ద్రోణాచార్యుడి శిష్యుడు అర్జునుడిలా లక్ష్యంపైనే గురి ఉండాలి.
- మీ చుట్టూ వున్న వారందరికీ మీరంటే అభిమానం వుండాలి. ముఖ్యంగా స్త్రీ బలహీనత వుంటే పైవన్నీ వున్నా ఆ స్థానానికి ఎట్టి స్థితిలోనూ వెళ్ళలేరు.

## తప్పు చేస్తే దగ్గరికి రానీయద్దు

వందరూపాయిలైనా సరే తేడా చేస్తే వాళ్లని దూరంగా వుంచటం ప్రాథమిక సూత్రం లేదంటే ఆ వంద వెయ్యి.. లక్షగా మారి మీ పరిస్థితిని తారుమారు చేస్తుంది. తింటేనే కాదు కొండలు కరిగిపోయేది.... దొంగతనంగా తవ్వినా తరిగిపోతాయి. ఆస్తులతో పాటు రాబడి, మీకష్టం కూడా.

## ఒకే వృత్తిలో వున్నవారితో అతిస్నేహం వద్దు

చాలా చాలా నష్టం అది మీకు.. స్నేహం మీద తెలిసీ, తెలియక వృత్తిలోని రహస్యాలని చెప్పేస్తాం. నమ్మి దగ్గరుండి కొనుగోలుకి కూడా తీసుకువెళతాం. ఓ శుభ ముహూర్తాన నేనూ



అదే వ్యాపారం చేస్తానని కూడా చెప్తారు. ప్రారంభిస్తారు కూడా. మీకు మండాల్సిన చోట మండుతుంది. అతని సన్నిహిత్యంతో పాటు అతనితో వున్న ఆర్థిక లావాదేవీలు కూడా దెబ్బతింటాయి.

## అప్పు ఇచ్చిన వారితో, తీసుకున్న వారితో స్నేహం వద్దు

తద్వారా నష్టమే ఎక్కువ. మీరు సన్నిహితంగా వుంటే అప్పిచ్చిన వాడికి మీ దగ్గరకి ధనమెప్పుడొస్తుందో తెలుస్తుంది. మీరేమో దానితో వ్యాపారం పెంచుకోవాలని భావిస్తారు. మళ్ళీ ఇస్తానుగా అని ఆ వ్యక్తి వత్తిడి చేస్తారు. మీరు ఇవ్వక తప్పదు. ధనం చేతిలో వున్నప్పుడు వ్యాపారం రాదు. వ్యాపారమొస్తున్నప్పుడు ధనం చేతిలో వుంటే పది రూపాయిలుమిగులుతాయి. అప్పిచ్చిన వాడు వాడి దగ్గరున్నప్పుడు ఇస్తాడు గాని వ్యాపారం వున్నప్పుడు కాదు. ఇక అప్పు తీసుకున్నవాడిని దగ్గరికి రానిస్తే... తిరిగి ధనం అడిగినా లేనిపోనివి వూహించి మీ ప్రత్యర్థి వర్గానికి మీ రహస్యాలని చేరేవేసి మీ వ్యాపారానికి గండి కొడతాడు. సంసారమే కాదు వ్యాపారానికి కూడా గుట్టు అవసరమే. అప్పుడే ఆ రెండూ స్థిరంగా వుంటాయి. ఆనందంగా సాఫీగా సాగుతాయి.

## అలవాట్లు వున్నవాడిని పనిలో పెట్టుకోవద్దు

'ఆఁ ఏముందిలే పొగతాగుతాడు.... వాడి డబ్బుతో వాడు తాగుతాడు మనకేమిటి నష్టంలే' అని పెట్టుకుంటారు. దాని వల్ల పొగత్రాగే అలవాటు దాటి మరికొన్ని అలవాట్లు, ఆశలు



పెరిగిపోతాయి. తర్వాత దుర్బుద్ధి పెరుగుతుంది. అంతే. జరగాల్సింది జరిగిపోతుంది. ఆడపిల్ల ప్రేమలో పడితే చివరికి తెలిసేది తల్లిదండ్రులకే. కొట్లో దొంగతనం కూడా అంతే. సంస్కృతం నేర్చుకునే వారు ఉల్లిపాయను దూరంగా వుంచుతారు. ఎందుకో తెలుసా? శారీరిక కోరికలు అదుపులో వుండవని. అదుపులేని శరీరంలోని నోరు సంస్కృత శబ్ద ఉచ్చారణకి సహకరించదు. అలాగే వ్యసనాలున్న పనివారిని పెట్టుకుంటే మీ వృత్తి అలాగే వుంటుంది.

## రాబడి ఎంతవస్తుందో మీ ఉద్యోగులకి తెలియనీయద్దు

అలా తెలియటం వల్ల అమ్మినప్పుడల్లా సేటుకి ఇంత వస్తుంది అని లెక్కపెట్టుకుంటారు. కానీ ఖర్చులూ... జీతాలూ.. అద్దెలు... వడ్డీలు.. వాడికేం గుర్తుకురావు. ఓ వస్తువు అమ్మితే ఇంతొస్తుంది... తనకిచ్చేది ఇంతేనా అని తననేదో వాడుకున్నట్టు ఫీల్ అయి రావాల్సిన నష్టాన్ని అంతా రానిచ్చి మూర్ఖత్వంతో అవసరమున్నప్పుడు మానేస్తాడు.

## భాగస్వామ్య వ్యాపారం మంచిది కాదు

- మీ తెలివితేటలు చూపించటానికి వ్యాపార అభివృద్ధికి మిగతావారు ఒప్పుకోవాలి.
- ధనమెక్కువ పెట్టిన వాడికి వంగి వుండాలి. దాంతో పనివాళ్లకి మీరంటే చులకన. దాంతో పట్టు వుండదు.



కొత్తలో బాగున్నా తర్వాత మొదలవుతాయి... దాంతో సంస్థ మూసేయాల్సిన పరిస్థితి. నీవల్లంటే... నీవల్ల... అని మనస్పర్థలు. వెరసి సంస్థ మూతపడటం. కార్మికులు రోడ్డున పడటం....

## వృత్తిలో నెం.1 వాడితో తిరగొద్దు

మర్రిచెట్టు నీడలో మొక్క మొలుస్తుందా.... మీ పరిస్థితీ అంతే. మీరు జీవితంలో ఎదగలేరు. మీరేం చెయ్యాలన్నా ఆలోచిస్తారు. అతను చేసేస్తాడు. ఏ చిన్న అవకాశాన్నీ మీకివ్వడు. ఇస్తే రెండు, మూడో స్థానంలో వారితో పాటు మీతో కూడా పోటీ పడాల్సి వుంటుంది. పైగా అలాంటి వారితో తిరిగితే వ్యాపార పరిచయస్థులెవ్వరూ మీకు సహకరించరు. మిమ్మల్ని నమ్మరు. ఆయనతో చెప్పించండంటారు. అతను చెబుతాడు. కానీ అదే భూస్థాపితం. జీవితాంతం వ్యాపార రంగంలో వున్న వాళ్ళంతా మిమ్మల్ని సెకెండ్‌గానే భావిస్తారు. తేడా వస్తే వాడే కాదు వారి పరిచయస్థులందరూ మీకు సహకరించరు. దాంతో రోడ్డున పడటం ఖాయం.

**పోటీదారుడ్ని నాలుగు మాటలన్నా పర్వాలేదు తర్వాత సర్ది చెప్పుకోవచ్చు. కానీ పోటీదారు వద్ద పని చేసే వారిని ఒక్కమాట కూడా అనద్దు. అతనే కాదు ఎవ్వరైనా తననన్నా వూరుకుంటాడు గానీ తన దగ్గర పని చేసేవాళ్ళని అంటే అంతు తేలుస్తాడు. వ్యాపార ప్రత్యర్థితనం పోయి శత్రుత్వం. తద్వారా ద్వేషం పెరిగి పక్కవాళ్ళకి పని కల్పించి, చివరకు ఎంతోకొంత ఇద్దరూ నష్టపోతారు.**



## డబ్బులున్న వాడితో వివాదాలొద్దు

వివాదం వస్తే వ్యాపారం సంగతి అటుంచి, మిగతా విషయాలెక్కువ అవుతాయి. వాడు పదివేలు ఖర్చుపెడతాడు.. మీరూ పెడతారు. ఆ తర్వాత ఇంకొంత.. మీరూ ఖర్చుపెడతారు. కానీ ఒక స్టేజీలో మీ వద్ద ధనం అయిపోతుంది. అదే వాడి గెలుపు అవుతుంది. అందుకే డబ్బులన్న వ్యాపారితో మీ వ్యాపారం ముందు నాదెంత అని అంటే అలా కుక్కలా పడివుంటాడు.

## వ్యాపారాన్ని వ్యసనంలా చేయాలి

పొద్దున్నే వైన్‌షాపు తెరవక ముందే పడిగాపులు కాచే వాళ్ళని గమనించే వుంటారు. అంటే ఎంత వ్యసనానికి బానిసయ్యారో తెలుసుకోవచ్చు. నిజంగా అన్ని వ్యసనాలకన్నా వ్యాపారం మహా వ్యసనం. దానికి బానిసయితే వ్యాపారంలో ఉండే కిక్ తెలుస్తుంది. మందు బానిసలు కన్నా ముందే తన దుకాణంలో కూర్చుంటాడు. అదే అసలు కిక్.

## ఋజువు చేసుకోండి

కొనుగోలు చేసినవి రాగానే బండిల్ పగలకొట్టి గబగబా సర్దేసుకుని సంబర పడటం కాదు. ఋజువు చూసుకోండి. మీరు లెక్క చూసుకోవటం లేదని అవతల వారికి తెలిస్తే లాభం గూభంలోకి వస్తుంది. ఇంకా మీరే నాణ్యతవి కొనుగోలు చేశారో, అవే వారు పంపారో లేదో కూడా చూసుకోవాలి. లేదంటే మీ దగ్గర నాణ్యత తక్కువగా వున్నవి దొరుకుతాయని ప్రచారం జరిగి పూర్తిగా ఖాళీగా కూర్చోవాల్సి వస్తుంది.



## క్రోధం ఎక్కువైతే

కోపం ఎండాకాలం వానలాంటిది. క్రోధం సంబంధిత వారిని, తనని కూడా కబళిస్తుంది. అలాంటి వారు తమ క్రోధం సమసిపోవటానికి ఆలయాల్లో బైటవున్న రాతి విగ్రహాల కాళ్ళు పట్టుకుని ధ్యానిస్తే క్రోధం స్థానంలో కర్తవ్యం స్మరణకొస్తుంది. ఆ క్రోధమే ధర్మంవైపు వెళితే చరిత్రలో మహాస్థానమే మీకు వుంటుంది. అలాంటి క్రోధంతోనే ఏనుగుల మీద కోపంతో ఏనుగులు దూరని ప్రాంతంలో ఏడువందల శివాలయాలని కట్టించాడు.

## ప్రతి విజయం వెనుకా ఎవరో ఒకరుంటారు

కామాన్ని జయించటం ఎంతటి వారికైనా సాధ్యం కాదు. నారదుడు పూర్వం హిమపర్వ ప్రాంతంలో తపస్సు చేస్తుండగా తపస్సు చెడగొట్టడానికి మన్మథుడు ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఫలించలేదు. నారదుడు కామాన్ని జయించాననుకున్నాడు. తపస్సు చాలించాడు. ఆనందంగా కైలాసం వెళ్ళి 'ఈశ్వరా... నీవు కూడా జయించలేని కామాన్ని నేను జయించాను' అని అన్నాడు. పరమేశ్వరుడు నవ్వి అలాగే అన్నాడు. ఆపై వైకుంఠం వెళ్ళి శ్రీమహావిష్ణువుకి చెప్పాడు. అప్పుడు సుదర్శనధారి అల్లన నవ్వి 'నారదా, నీవు తపస్సు చేసిన చోట పరమేశ్వరుడు చేశాడు. అక్కడే ఆ హిమపర్వత ప్రాంతంలోనే గంగానది ఒడ్డున మన్మథుణ్ణి బూడిద చేశాడు. ఆ ప్రదేశంలో మన్మథుని శక్తి పని చేయలేదు. అంతే' అన్నాడు. కాన సాధించిన విజయం అంతా తనదే అనుకుంటే... గొప్పలకి పోతే అభాసుపాలు కాక తప్పదు.



## అనుకుంటే తన్నుకుంటూ వస్తుంది

చంద్రశర్మ అనే పండితుడు(పతంజలి) తొమ్మిది రోజుల పగలూ, రాత్రి ఏకధాటిగా వ్యాకరణం రాశాడు. ఆపై తిరుగు ప్రమాణంలో ఓ అరుగు మీద నీరసపడి పడుకున్నాడు. ఆ ఇంటి యజమాని పుత్రిక అతని స్థితి చూసి అన్నం, పెరుగు కలిపి రసంలా చేసి శరీరమంతా రాసింది. బాగా కోలుకున్నాడు. దాంతో ఇంటి యజమాని ఆ సుందర కన్నులు గల కన్యని వివాహం చేసుకోమన్నాడు.

'నేను సన్యాసం తీసుకోదలిచాను. ధనం.. సుఖాలు.... వైభోగాలు, కీర్తి.. అవసరం లేదన్నాడు. వాదన జరిగి రాజు వద్దకెళ్ళారు వారిరువురూ. రాజు ఆ తేజోమయుడ్ని, ఆ మహా పండితుడ్ని చూసి చంద్రబింబ ముఖం వంటి తన కూతుర్ని వివాహం చేసుకోమన్నాడు. ఇదంతా చూస్తున్న మంత్రి ఓ రాజా! విప్రుడు బ్రాహ్మణిస్త్రీని చేసుకున్నాకే ఇంకొక కన్యని చేసుకోవాలి కాన తన కూతురైన ముగ్ధమనోహరిని ముందుగా చేసుకోమన్నాడు. చంద్రశర్మ ముగ్గుర్నీ చేసుకున్నాడా లేదా అన్నది కాదు. మనది అయితే ధనం.. సుఖాలు..స్త్రీ మన దగ్గరకే పరిగెత్తుకు వస్తాయి. వాటి కోసం వెళితే అవి మరింత దూరం... దూరం.

## హరి కాదు శ్రీహరి అని స్మరించాలి

హరి అంటే కోతి అని కూడా అర్థం వస్తుంది. నారదుడు శ్రీహరిని తన వివాహ విషయమై సహాయం చెయ్యమని 'హరి' రూపమివ్వమని అడిగాడు. శ్రీమహావిష్ణువు సరేనన్నాడు.



పెళ్ళికూతురికి నారదుడు కోతిలా కనిపించాడు. అభాసుపాల య్యాడు నారదుడు. హరి కనిపించేలా అడిగావు గాని 'శ్రీహరి'లా కాదుకదా అని చెప్పాడు వైకుంఠవాసుడు. నారదునికి కోపం వచ్చింది. దాని ఫలితమే శ్రీరామావతారంలో సీతా వియోగం, కోతి మూకల సహాయం, ఇత్యాదివన్నీ.... కాన 'శ్రీహరి' అని స్మరించండి. భయం కలిగినప్పుడు 'హరహరమహదేవ శంభో శంకర' అని స్మరించండి. భయం పోతుంది.

## వంట ఎలా చెయ్యాలి

- స్నానం చేసి మాత్రమే అగ్నిహోత్రము వెలిగించాలి.
- పొయ్యిలో కట్టెలు పెట్టి వాటి మీద నెయ్యి వేయాలి. ఆపై వెలిగించాలి.
- మడిబట్టతో గిన్నె పెట్టి పదార్థాలను వండాలి.
- వండిన తర్వాత కొంత తీసి ఈశ్వరునికి నైవేద్యంగా సమర్పించి అనంతరం భుజించాలి.

అలా వండిన పదార్థాలను అతిథికి పెట్టి 'తేనుపు' రాకుండా భోజనాన్ని ముగించాలి. తేనుపు వచ్చిన తర్వాత తింటే 'చరకసంహిత' మథించి మందులు వాడినా ప్రయోజనం వుండదు.

## కోరికలు తీర్చే అయిదు నమస్కారాలు

స్నానశౌచము అయ్యాక తల్లి, తండ్రికి మౌనంగా నమస్కరించాలి. ఆపై దేవాలయానికి వెళ్ళి మూడు ప్రదక్షిణాలు చేయాలి. ఒక్కో ప్రదక్షిణము అయ్యాక స్వామివైపు తిరిగి నమస్కరించాలి. మూడు ప్రదక్షిణలు, మూడు నమస్కారాలు



అయ్యాక పరమాత్మని దర్శించుకుని అయిదో నమస్కారం పెట్టి ధర్మపరమైనదీ, గృహస్థ ధర్మానికి అనుగుణమైనదీ అయిన కోర్కెని కోరుకోవాలి. అది తప్పక ఆ సర్వేశ్వరుడు తీరుస్తాడు.

## వంట్లో క్రొవ్వుని తగ్గించే ద్రవం

శుక్ల పక్షంలో ఒక తిథి పెరగగానే తినే ఆహారంలో ఒక ముద్దను పెంచుకుంటూ పోవాలి. కృష్ణ పక్షంలో ఒక తిథి తగ్గిపోతున్నప్పుడు ఒక్కొక్క ముద్ద తగ్గించుకుపోవాలి. ఇక అమావాస్య నాడు అన్నం ముట్టరాదు. అప్పుడు శరీరంలోని క్రొవ్వు తగ్గిపోతుంది. క్రొవ్వు అనగా లావు తగ్గటానికి చేసే వ్రతం కాదు అది. ఒళ్ళు కొవ్వెక్కి తప్పుడు పనులు చేసి పదుగురిని నానా మాటలు అని వాళ్ళ ఉసురుపోసుకుంటే.... ఆ తప్పు తెలుసుకుని ఈ వ్రతం చేస్తూ శివారాధనలో మునిగి వుంటే ఒంటి క్రొవ్వు, అహం క్రొవ్వు సమసిపోతాయి. అవి తగ్గించటానికి చేసే ఆ వ్రతం పేరే చాంద్రాయణ వ్రతం.

## పనికిమాలిన వాళ్ళని చుట్టూ చేర్చుకోకండి

జిల్లేడు ఆకులూ, పూలూ, తమ్మి పూలు రహదారి పక్కనా, పొలాల పక్కన పెరుగుతుంటాయి. అవి కోసినా ఎవ్వరూ ఏమీ అభ్యంతరం పెట్టరు. ఎందుకంటే అవి ధనంతో తూగేవి కావు. అలాంటివి తీసుకెళ్ళి ఈశ్వరుడి పాదాల ముందు పెట్టి కోరికలు కోరితే ఆ దేవదేవుడు సృష్టిలోని వారంతా తన బిడ్డలే కదాని వరాలిచ్చేస్తుంటాడు. అది ఉపమానంగా తీసుకుని కొంతమంది మీ చుట్టూ చేరి పొగడ్తలతో, వినయంతో పైసా ఖర్చులేకుండా



మీరు అనుగ్రహించేలా చేసుకుంటారు. ఈశ్వరుడికి అందరూ బిడ్డలే. కాన ఆయన అనుగ్రహంలో అర్థముంది. మరి అలాంటి వారిని మీరు అనుగ్రహిస్తే మీ సొంత బిడ్డలు అన్యాయం అయిపోతారు. కొంతమంది ఆడాళ్ళు ఇంకా ప్రమాదకరం. రోజుకి పదిసార్లు పలకరింపు. మిమ్మల్ని మించిన మగాడు లేడు... భోజనం చేశారా? ఇత్యాది వాటి గుర్చి ప్రేమతో పలుకరిస్తారు. ముద్దుగా ఏం చేస్తున్నావురా....? అంటారు. అది చాలు. జేబులోంచి వందల నోట్లు తీయటానికి... పదిరూపాయిల ఖర్చు గురించి ఆలోచించే వారు సహితం వందల కట్టలను ఒక్క నిమిషంలో ఇచ్చేస్తుంటారు. ఏదో చూపించి దేన్నో చెయ్యమనే సామెత అలాంటి వారినుంచే పుట్టింది.

## వారి ఇంట జిల్లేడు పుట్టాలంటే?

ఆదివారం సాయంత్రం అయిదున్నర గంటలకి శ్రీకాళీవీర భద్రస్వామికి అష్టోత్తరశతనామ పూజ చేయిస్తే ద్రోహం చేసిన వారికి చెయ్యవల్సిన పనినీ, శిక్షనీ ఆ స్వామి వేస్తాడు. పగవాడి ఇంట జిల్లేడు మొక్క పుట్టిస్తాడు. సకల ఐశ్వర్యాలనీ నాశనం చేస్తాడు.

## దైవ భోజనం...

భోజనానికి ముందు అన్నపూర్ణాష్టకం లోలోన మననం చేసుకోవాలి. పదార్థాలన్నీ వడ్డించటానికి ముందు ఎలా వుంటుందో విస్తరి.. భోజనం అయ్యాక కూడా అలాగే వుండాలి. ఏ పదార్థాలనీ వదలరాదు. అవసరమైనంత మాత్రమే వడ్డించుకోవాలి. భోజనం పూర్తయ్యాక ఉత్తరాపోశనం చేయాలి. అలా పూర్తయ్యేది దైవభోజనం.



## దుర్మార్గుడిని చేరదీస్తే

మీ కొంపకే ఎసరు పెడతాడు. వాడి లక్షణాలు మీరెన్ని చేసినా, చెప్పినా మారవు. ఎవడో బైటనుంచి వచ్చి చేస్తే మీరు సమర్థవంతంగా ఎదుర్కోగలరు. పెంచి పోషించిన వృక్షమే మీద పడితే ఏం చెయ్యగలరు. చెడు నడక గలవానికి చేసే సహాయం మీ ప్రాణం మీదకే తెస్తుంది. మహా వరాలను ఈశ్వరుడు రావణాసురునికి ఇచ్చాడు. వర బల ధన గర్వములతో కైలాస పర్వతాన్నే కదిలించాడు. అప్పుడు పార్వతీదేవి 'చూశారా... మీరిచ్చిన వరాలతో మిమ్మల్నే కదిలిస్తున్నాడు' అంది. ఈశ్వరుడు సహితం మౌనం వహించాడు. కాబట్టి అలాంటి వారికి వరాలివ్వటం అంటే అశాంతిని కొని తెచ్చుకొన్నట్టే.

**సౌత్రామణి అనే యాగం పూర్తయ్యేవరకు ఎవ్వరికీ అన్నాదులు ఏవీ పెట్టకూడదు. ఆ ఒక్క యాగం తప్ప ఏ ఇతర యాగాదుల్లోనైనా అడిగిన వారికీ, ఆకలేసిన వారికీ అన్నాదులను సమర్పించాలి.**

## ఒక సంవత్సరము

భూలోకానికీ, ద్యులోకానికి మధ్యన సూర్య భగవాను డుంటాడు. అంతరిక్షం మధ్యనున్న సూర్యుడు తూర్పున ఇంద్రుని పట్టణమైన దేవదాని, దక్షిణాన యముని పట్టణం సంయమమునూ, పశ్చిమాన వరుణదేవుడైన నిమ్లోచనీ, ఇక ఉత్తరాన కుబేరుని పట్టణం విభావరిలను ఒక్క ఘడియలో ఒక్క చక్రం గల తన రథంతో ఇరవైనాలుగు లక్షల ఎనిమిది వందల



యోజనాలుగల ఆ నాలుగు పట్టణాల మధ్య సంచరిస్తాడు.

దాని పేరే ఆ సమయమే సంవత్సరం. సూర్య భగవానుడు వేదస్వరూపుడు. అన్న ప్రదాత. ఆరోగ్య ప్రదాత.

## వేదం చెప్పే అమృత వాక్యాలు

**వనే రణే శత్రుజలాగ్ని మధ్యే**

**మహావర్ణవే పర్వత మసక్తేవా ।**

**సుప్తం ప్రమత్తం విషమస్థితం వా**

**రక్షంతి పుణ్యాని పురాకృతాని ॥**

ఆరోగ్యం జాగ్రత్త.... ధనం బహు జాగ్రత్త. మహారణ్యంలో ఉన్నా, శత్రువులతో పోరాడుతున్నా, అగ్ని కీలకాల వంటి సమస్యలు చుట్టుముట్టినా, నీటిలో పడ్డా, పర్వత శిఖరాగ్రంపై నిద్రిస్తున్నా ఎంత ఏమరుపాటుగా వున్నా రక్షించేది ధర్మమే. ధర్మాలని వీడవద్దని వేదమాత శెలవిస్తోంది.

**శ్రీవిష్ణుసహస్ర నామం చదువుతున్నప్పుడు శ్రద్ధగా, భక్తిగా విన్నా చదువులలో మంచి రాణింపు వస్తుంది. ఆ మంత్ర శబ్ద పలుకులు మీలో జ్ఞానేంద్రియాల శక్తిని మరింత ప్రభావం చేస్తాయి.**

## మీకు రాసిపెట్టి వుందో లేదో తెలుసుకోవాలంటే

భార్యా భర్తలిద్దరూ బ్రహ్మముహూర్తంలో స్నానాదులు చేసి ఇష్ట దైవాన్ని పూజించాలి. పూర్తి మౌనవ్రతం పూజ అయ్యేదాకా చెయ్యాలి. పూజ అనంతరం భర్త అంతకు ముందే సిద్ధం చేసుకున్న రెండు దండలని స్వామి పాదాలపై ఉంచాలి. మనసులో ఈశ్వరుణ్ని



తలచుకుని అలా వుంచిన దండలలో ఒక దండని గుర్తు పెట్టుకోవాలి. మీ సహధర్మ చారిణిని రెండు దండల్లోని ఒక దండని పట్టుకోమనాలి. మీరు అనుకున్న దండ పట్టుకుంటే మీ కార్యం అయి తీరుతుంది. పూర్వ పురాణ ఇతిహాసాల్లోని ఎందరో ధర్మ పుణ్య మహనీయులు చేసిన కార్యమిది.

**రావి, మేడి, జువ్వి కలిపిన వృక్షం దేవతా వృక్షం. అట్టి వృక్షానికి చేసే పూజాదికాలు ఇష్టకామ్యసిద్ధిని ప్రసాదిస్తాయి.**

## వివాహాది శుభకార్యాలు ఆలయాలలో జరిగేటప్పుడు

పెళ్ళి, అక్షరాభ్యాసం, అన్నప్రాసన అలా ఎన్నో శుభకార్యాలు ఆలయాల్లో చేయటం అత్యంత శుభం, మంగళకరం. కొన్ని ఆలయాల్లో ముఖ్యంగా వివాహం రాజగోపురం దాటాక జరుగుతూ వుంటుంది. నేను వివాహానికేగా వెళ్తున్నది, దర్శనానికి కాదుగదాని చెప్పులతో వెళ్ళకూడదు. కొంతమంది చెప్పులు గడపకి ఆనిచ్చి మరీ వదలి లేదా గడప ముందు వదలి వెళుతుంటారు. అది దోషం. అలా వెళితే నడవలేని అనారోగ్యం కలుగుతుంది. ఆలయ పాలకుడు అనగా ఆ ఆలయ క్షేత్రపాలకుడు అంతా అన్నీ గమనిస్తుంటాడు. ఆలయమూర్తులనే కాదు ఆలయ ధర్మాన్నీ, విధులనీ, నియమాలనూ కూడా చూసే బాధ్యత ఆయనదే. తప్పు చేస్తే స్వామి క్షమిస్తాడేమో గాని క్షేత్రపాలకుడు సహించడు.



## సముద్రపు నీళ్ళు ఉప్పగా ఎందుకుంటాయి...

శ్రీమహావిష్ణువు ధాటికి రాక్షసులు పాతాళంలోకి వెళ్ళి దాక్కున్నారు. మహా జలముందక్కడ. ఆ జలం వెనుక దాక్కోవటంతో అగస్త్యమహర్షిని ఆ జలాన్ని తాగేయమన్నాడు భగవానుడు. పరమాత్మ ఆదేశంతో ఆ నీరంతటినీ అగస్త్యుడు త్రాగేస్తాడు. దాంతో భూమి మీద కూడా నీరుచుక్క లేకుండా పోయింది. విడిచి పెట్టమంటే 'వాతాపి జీర్ణమన్నట్టు' చెప్పాడు. మరి ఎలా అంటే మూత్రం ద్వారా వున్న నీటిని వదిలాడు. ఆ నీరే సముద్రమయ్యింది. అందుకనే సముద్రపు నీరు ఉప్పగా వుంటుంది. ఆ నీరు పుణ్యకార్యాలకి పనికిరాదు. కొన్ని సందర్భాల్లో తప్ప.

- బ్రహ్మవైవర్త పురాణం

## ఎదుగుదలకి రహస్యం

వందలతో ఉద్యోగిగా ప్రారంభించిన వ్యక్తి జీతం లక్షల జీతం వరకు వెళ్ళాడు. ఆ సందర్భంగా ఆయనను ఘనంగా సత్కరించారు. తోటి పనివారు ఆ సందర్భంలో అంత స్థాయికి ఎలా వెళ్ళావు... యజమాని అభిమానాన్ని ఎలా చూరగొన్నావ్ అని అడిగారు. దానికి అతను నా తెలివితేటలు, శ్రమ, ఆలోచనలతో ఆ సంస్థకి ప్రతి నిమిషం లాభం వచ్చేలా ప్రవర్తించాను. దాని వల్లే నాకీ స్థానం యాజమాన్యం ఇచ్చిందని చెప్పాడు. అలా చేస్తే మీరూ నా స్థాయికి రావచ్చుని చెప్పాడు. ఆ రాత్రి ఆ సంస్థ యజమాని భార్య అడిగింది. అతనికి మించిన



తెలివితేటలూ, శ్రమ చేసినవారు ఎవరూ లేరా అని. దానికి ఆయన నవ్వి..'చాలా మంది వున్నారు. అంతకుమించిన వున్నారు. అయినా వాళ్ళు అక్కడే వుంటారు. కారణం. తమ తెలివితేటలనీ, మేథస్సునీ యజమాని దగ్గర చూపిస్తుంటారు. మీకేం రాదన్నట్టు చూస్తారు. యజమాని దగ్గర వినయంగా వుండాలి. పనిలో తెలివితేటలూ, నిజాయితీ స్పష్టంగా వుండాలి. దానికి మించి తమ తెలివితేటలు, ప్రతిభలని యజమాని దగ్గర చూపించకూడదు. సంస్థ పెరుగుదలకే చూపించాలి. రెండవది వున్నా మొదటిది లేకపోతే ఎక్కడున్న గొంగళి అక్కడే అన్న సామెతే.

## నోటి మాటలే చెరుపు తెచ్చేది

ఏం మాట్లాడుతున్నామో అర్థం లేకుండా ఇష్టం వచ్చినట్టు వాగితే కడుపుకి, వీపుకీ చేటు తెచ్చే ప్రమాదం వుంది. ధనుర్యాగం కోసం మధురకొచ్చిన శ్రీకృష్ణ బలరాములు దారిలో ఎదురైన వానితో 'రాజుగారికి దుస్తులు తీసుకెళ్తున్నట్టున్నావే... మాకు మంచి దుస్తులు లేవు.. ఇవ్వగలవా' అని అడిగారు. దానికి వాడు అంతెత్తున లేచి 'మీరెంతా...? పాలు,పెరుగు, వెన్న తిని కొవ్వెక్కి కొట్టుకుంటున్నారా... తలలు తెగగలవు. ఇలాంటి దుస్తులు ధరించే అర్హత మీకుందా....' అని వాగాడు. ఫలితం ఒక్క వేటున వాడి తల నేలని తాకింది.

కొంతమంది నోటి దురుసుతో అంత స్థితిని తెచ్చుకుంటారు. అదే మధురలో అందంలేని త్రివక్రతో శ్రీకృష్ణుడు 'భలే అందంగా వున్నావు.. నీ వద్దనున్న సుగంధాలు మాకు ఇవ్వవా' అంటే కంసుడి



కోసం పూసే సుగంధాలను శ్రీకృష్ణ బలరాములకు రాసింది. వ్రాస్తున్నప్పుడు సిగ్గుతో వాలిన త్రివక్ర గడ్డం పట్టుకుని పైకి లేపి తలనిమిరాడు శ్రీకృష్ణుడు. అంతే ఆమె మహా సౌందర్యవంతురాలయ్యింది. మన నోటి మాటే .. దూలతీర్చినా, దురదృష్టాన్ని తెచ్చినా... అనుకోని అదృష్టం తెచ్చిపెట్టినా. నోరున్నది తింటానికి, భగవన్నామస్మరణ చెయ్యటానికి. ఊళ్ళో వారి గురించి లేనిపోని విషయాలను మాట్లాడటానికీ, పలకరించిన వాడితో పౌరుషంగా హీనంగా వాగటానికి కాదు. బ్లూటస్ వంటి వారు వెన్నుపోటు పొడిచినా అంత నష్టం జరుగదు. నోటి దూల మహా నష్టాన్ని తెస్తుంది. దుర్యోధనుడి నోటి దూల వల్ల బలరాముడు తన నాగలితో హస్తినాపురాన్ని పెకిలించి యమునా నదిలో వేయబోయాడు. ఆపై లక్షణ కన్యను సాంబుడికి అప్పగించి బలరాముడి కాళ్ళు పట్టుకోవాల్సి వచ్చింది. అంతెందుకు మన్మథుడు శివుని కంటికి భస్మమయ్యాడు. ఏమన్నాడో తెలుసా? 'నా శక్తి వల్ల నా మన్మథ బాణాల వల్లనే నీవు పార్వతీదేవిని వివాహం చేసుకున్నావు' అన్నాడు.

## అనర్హుడికి వరాలిస్తే....

శ్రీ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో ఎవరు అతి త్వరతగతిన వరాలిస్తారా అని వృకాసురుడు త్రిలోకసంచారిని అడిగాడు. నారదుడు చల్లగా విషయం చెప్పాడు. దాంతో వృకాసురుడు పరమేశ్వరుడి గురించి తపస్సు చేశాడు. ఈశ్వరుడు ప్రత్యక్షమయ్యాడు. ఏం కావాలో కోరుకోమన్నాడు. నేను ఎవరి



నెత్తిన చేయిపెడితే వాళ్ళు భస్మమవ్వాలని కోరుకున్నాడు. తథాస్తు అన్నాడు ఉమాపతి. వెంటనే ఈశ్వరుని నెత్తిన చేయి పెట్టబోయాడు. దాంతో ఈశ్వరుడు ఖంగుతిని వెనక్కి జరిగాడు. ఆ రాక్షసుడు స్వామి వెంటపడ్డాడు. వైకుంఠం వెళ్ళి శరణు వేడాడు. శ్రీమహావిష్ణువు ఈశ్వరుడిని తటాకంలో సేదతీరమని చెప్పి వటువు రూపం (మోహినిగా కాదు) ధరించి.....'ఈశ్వరుడు అలానే చెబుతాడు... వరాలంటాడు. అవన్నీ ఏం పనిచెయ్యవు. ముందు ముఖం కడుక్కో పరుగెత్తి పరుగెత్తి అలసి పోయావు' అన్నాడు. దాంతో వృకాసురుడు చల్లని నీళ్ళతో ముఖం కడుక్కొని ఆ చేతులతోనే తలనిమురుకున్నాడు.... భస్మమయ్యాడు... ఈశ్వరుడు ఊపిరి పీల్చుకున్నాడు.

## పూజలు, వ్రతములప్పుడు, వివాహమప్పుడు
## చెప్పింది శ్రద్ధగా ఆచరించాలి

వివాహ సందర్భమే తీసుకుంటే పాణిగ్రహణమప్పుడూ, ఏడు అడుగులు నడిచేటప్పుడు పనికి మాలిన ప్రేమ సైగలతో కాకుండా అగ్నిహోత్రుడ్ని చూస్తూ, స్మరించుకుంటూ వధువూ, వరుడూ ఇరువురి అరచేయి అరచేయి తగిలేలా పట్టుకుని నడవాలి. అప్పుడు పురోహితుడు వల్లించే మంత్ర శబ్దాల వల్ల పుత్రుడూ, పుత్రికా జన్మిస్తారు. అదే తగిలీ తగలకుండా స్పర్శానందం పట్టుకునీ, పట్టుకోకుండా నడిస్తే కూతుళ్ళుగానీ, కొడుకులుగానీ జన్మిస్తారు. ఆ రెండు విధాలుగా కాక హుందాగా వేళ్ళు తగిలేలా పట్టుకుని తమనెంత మంది చూస్తున్నారా అని తిరిగితే



శ్రీరామాయణంలో సీతమ్మ గురించి మాట్లాడి తలవంపులు తెచ్చుకున్నవాళ్ళు, తిక్కలోళ్ళు, వాగుడుకాయలు పుడతారు. కాన సకల పుణ్యయజ్ఞకార్యాల్లో డబ్బులిచ్చాం, వాళ్ళ పని వాళ్ళది మా పని మాదంటే మంత్ర శబ్దాలు వాటి పని అవి చేస్తాయి.

## గ్రామదేవతలకి వివాహ మెందుకు నిషిద్ధం

ఈశ్వరుని ఆదేశంతో గ్రామదేవతలు గ్రామరక్షణకై నిలిచారు. వివాహం అయితే కామం కలుగుతుంది. తర్వాత సంతానం. ఆపేక్ష... కాన బ్రహ్మచారిణులై గ్రామాన్ని పరిరక్షించాలన్న పరమేశ్వరుడి ఆజ్ఞని శిరసావహిస్తున్నారు. అలాంటి గ్రామ దేవతలకి వడపప్పు, పానకాలను నైవేద్యంగా సమర్పించాలి. జంతు బలలు కాదు. జంతు బలులివ్వటం తొమ్మిదో రోజుకి ముందే దీపం వెలిగించడం, ఇంట్లో కలిపేసుకోవటం వంటి దోషం.

**'హరయేనమః' అన్న శ్రీహరి నామం ఎలుగెత్తి ఉ చ్చరించినంతనే రాబోయే ఆపదలు, అనారోగ్యం దూరంగా వెడలిపోతాయి. కాలుజారి పడబోయే చిరు ప్రమాదాన్ని కూడా శరీరము స్మరణకి తెచ్చి ఆసరా అందిస్తుంది.**

**- శ్రీభగవానుడు బ్రహ్మదేవునికి చెప్పిన శ్రీభాగవతం నాలుగువేద శ్లోకాల్లోని సారాంశము.**

**భగవత్ రచనలూ, చిత్రాలు చేయాలనుకున్నప్పుడు, తీయాలనుకున్నప్పుడు పంచపాత్ర, నీరు పట్టుకుని తూర్పు దిక్కుకు దర్భలు చివర వుండేలా పరచుకుని ఆచమనం చేసి ధ్యానం చేసుకొని కార్యాలను ప్రారంభించాలి. అప్పుడు వాల్మీకి రచించిన శ్రీరామాయణం అంత ప్రసిద్ధి పొందుతుంది**



## సూర్యోదయానికి ముందే లేగవాలి

మనల్ని సృష్టించి లాలించే పరమాత్ముడ్ని సూర్యోదయానికి ముందే సుప్రభాతం పాడి లేపుతున్నాం. ఎందుకని సూర్యోదయం తర్వాత నిద్రపోతే శక్తి, పుణ్యం హరించుకుపోతాయని. యజ్ఞాల ద్వారా, యాగాల ద్వారా దేవతలకి హవిస్సుల రూపంలో శక్తి ఎలా అందుతోందో, అలాగే రాక్షసులకి శక్తి సూర్యోదయం తర్వాత నిద్రించేవాళ్ళ ద్వారా అందుతుంది. సూర్యోదయానికి ముందే లేచి చూడండి. విశ్వామిత్రుడు శ్రీరామలక్ష్మణులను యాగరక్షణకి తీసుకెళ్తూ...'కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే..' అంటూ సూర్యోదయానికి ముందే లేపాడు. చిన్నపిల్లలు కదా అని పడుకోనీయలేదు. ఆ సమయంలో నేర్చుకున్న విద్య కరతలామలకమవుతుందని. అప్పుడే బల, అతిబల విద్యలను నేర్పాడు. అప్పుడు నేర్చుకున్నవే ధర్మపుణ్యపరులకీ, రావణసంహారానికీ వినియోగించబడ్డాయి.

## నలభై ఒక్క రోజులు ప్రదక్షిణలు చేసినా ఫలం రాదు

కార్యసిద్ధి కోసం సూర్యోదయానికి ముందే దేవాలయానికి వెళ్ళి ప్రదక్షిణలు పూర్తి చేసినా అనుగ్రహం కలుగదు. దానికి కారణం తలస్నానం చెయ్యకుండా వెళ్ళటమే. రాత్రి నిద్ర తర్వాత శరీరంలో నవరంధ్రాల్లో మలినం ఏర్పడుతుంది. మలినాలు శుభ్రం అనగా స్నానం చెయ్యకుండా వెళితే అపరిశుభ్రంగా చేసిన ఆ దైవసేవ పరగణలోకి వెళ్ళదు. స్నానం చేసి చేశాము అంటారు



కానీ కాదు..కళ్ళు, చెవులు, ముక్కు అలా అన్ని చోట్ల నిద్ర తర్వాత మలినం చేరుతుంది. స్నానం అంటే తలస్నానం చెయ్యాలి. తలస్నానం చెయ్యకుండా దేవాలయంలో అర్చనలకి వెళితే అపరిశు భ్రంగా వెళ్ళినట్టే. కాన అలా వెళితే ఫలం రాదు.పైగా దోషం కూడా.

## శ్రీరామాయణంలో గంగావతారాన్ని చదివితే

సంతానం లేనివారికి పుత్రసంతానం కలుగుతుంది. పుత్రులు మంచి వృద్ధిలోకి వచ్చి తల్లి, తండ్రికి ఆనందం కలిగిస్తారు. పూర్వజన్మ పాపాలు తగ్గుతాయి. వంశంలో ముందున్న వారు చేసిన దోషాలకి విముక్తి కలుగుతుంది. పితృదేవతలు పరమానందం చెందుతారు.

## ప్రశ్న ఎలా వేయాలి(పరిప్రశ్న)

తెలియని దాన్ని అడగటమే ప్రశ్న. అయితే ఆ ప్రశ్న తల్లి తండ్రిని ఎప్పుడైనా అడగచ్చు. అత్తమామలను పగటి దేవతార్చన తర్వాత మాత్రమే అడగాలి. ఇక గురువును విద్య నేర్పే సమయాల్లో (ఎక్కడపడితే అక్కడ ఎదురొస్తే.. ఇంటికెళ్ళి.. తంత్రీసాధనం ద్వారా అడగరాదు) అడగాలి. ఆధ్యాత్మిక పరులను వారికి వారుగా ఏమైనా సందేహాలున్నాయా అని అడిగినప్పుడు అడగాలి. ఇక నా విషయమైతే రాత్రి పదకొండింటికి కూడా అయిదో రోజు దీపం పెట్టచ్చా అని కూడా అడుగుతుంటారు. అసలు పురుషులని ఆ ప్రశ్న అడగకూడదు. స్త్రీనడగాల్సినవి. స్త్రీ అడగవల్సినవి పురుషుడు అడగాలి. ప్రశ్న(పరిప్రశ్న) సమయం, సందర్భం, వ్యక్తి స్థితి అన్ని చూసుకుని అడిగితే ఆ సమాధానం పరిపూర్ణంగా మీ ఉన్నతికి ఉ పయోగపడేది వస్తుంది.



## పదకొండో రోజు భార్య ఇంట్లో వుండాలి

భార్యాభర్తల మధ్య గొడవలు సహజం. అలా లేవని ఎవరు చెప్పినా అది అతిశయోక్తే. కీచులాటలతో పుట్టింటికి వెళితే పదకొండోరోజు ఎట్టి పరిస్థితుల్లోనూ గృహంలో వుండాలి లేదా భర్త అయినా వెళ్ళి భార్యని తెచ్చుకోవాలి. భార్యాభర్తల గొడవల్లో అన్నదమ్ములూ, అత్తమామలు, తల్లి, తండ్రి వెళ్ళకూడదు. పెంచకూడదు. కూరలో ఉప్పు తక్కువయిందనీ, పుట్టింటి వాళు ళ్ళ పెళ్ళిలో కాఫీ ఇవ్వలేదనో వాదన చివరకు నలుగురిలో చిలికి చిలికిగాలి వాన చేసి వాళ్ళని విడదీసేంత వరకు తీసుకెళ్ళే ప్రబుద్ధులు ఎంతోమంది వుంటారు. లక్షకోట్లు వున్నా భర్తని వదిలేసి, గొడవపడి బైటికొస్తే విలువ సున్నా. పరులంతా ఆ స్త్రీని ఆశించేది ఆ రెంటికోసమే. ఇక భార్యని దూరం చేసుకున్నవారికన్నా దురదృష్టవంతుడు ఎవ్వడూ వుండడు.

- పరాశర మహర్షి

## ధనం దగ్గరే అసలు స్వరూపం కనపడుతుంది

మీకు పరమానందాన్ని నిరంతరం పంచేవాళ్ళు... తేడా వస్తే బాధపెట్టేవాళ్ళు ఇద్దరుంటారు. ఆ ఇద్దరు ఎవరు.. అని ఎలా తెలుసుకోవటం. డబ్బుతో టెస్ట్ చేయండి. అపురూప ప్రేమికులుకావచ్చు... స్త్రీ పురుష అక్రమసంబంధం కావచ్చు.. అన్నదమ్ముల మైత్రి కావచ్చు.. చిన్ననాటి స్నేహం కావచ్చు.... ప్రియురాలు, ప్రియుడు కావచ్చు. ధర్మ పురాణ యజ్ఞ యాగాదులు చేసేవారు, ధర్మాన్ని చెప్పేవారు... ఇలా ఎవ్వరైనా సరే డబ్బుతో



సంబంధం లేకుండా వున్నంత వరకు అంతా అపురూపమే. కొద్దిగా డబ్బు ఇచ్చి చూడండి. హారతి కర్పూరం కరిగే వేగం కన్నా వేగంగా వారి బుద్ధి తెలుస్తుంది. అసలు పైవాళ్ళతో ధనం విషయంలో దూరంగా వుంటే కలకాలం కలిసి వుండచ్చు. ఈ కాలంలో ఇద్దరే వున్నారు. ఒకరు ధనం ఇచ్చేవారు, రెండు దానికోసం ఏ మార్గం ద్వారానయినా పుచ్చుకునేవారు. పుచ్చుకుని ఇచ్చేవాళ్ళు వందలో వకశాతం మాత్రమే. పుచ్చుకున్నప్పుడు ఎంత ఆనందంగా తీసుకున్నారో ఇచ్చేటప్పుడు అలానే ఇచ్చేవాళ్ళు మీవాళ్ళు.

**సరయిన స్నేహితుణ్ని ఎంచుకోకపోతే సకల జీవితమూ నాశనమయిపోతుంది. పుత్రుడు దుర్మార్గుడయితే వంశమూ(రావణుడు) ఎంతటి పతివ్రత అయినా భర్త స్త్రీ వ్యామోహానికి అడ్డం పడకపోతే తన జీవితం (మండోదరి), స్త్రీ చెడునడత గలదయితే అన్నదమ్ముల జీవితము (శూర్పణఖ) నాశనమవుతాయి.**

**- శ్రీరామాయణము**

## పిల్లి శాపనార్థాలు పనిచేయవు

అకారణంగా ద్వేషంగా, పౌరుషంగా, స్వార్థ చింతనతో, ఈర్ష్యా అసూయలతో పెట్టే శాపనార్థాలు పనిచేయవు. తమకి తీరని అపకారం చేసినా భరించి భరించి, ఇక వల్ల కాక, తప్పక ఆక్రోశంతో పెట్టే శాపం మహర్షి పెట్టిన శాపంతో సమానం. అలాగాక గిన్నె అందకుండా చేశారనీ, మూతి పెట్టగానే కసురుకున్నారని పిల్లి శాపనార్థాలు పెడుతుంది. అలాంటివి తన స్వార్థానికి అడ్డం వచ్చారని పెట్టే శాపాలు పనిచేయవు. అందకే పిల్లి శాపనార్థాలని అనేది.



## మీ కల్పవృక్షంను పక్కవాడి పెరట్లో నాటకండి

మీరూ, ప్రకృతి సమస్తం నిద్రించినా నిద్రపోనిది వడ్డీ మాత్రమే. లక్షరూపాయిలు రెండు రూపాయిల వడ్డీ చొప్పున ఇరవైయేళ్ళకి పైగా వడ్డీ కడుతుంటే మీరెంత నష్టపోయారో అవతల వాళ్ళు ఎన్ని సుఖాలనుభవిస్తున్నారో తెలుసా?

ఈ ప్రపంచం మొత్తం తిరిగితే అయ్యే ఖర్చెంత.

మీ కుటుంబమంతా ఏ దేశాల్లో సంచరించినా అంతకాదు. మీ భార్యాపిల్లలు ఇక వద్దు అనేంత బంగారం గల ఖరీదు. మీ మనువరాండ్రకి బంగారపు దుస్తులు చేయించినా ఇంకా ఎంతోకొంత మిగులుతుంది.

ఇంకా పెద్దమొత్తంలో మీ గృహంలో మిగిలి వుండే ధనం. అటువంటిది మూడు, నాలుగుకి వడ్డీకి తీసుకుని సంవత్సరాలు సంవత్సరాలు వడ్డీ కడుతుంటే దాని అర్థం ఏమిటో తెలుసా? మీ గృహంలోని కల్పవృక్షం వాళ్ళ పెరటిలో నాటి వుంచినట్టే. మీరు నిద్రపోతారు గాని మీ వడ్డీ మాత్రం నిద్రపోదు. పైగా పిల్లలని పెడుతుంది చక్రవడ్డీ రూపంలో.

## పదేళ్ళ వ్యాపారం చేసినా పదిపైసలు వదలరు

ఏ వ్యాపారంలో నయినా సరే నాలుగైదు సంవత్సరాలు వ్యాపారం చేస్తే మీరు వాడిదుడుకులకి లోనైతే చూసీ చూడనట్టు వదిలేస్తారు. పీల్చి పిప్పి చేసి అవమానం చెయ్యరు. అదే మీరు ఇరవైయేళ్ళు వడ్డీలు కట్టినా వడ్డీ కిచ్చిన వారు మాత్రం ఇరవై పైసలను కూడా వదలరు సరికదా ఇరవై లక్షల విలువైన ప్రచారాన్ని చేస్తారు. అలాంటి వారితో జాగ్రత్త. వడ్డీలు కడుతున్నారంటే మీరూ, మీవారూ సుఖాలను దూరం చేసుకుని వారికందించినట్టే.



## పదిరూపాయిల వడ్డీలకి ఎందుకిస్తారు

నీచాతినీచమైన కార్యాల్లో అదొకటి. అవసరం, వారిలోని భయం చూసి ఇస్తారు. వెనకేమీ లేకున్నా అంత వడ్డీ ఎలా కడతారని ఓ అతన్ని అడిగాను. అతను చెప్పిన సమాధానం విని మైండ్ బ్లాక్ అయింది. ఇచ్చే వారి వద్ద ఖాళీ చెక్కులనూ, ఇంట్లో వారి సంతకాలను తీసుకుంటారు. ఇచ్చే డబ్బు వడ్డీ రూపేణా ఆరు, ఏడు నెలల్లో వచ్చేస్తుంది. అంటే అసలు జమ అవుతుంది. ఆ తర్వాత నుంచి జీవితాంతం పిండుతూనే వుంటాం. ఒక స్టేజీలో తీసుకున్న లక్షవడ్డీకి లెక్కవేస్తే లక్షలు దాటి కోటికి చేరినా పెద్ద ఆశ్చర్యం లేదు అన్నాడు. నేనప్పుడు అతన్ని చూశాను. నాకతను మనిషిలా కనిపించలేదు. అతను పెట్టుకున్న పది ఉంగరాలు, చైన్లు బంగారంలా అనిపించలేదు. సందర్భం అవునో కాదో తెలీదుగాని వేమన పద్యం గుర్తుకు వచ్చింది. అంతరంగంలో చేసిన తప్పులెన్ని దాచుకున్నా పైకి మంచివాడిగా అనిపించినా దేవుడికి తెలియకుండా వుంటుందా. ఆ స్వామి శిక్ష వెయ్యకుండా వుంటాడా... అయితే దేవుడు పాపం చేస్తే శిక్ష విధిస్తాడు. మరి ఆ పాపాన్ని భరించినవాడికి... అనగా దాన్ని అనుభవించిన వారికి ఏ న్యాయం చేస్తున్నాడు అని-

## డబ్బులెక్కువయితే...తక్కువయితే

- కనిపించిన ప్రతీదీ తినాలనిపిస్తుంది.
  చుట్టూ పంచభక్ష పరమాన్నాలున్నా తినబుద్ధికాదు.
- అట్టు వెళ్ళాలని, ఇటు వెళ్ళాలని, అది చెయ్యాలని, ఇది చెయ్యాలని ఎన్నో కోరికలు.



అన్ని జేబుల్లో కుక్కినా మిగిలిన డబ్బుల పక్కన పడేసి అటూ, ఇటూ పిచ్చాడిలా తిరగటమే.

❀ జేబులో రూపాయి లేకపోయినా తేలికగా అనిపిస్తుది.

ఏదో బరువు. శరీరమంతా కదలలేనట్టు.. తిక్కతిక్కగా.. అసలేం చెయ్యాలో అర్థం కాదు.

❀ డబ్బులెక్కవయితే ఒకేఒకటి అనిపిస్తుంది. ఏమన్నా తినాలని, తాగాలని, శరీరానికి సుఖాలనివ్వాలని.. అన్నీ చెయ్యాలనిపిస్తుంది. ఏదీ చెయ్యబుద్ధి కాదు. వున్న డబ్బుని మరింత పెంచాలని మాత్రమే ఉంటుంది. ఆకలేసినప్పుడు వేడి అన్నం అందుబాటులో వుండాలి. కోరిక కలిగినప్పుడు తీర్చుకోవటానికి రూపాయి అందుబాటులో వుండాలి. అన్నింటినీ అన్నీ తీర్చుకునే ఆరోగ్యం కలిగినవాడై ఉండాలి. అదృష్టవంతుడికి కావాల్సిన దానికి లోటు లేకుండా వస్తుంది.. దురదృష్టవంతునికి అతిగా లేదా అసలేమీ లేకుండా వుంటుంది.

## శ్రీలలితా, విష్ణుసహస్ర నామాలను చదివేటప్పుడు

కనుబొమ్మలు అకారణంగా కదల్చకూడదు.

❀ లలాటం కదలరాదు.

❀ మంత్రం లోపల నుంచి రావాలి. ఏదో గొణుగుతున్నట్టు రాకూడదు.

❀ గట్టిగా కాకుండా స్పష్టంగా, మంద్రస్వరంతో చదవాలి.

❀ చేతులనీ, కాళ్ళనీ, కళ్ళనీ అటూ ఇటూ కదుపుతూ కాకుండా స్పష్టంగా పలుకుతూ పూర్తి చేయాలి.



❀ ఎవరో వినాలనీ, తమ గొంతు మాత్రమే గట్టిగా వినాలని చదవరాదు. అంతేకాదు సాధారణ సమయంలో, ఎదుట వాళ్లతో మాట్లాడేటప్పుడు కూడా ఆ నియమాలు పాటించాలి.

- వ్యాకరణం

## గన్నేరు చెట్టుకి నీళ్ళు పోస్తే

❀ కన్నతల్లి, తండ్రికి చెయ్యాల్సిన విధులను క్రమం తప్పకుండా చెయ్యకపోవటం ద్వారా. సంబంధించిన ఆ విధులు చెయ్యకపోతే అక్కడ ఆ లోకంలో వారికి క్షోభ తగులుతుంది. తద్వారా మీరు, మీ కుటుంబం కష్టాలపాలు.

(అందుకే సంతానాన్ని ధర్మపద్ధతిలో పెంచితే కూడా గ్రహ దోషాలు సమసిపోతాయి. ఈ జన్మలోనూ, మరుజన్మలోనూ దుఃఖం వుండదు)

కావున ఇవన్నీ దరిదాపుల్లోకి రాకుండా ఉండాలంటే గన్నేరు చెట్టుకి నీరు పోయడం, పెంచటం వల్ల దోషాలు పటాపంచలవుతాయి. అంతే కాకుండా కుజగ్రహ దోషాలు కూడా సమసిపోతాయి. గన్నేరు చెట్టుకి నీరుపోయటం వల్ల... ఆ ఒక్క విద్యుత్ ధర్మమే సకల బాధ్యతలనీ సకాలంలో గుర్తు చేస్తుంది.

## ఒకే పడవలో ప్రయాణిస్తున్నాము

సంసారమంటేనే సముద్రాన్ని ఈదటం. ఈదాలంటే, ప్రయాణించాలంటే ధనమనే నీరు కావాలి. మనందరి దగ్గర వున్ననీరు అనగా ధనం కొద్దిగానే. దాంతోనే గమ్యాన్ని చేరాలి. వాళ్ళు అడిగారనీ, వీళ్ళ సమస్యలకనీ చేతిలోని ధనమిచ్చేస్తే గుమ్మం



దాటిస్తే, జేబు దాటిన ఆ ధనం మీ సమస్యలకీ, అవసరాలకీ అక్కరకు రాదు. చేతనైతే, చేయగలిగితే సహాయం చెయ్యండి. అప్పిచ్చి అది రాక వారితో శత్రుత్వమూ, మనస్పర్థలు తెచ్చుకోకండి. అన్ని గొడవలకీ కారణం ధనమే. పడవలో ప్రయాణించేటప్పుడు అందరికీ నీరు కావాలి. ఉన్న నీటిని ఎవరికి వారు వారి అవసరాలకి ఉపయోగించుకోవాలే తప్ప ప్రక్కప్రయాణికుడికి ఇస్తే, మళ్ళీ వాడు మీకు దాహం వేసినప్పుడు ఇవ్వలేడు. సముద్రంలో ప్రయాణించేటప్పుడు వర్షం పడుతుందేమోగాని అవసరానికి ఏ ధనం మీ గుమ్మంలోకీ, మీ జేబులోకి రాదు. సృష్టిలో ఆక్సిజన్ పీల్చుకుని ఆక్సిజన్‌ని మాత్రమే వదిలే పవిత్రమైన ఆవు చుట్టూ ప్రదక్షిణలు చేసినా పుణ్యం వస్తుందేమో గాని చిల్లుగవ్వ రాదు. బోడిగుండు మీద రేగిపండు పెట్టి, దానిపై మళ్ళీ ఇంకో రేగి పండు పెట్టగలమేమో గాని అవసరానికి ఇచ్చిన ధనం ఛస్తే కూడా తిరిగి అవసరానికి రాదు.

## గృహ కల్పవృక్షం

- పిసినారి ధనాన్ని అతను జీవించివుండగా ఎవరూ ముట్టలేరు.
- పాము ప్రాణాలతో వుండగా పడగ మీది ప్రకాశవంతమైన అపూర్వమైన వెలుగులు చిమ్మే మణి దరిదాపులకి కూడా వెళ్ళలేరు.
- అడవికి రారాజు సింహం జీవించివుండగా దాని జూలును కూడా ఎవ్వరూ సవరించలేరు.
- ఉత్తమమైన స్త్రీ వక్షస్థలం మీద ఆ స్త్రీలు బ్రతికుండగా భర్త తప్ప మరెవ్వరూ చేయి వెయ్యలేరు.



అట్టి స్త్రీ దిలీప మహారాజు సేవించిన నందినీ ధేనువు వంటిది. పురుషుడు తన శరీరాన్నే కోసి ఇచ్చిన దంతీదేవుడు.

క్షీరసాగర మథనంలో జన్మించిన కల్పవృక్షం వలే పాదస్పర్శతో పరిసరాలను పవిత్రం చేయగలిగినదీ, సాయంత్రం సూర్యకాంతి వలే అశుభ్రతను పారద్రోలగల శక్తి గలదైన స్త్రీ గృహ కల్పవృక్షం.

(భర్త తమ ఆలనా పాలనా చూడటం లేదు కాబట్టి తప్పక తప్పు చేయాల్సివచ్చిందని ఒక్కరు సర్ది చెప్పుకోవటం తగదు. అలాగే పురుషుడు ఏ కారణం చేతనయినా అలాంటివి చేస్తే కీర్తివంతుడు, సుఖవంతుడు కాలేడు. సముద్రపు లోతు తెలిసిన మంధర పర్వతం పైనున్న రత్నాలను కురిపించినా ఇసుమంత శాంతి వుండదు. బ్రహ్మహత్యాపాతకానికైనా నివారణ వుందేమోగాని భార్యకి ద్రోహం చేసిన మగవాడికీ, భర్తకి ద్రోహం చేసిన స్త్రీకీ లేదు.)

## ఊహించని అనారోగ్యం

ఎడమ చేతితో ఆహారాన్ని పట్టుకొని తిన్నా, భోజనం తింటూ ఎడమచేతితో ఎడమ పాదమును పట్టుకున్నా తన ఎంగిలి తానే తిన్నట్టు. తత్‌దోషానికి ఊహించని అనారోగ్యం.

- పరాశర మహర్షి

## సామవేదం ప్రకారం ఎలాంటి కలలు ధనాన్నిస్తాయి

ఎద్దులనూ, ఆవులనూ, ఏనుగులనూ, మేకలను చూసినట్టు, కొండ శిఖరములనూ, పెద్ద పెద్ద చెట్టు ఎక్కినట్టు ఇత్యాదివి కలలో వస్తే ధనం వస్తుందని భావం. ఇంకా బురదలో పడ్డట్టు



కన్నీళ్ళు పెట్టుకున్నట్టు వస్తే రావాల్సిన ధనమొస్తుందని సూచిక. అందమైన స్త్రీని కలిసినట్టు కల వస్తే పుష్కళమైన ధనప్రాప్తి లేదా ధననాశనం.

## స్త్రీని బలాత్కరిస్తే...

అయిదు సంవత్సరాలు పందిగా పుట్టాల్సి వస్తుంది.

ఆపై పది సంవత్సరాలు తోడేలై, ఓ నెల కీటకమై మళ్ళీ క్రిమి అయి పధ్నాలుగు నెలలు జీవించాలి. పరస్త్రీని ఆశిస్తే కుక్క... నక్క... గ్రద్ధ.. పాము.. కాకి.. కొంగలుగా పుట్టాల్సి వస్తుంది. స్త్రీని బాధిస్తూ, ఏడిపిస్తూ ఆమెని ఆశిస్తే కుక్క యోనిలో పుట్టాల్సివస్తుంది. చివరగా ఎలుకగా కూడా పుట్టాల్సి వస్తుంది. అలా తనని ఆశించి బాధపెట్టిన ఆ జీవులను ఆ స్త్రీ మరో జన్మలో ఆ జంతువులని తన గృహ ధర్మంలో భాగంగా చెప్పుతో, రాయితో, కర్రతో కొడుతుంది.... కొట్టిస్తుంది. దొంగతనంగా స్త్రీ నగ్నత్వాన్ని బైటపెట్టినవాడూ, పదిమందికి చూపించేలా చేసినవాడు పుట్టు గుడ్డి అవుతాడు. అవన్నీ పై జన్మలో అనుకుంటే పొరపాటే. ఇది కలియుగం ... అంతా ఇక్కడే. ఆ జంతువులు పడే బాధలన్నీ మనుష్యునిగానే ఇక్కడే పడాల్సి వుంటుంది. ఆడదాన్ని తినేసేలా చూసేవాడు అంగవైకల్యంతో బాధపడతాడు.

- బ్రహ్మపురాణం - పద్మపురాణ

- విష్ణు ధర్మోత్తరము - వృద్ధగౌతముడు

## రోజూ చెంచాడు రోగాన్ని తగ్గించుకోండి

రోగములు పూర్వజన్మ పాపములు. అవి పోవటానికి ఔషధములని సేవించాలి... దానములు.. జపములు...



హోమములు... అర్చనలు చేయాలి. ఫలవృక్షాలను కూల్చటం వల్ల కూడా ఈ జన్మలో రోగాలు వస్తాయి. అందుకే పై వాటితో పాటు చెంబుడు నీళ్ళన్నా చెట్లకి పోస్తే.... చెంచాడు రోగమన్నా తగ్గుతుంది. ఉసిరిచెట్టు క్రింద 'శ్రీహరి'ని వెయ్యొన్నొక్కసార్లు తలుచుకుంటే వాతాది రోగములు పోతాయి. బిల్వ వృక్షం క్రింద 'శివపంచాక్షరి' ని జపిస్తే మహా దీర్ఘరోగాలే కుదుటపడతాయి. నందన వనంలో కల్పవృక్షం ఒక్కటే కానీ ఈ భువిలో ప్రతి వృక్షము కల్పవృక్షమే. కాకపోతే తెలుసుకోవాలి. మన పూర్వీకులు చెట్లకి పూజలు చెయ్యమనటంలో భక్తి.. పవిత్రత.. ఆరోగ్యం.. ఆయుష్షులు వున్నాయి.

## గన్నేరు సమిధలతో హోమం ఆయుష్షువృద్ధి

సప్తమి ఆదివారం నాడు జలం మధ్య నేలపై గన్నేరు సమిధలతో ఆదిపరాశక్తికి నేతితో హోమము చేయించాలి. అలా చెయ్యటం వల్ల శరీరంలో వున్న వ్యాధులన్నీ పారిపోతాయి. అకాల మృత్యువు నుంచి మార్కండేయుణ్ని రక్షించినట్టు ఈశ్వరుడు రక్షిస్తాడు.

- పరాశరుడు

## అనసూయలో 'న' తీసి ప్రవర్తించకండి

ప్రతి ఇల్లాలు ఒక అనసూయే. కానీ చుట్టూ వున్నవాళ్లే.. వాళ్ళ ప్రవర్తన ద్వారా, చేష్టల ద్వారా లేనిపోని అధికారాలు చూపించి అలాంటి సాధ్వీమణులను రెచ్చగొట్టి 'న' పేరులోంచి తీసేసేలా చేస్తారు. ఫలితం అటూ, ఇటూ రెండువైపులా కష్టాలే. స్త్రీలో అసూయ బైలుదేరిందంటే ఆపటం కష్టం. అది ఎంతవరకైనా దారి తీస్తుంది. అపార్థాల గోడ మొలుస్తుంది. గోడనయినా లక్షలమంది



పగలకొట్టగలరు. కానీ అపార్థాల గోడను ఎవరూ ఎప్పటికీ పడగొట్టలేరు. కేవలం అలాంటి అసూయవల్లే రాక్షస జాతి ఉద్భవించింది. దితి, అదితిల పుత్రులే దేవతలు, రాక్షసులు. ఆడది ఆలోచించటం మొదలు పెడితే రాజ్యాలే కూలిపోతాయి.

## ఈ వృక్షముల క్రింద భగవత్ ఆరాధన చేయరాదు

శ్లేష్మాతకము.. ఇప్పచెట్టు.. బూరుగు చెట్టు.. వెలగచెట్టు.. కోవిదార వృక్షముల కింద ఎట్టి అధ్యయనములు చేయరాదని కూర్మపురాణం శెలవిస్తోంది.

## మీరు వాళ్ళకిచ్చేది దానమే...

దానమునకుగానీ, భోగమునకుగానీ, కీర్తికిగానీ, ధర్మమునకుగానీ ఉపయోగపడని ధనము వ్యర్థము. దానము వల్లే శత్రునానశం. దానము వల్లనే సుఖము. అట్టి దానము తీసుకున్న వారి గృహానికెళ్ళి ఇస్తే సత్వర ఫలము. పరులకిచ్చిన ధనమే కాదు.. తల్లికి, తండ్రికి, అక్కాచెల్లెళ్ళకి, సోదరులకి, బంధువులకి, మిత్రులకి ఇచ్చినది కూడా దానమే. దానికి అంతే ఫలం కలుగుతుంది. అయితే దాన్ని దానంగా కాక సహాయం అని చెప్పి ఇవ్వాలి. ఇస్తేనే తిరిగి తీసుకోవాలి. అలాగే విష్ణుధర్మోత్తర పురాణం కూడా దానం అంటే ధనమొక్కటే కాదనీ, గ్రహీతకు ఏది అవసరమో అది చేస్తే అది కూడా దానం క్రిందే వస్తుందని శెలవిస్తోంది. దానాన్ని సంధ్యాకాలంలో చేయరాదు సుమా. అలా చేసిన దానం రాక్షసులకి బలం పెంచుతుంది. - అగ్నిపురాణం



## ఉల్లి, వెల్లుల్లిలను కాసింత దూరంగా వుంచాలి

వెల్లుల్లి తింటే ప్రాయశ్చిత్తము చేసుకోవాలని పరాశర మహర్షి అంతటి వాడే శెలవిచ్చాడు. ఇక ఉల్లిపాయ విషయానికొస్తే పురాణ ప్రవచనం చేసేవాళ్ళు శ్రీరామాయణం చెప్పేటప్పుడు పిట్టకథ ఒకటి చెబుతారు. సీతమ్మ వారు అగ్ని ప్రవేశం తర్వాత అయోధ్యకొచ్చి తమకింత సేవ చేసిన వానరదండుకి మంచి సాంబారుని చేసి స్వయంగా వడ్డించిందంట. సాంబారులో చిన్న ఉల్లి గడ్డ రావటంతో ఓ బుల్లి వానరుడు దాన్ని అల్లరిగా నొక్కాడు. అంతే ఆ ఉల్లి టక్కున ఎగిరింది. తన ముందే ఎగురుతుందా అని ఆ వానరుడు దాని కంటే ఎక్కువ ఎగిరాడు. అది చూసి ప్రక్కన.. ఆ ప్రక్కన.. అలా అంతా ఎగిరి భోజనాల కార్యక్రమాన్ని రణస్థలంగా మార్చారంట. కాన పెళ్లి చూపులప్పుడూ, శుభకార్యాలప్పుడూ, పాతమిత్రులు కలిసినప్పుడు కాసింత ఉల్లిని దూరంగా వుంచితే శుభకార్యం కిష్కింధకాండ అవ్వదు.

## బ్రహ్మ ముహూర్తంలో ఏం చెయ్యాలి

సూర్యోదయమున పూర్వము లేచీ లేవగానే 'శ్రీహరి'ని మూడుపర్యాయములు తనకి తనే వినేలా స్మరించుకోవాలి. ఆ సూర్యోదయానికి ముందు అర్థయామములనే ముహూర్తాలు రెండు వుంటాయి. మొదటిది బ్రాహ్మ్య ముహూర్తం.. రెండవది రౌద్ర ముహూర్తము. బ్రాహ్మ్యమున నిన్న నేను ఏం చేసితిని, దానములెన్ని చేసితిని... పుణ్యకార్యాలు ఏం చేసితిని.. అని మననం చేసుకోవాలి. రెండవ ముహూర్తంలో ఈ రోజు ఎలా గడపాలో, ఎలాంటి ఈతి.. శరీర బాధలు లేకుండా చేయమని భగవంతుడిని స్మరించుకోవాలి.



## ఈ రెండూ గోప్యముగా లేకపోతే ధనం పోయినట్టే

ఆహారమును అనగా భుజించేది, విహారములు అనగా ఉదయం లేవగానే చేసే ఆ రెండూ ఎప్పుడూ గోప్యంగా ఉండాలి. హారతముని బోధనల ప్రకారం ఆ రెండు గోప్యముగా లేకున్నచో ధనం పోతుంది. ఆ రెండు విషయాల్లోనూ చెప్పులు నిషిద్ధం.. ముఖ్యంగా మగవాళ్ళు పదిమందికి కనపడేలా రోడ్ల మీద, బండ్ల దగ్గర చెప్పులు వేసుకుని మరీ భుజిస్తుంటారు. ఇంకా చెప్పాలంటే రెండో విషయంలో కూడా చాలామంది బహిరంగమే. ఖచ్చితంగా శాస్త్ర ప్రకారం అయితే... చేస్తే విహారము తద్వారా సంబంధించిన అవయవమును పట్టుకొని లేపాలి. శాస్త్రం చెప్పింది.. నేను రాస్తున్నది మీకోసం. మీ ద్వారా మీ పిల్లలకి అందాలని. భరద్వాజ మహర్షి సహితం తన శిష్యులకి ఈ విషయాన్ని బోధించాడు.

## గింజలు గల పళ్ళు మాత్రమే తీసుకెళ్ళండి

- జ్యోతిషం చెప్పించుకునేవారు కొన్ని నియమాలు తప్పని సరిగా పాటించాలి.
- చెప్పే పండితుడు భోజనాదులను స్వీకరించి ఉండకూడదు. అనగా సంపూర్ణ ఉపవాసం.
- ఇచ్చే దక్షిణ వంక చూస్తే పండితుడు ఆ రోజుకి జ్యోతిషం చెప్పకూడదు.
- వేదం జ్యోతిష్యం అని చెప్పలేదు... జ్యోతిషం అని మాత్రమే చెప్పింది. అలానే సంబోధించాలి.
- వెళ్ళేటప్పుడు లేత రంగు దుస్తులను ధరించండి. దాని



వల్ల మీ గురించి మీకు అవగతమువుతుంది.

- ఎన్ని సందేహాలతో వెళ్తున్నారో అన్న సందేహాలకి సంఖ్యా పరంగా గింజలున్న పళ్ళని తీసుకెళ్ళండి.

- జ్యోతిషం తొలుత పార్వతీదేవి లక్ష్మీనారాసింహునికి చెప్పింది. నారదుడు బ్రహ్మకి, బ్రహ్మ బృహస్పతికి .... అలా పార్వతీదేవి చెప్పినప్పుడు ప్రహ్లాదుడూ తద్వారా శుక్రాచార్యులవారికీ అనగా దేవతలకీ, రాక్షసులకీ ఇరువురికీ తెలిసింది.

- శ్రీలక్ష్మీనారసింహ జయంతి రోజు జ్యోతిషం చెప్పకూడదని శాస్త్రం.

- జ్యోతిషంలో చెప్పకూడనివి అనగా సంపర్కము, అక్రమ సంబంధాలు, కుటుంబ వ్యక్తుల దొంగతనం వంటివి పలకరాదు. ఆ వంక పరిశీలించరాదు. అలా పలకటం, చూడటం శాస్త్ర విరుద్ధం. అలా చెప్పాల్సి వస్తే తల్లి, తండ్రికి మాత్రమే చెప్పాలి.

- జ్యోతిష పండితుడు నాకింత అని అడగరాదు.

- వీలయితే దోసకాయలని తీసుకెళ్లండి.. దానం ఇవ్వండి. దోసకాయ అంటే అమృతం తయారీకి ఉపయోగించబడిన దివ్య ఫలము.

గమనిక : దయచేసి ఈ విషయాలని చదివి జ్యోతిష పండితులతో వాదనకి దిగద్దు. మీరు సరయిన పండితుడ్ని ఎంచుకుంటారని రాస్తున్నాను. ఇందులో ఉన్నాయినీ, లేదా ఇందులో చదివామని చెప్పటం దోషం. అమృతమయమైన దోసకాయలని వంద పంచినా ఆ దోషం పోదు.



## శుక్రాచార్యుల వలే మొండితనం తగదు

దేవగురువు బ్రహస్పతి కన్నా అత్యంత జ్ఞానసంపన్నుడు రాక్షస గురువు శుక్రాచార్యులవారు. బ్రహస్పతి పుత్రుడు కూడా శుక్రాచార్యుల వారి వద్ద విద్యాభ్యాసం చేశాడు. దోసకాయతో అష్టధాతువులతో అమృతాన్ని చేసి మృతులని బ్రతికించే శక్తి గలవాడు శుక్రాచార్యుడు. అంత శక్తి, జ్ఞానసంపదలున్నా మొండితనం. దేవతలు తనకు అగ్రతాంబూలం ఇవ్వలేదనీ, బ్రహస్పతిని నెత్తిన పెట్టుకున్నారని దానికి కారణమైన ఇంద్రుడిపై పంతం పట్టి రాక్షసుల చేత దండయాత్ర చేయించాడు. ఆ మొండితనం వల్ల తాత్కాలిక ఆనందాన్ని పొందగలిగాడే గాని స్థిరమైన సౌఖ్యాన్ని పొందలేకపోయాడు. కాన మొండితనం... అసూయలు మీ ఆనందాన్నీ, ధనాన్నీ, సుఖాలనీ, కీర్తినీ ఇంకా చెప్పాలంటే మీ చుట్టూ వున్నవాళ్ళ ధన మాన ప్రాణాలను కూడా పోగొట్టుకోవాల్సి వుంటుంది.

## మన్మథుడి ధనస్సు.....

అశోక చెట్టు... మామిడి... నవమల్లి... గులాబీ రంగు తామరపువ్వు... నీలితామరపువ్వు. ఈ పూలతో మన్మథుడి ధనస్సు అలంకరించి వుంటుంది. ఆ ధనస్సుతోనే తన అయిదు బాణాలని ప్రయోగిస్తాడు. ఎంతటివారైనా దాసోహం అవ్వాల్సిందే.

## శ్రీమహాలక్ష్మి ప్రీతికి ఏ మొక్క నాటాలి

శ్రీకృష్ణుని ప్రీతికొరకు కదంబం.. హనుమంతుని ప్రీతి కొరకు మామిడి.. మన్మథుని కొరకు అశోక.. వరుణదేవునికి



కొబ్బరి చెట్టు. అదే సిరిసంపదలనూ, సుఖాలనిచ్చే శ్రీమహాలక్ష్మీదేవి ప్రీతికొరకు ప్రత్తి మొక్కను నాటాలి. అలాగే ఈశ్వరుడి కొరకు రుద్రాక్ష చెట్టును నాటాలి. రుద్రాక్ష చెట్టుని నాటి పెంచితే ఈశ్వరుని కొరకు తపస్సు చేసిన ఫలము దక్కుతుంది.

## వసంతోత్సవం (హోళి) కొరకు రంగులు ఇలా తయారు చేసుకోవాలి

ప్రకృతి మనిషి సకల అవసరాలనీ తీరస్తుంది. మనకేం కావాలో ప్రకృతి మాతకి తెలిసినట్టు ఎవరికి తెలుసు? చామంతి.. బంతి... మందారం.. కనకాంబరం ఇత్యాది పూలని, ఇంకా రకరకాల రంగుల అడవి పూలని సేకరించి ... వాటిని దంచండి. గంటసేపు నానబెట్టండి. ఆపై ఉడకబెట్టి వడకడితే వచ్చే రంగులతో హోళీని ఆనందంగా జరుపుకోవచ్చు. కృత్రిమంగా చేసే విషపదార్థాలతో మిళితమైన రంగులను చల్లుకున్నప్పుడు బాగానే వుంటుంది. ఆపై భయంకరమైన వ్యాధుల పాలుకాక తప్పదు. ఉగాది వేపపచ్చడికి ఎలా సేకరిస్తామో అలానే పూలని సేకరించి రంగులు తయారు చేసుకోవటం, చల్లుకోవటం మన సంస్కృతే. అందులో ఎంతో ఆరోగ్య రహస్యం వుంది. పూలస్నానం.. ఆ పూలనుంచి వచ్చిన నీరు చల్లుకుంటే దాంపత్య శక్తి పెరుగుతుంది, శరీరంలో విషప్రభావాలు నశిస్తాయి.

## ఇంద్రుడి నందనవనంలో వుండే అయిదు పవిత్ర వృక్షాలు

మందారం.. పారిజాతం... కల్పవృక్షం.. హరిచందనం... సంతనక. ఈ అయిదు వృక్షాలు ప్రశాంతతనీ, శక్తినీ, ఇష్టసిద్ధినీ...



శత్రువుల నుంచి రక్షణ, భోగాలను కలిగిస్తాయి. ఈ అయిదు వున్న వనం ఇంద్రుడి నందనవనం. ఉదాహరణకి మందార చెట్టు నాటి చూడండి... ఎంత ప్రశాంతత చేకూరుతుందో మీకే తెలుస్తుంది.

## ఏ యోగం కోసం నవగ్రహాలకి ఏ మొక్కలు నాటాలి

- అధికారం కోసం, పదోన్నతి కోసం సూర్యుని పేరున తెల్లజిల్లేడు నాటాలి.
- ప్రియమైన వారికి అనారోగ్యంగా వుంటే చంద్రుని ప్రీతి కొరకు మోదుగ మొక్క నాటాలి.
- పిల్లలు చెడునడతలో పోతుంటే అంగారకుని ప్రీతికొరకు కదంబ మొక్క నాటాలి.
- ఎంత చేసినా, ఎన్ని చేసినా కలిసి రాకపోతుంటే బుధ గ్రహ ప్రీతి కోసం ఉత్తరేణి నాటాలి.
- పిల్లల విద్య, ఉద్యోగప్రాప్తికి బృహస్పతి గ్రహ శుభ వీక్షణం కొరకు రావిచెట్టును నాటించాలి.

రావాల్సిన ధనం కోసం, వ్యాపారాభివృద్ధికి, సంతానం ఆలస్యమవుతున్నా..... శుక్రుని ప్రీతికొరకు మేడిచెట్టు నాటాలి.

నలువైపులా కష్టాలు కమ్మేసినా, ఎన్ని సమస్యలున్నా మొత్తం మటుమాయమవ్వటం కోసం శనిగ్రహప్రీతికొరకు జమ్మిచెట్టు నాటాలి.

అయినవారితో, కావలిసిన వారి వల్ల బాధలు పడుతున్నవారు రాహువు ప్రీతికొరకు గరికను పెంచాలి.



⚘ విపరీత ప్రభావాలు, ఊహించని విధంగా సమస్యలు నెత్తి మీదకొస్తుంటే 'అమ్మా' అని పలకరించినా సమస్యలొస్తుంటే, కేతువు ప్రీతికొరకు దర్భగడ్డిని పెంచాలి.

⚘ ధర్మం కోసం, న్యాయం కోసం గరికను, అపార బలసంపన్నం కోసం తులసిని, వృత్తిలో తనకితానే సాటి అవ్వాలనుకునేవారికి తెల్లజిల్లేడు.. ఎంతోమందిని రక్షించే వృత్తిలో వున్నవారు శంఖపుష్పం (సంస్కృతంలో గిరి కర్ణిక అంటారు), న్యాయాన్ని రక్షించే వృత్తిలో వున్నవారు తమ్మి మొక్కను నాటడం ద్వారా వారు మరింతగా రాణిస్తారు.

## ఏడురోజుల లలితా సహస్రపారాయణం

క్రమం తప్పకుండా ఏడురోజులు లలితా సహస్రనామ పారాయణం చేయాలి. మొదటి రోజు అనగా సోమవారం మర్రిచెట్టు, మంగళవారం వేపమొక్క, బుధవారం మద్ది, గురువారం మేడి, శుక్రవారం రావి, శనివారం కదంబం, ఆదివారం జమ్మి మొక్కలని నాటి రావి,వేప కలిసిన చెట్ల వద్ద తొమ్మిది చెంబుల నీరు పోసి పదకొండు ప్రదక్షిణలు చేస్తే పోయిన సంపద తిరిగి చేకూరుతుంది.

## ఇరుగుదిష్టి... పొరుగుదిష్టి... నా దిష్టి....

దిష్టి తీసే ముందు అలా అని తీయాలి.

⚘ చెడుచూపులు... గాలి దిష్టి.. పొగడ్తలప్పుడు.. అతిగా ధనం పొందినప్పుడు తప్పనిసరిగా దిష్టి తీయించుకోవాలి. నలమహారాజు వైభవం చూసి శనీశ్వరునికి కన్నుకుట్టింది. అంతే వంటి మీద బట్ట కూడా భార్య చీరచెంగునే కప్పుకోవాల్సి వచ్చింది.



- గుమ్మడి కాయను పగల కొట్టడం.
- ఈతాకుల చీపురుతో.. ఇంకా కర్పూరం బిళ్ళతోదిష్ఠితీయాలి.
- కొత్త వాహనాలకు మూడు, ఐదు లేదా ఏడు నిమ్మకాయలను కట్టాలి.
- పసుపు... సున్నం కలిపిన నీళ్ళతో.
- ఎక్కువగా ఎండుమిరపకాయలు.. రాళ్ళఉప్పు.. నల్లత్రాడులతో దిష్ఠి తీస్తారు తల్లులు.

పండక్కి కొత్తబట్టలు వేసుకునే ముందు అందులో ఓ ప్రోగు లాగి నిప్పుల్లో పడవేసి కట్టుకుంటే ఎంత దిష్ఠిగల వాళ్ళు చూసినా తగలదు.

సముద్రస్నానానికి వెళ్ళినప్పుడు కొంత నీటిని తెచ్చి వుంచుకోండి. ఆ నీటిలో కొంచెం నీటిని వ్యాపార ప్రాంగణం శుభ్రం చేసే నీటిలో కలిపి తుడవటం ద్వారా వ్యాపారసంస్థలోని దోషాలు పోతాయి. దిష్ఠి తొలగుతుంది. ఈ దిష్ఠి శనివారం సాయంత్రం అనగా సంధ్యా సమయంలో చేయాలి.

దిష్ఠి తీసేటప్పుడు ఎవరూ చూకూడదు. అలాగే నిద్రపోతున్నప్పుడు తీయకూడదు.

పిల్లలకి తలస్నానం చేయించి దేవుడి దగ్గరున్న కర్పూరం బిళ్ళని వెలిగించి వారిచుట్టూ మూడుసార్లు పెడగా తిప్పి వెలుగుతున్న కర్పూరం బిళ్ళను ఎవరూ తొక్కని ప్రదేశంలో పడవేయాలి.

## కలియుగంలో మానవుని ఆయుష్షు 128 సంవత్సరాలు

పక్కన వార్ని తిట్టడం.. నుంచుని భోజనం చెయ్యటం.. నివసించే ప్రాంతం చుట్టూ మొక్కలు, వృక్షాలు లేకపోవటం..



మాంసాహారాన్ని తినటం.. భార్యని తిట్టడం.. అయిన వారితో గొడవలు.. ఒక్క మొక్కని కూడా నాటకపోవడం.. వాటి మధ్య కొంతసేపైనా గడపకపోవటం వంటివి మానవుని ఆయుష్షుని తగ్గిస్తాయి. దేవాలయానికి వెళ్ళవల్సినప్పుడు దర్శనం తర్వాత వీలైతే ఆ ప్రాంగణంలో వుండే చెట్టు కింద కూర్చుని రండి. మొక్కల వద్ద సమయం గడపటం అనగా నీరుపోయటం, పాదులు శుభ్రం చేయటం వంటివి చేయటం వల్ల మొక్కల నుంచి వచ్చే ప్రాణశక్తి వల్ల శరీరం స్వచ్ఛమవుతుంది. తద్వారా ఆయుష్షు పెరుగుతుంది.

## పోలేరమ్మ అంటే కాపాడే దేవత

గ్రామదేవత.. కాపాడే దేవత.. శ్రీమహాలక్ష్మి, పార్వతి, సరస్వతిలు కలిసిన రూపమే పోలేరమ్మ. భాద్రపద బాహుళ అమావాస్యనాడు పోలేరమ్మ వ్రతం చెయ్యటం ద్వారా సంతానలేమి దోషం పోతుంది. పెరుగన్నంతో అమ్మకి చద్ది పెట్టి ఆ చద్దిని పిల్లలకి పెడితే కుటుంబ శాంతి. చల్లన గ్రామాన్ని కాపాడే పోలేరమ్మకు వేపచెట్టన్న ప్రీతి. అట్టి వేపచెట్టు వెయ్యకపోయినా పర్వాలేదు.. నరకటం..వంటివి చేస్తే పోలేరమ్మ ఆగ్రహిస్తుంది. లేక వేపచెట్టు తీయాల్సి వస్తే పదహారు వేపమొక్కలను ఎక్కడైనా సరే నాటండి. పోలేరమ్మ వ్రతం గురించి ఈశ్వరుడు స్వయంగా పార్వతీదేవికి చెప్పాడు.

## జాతక దోషాలను పోగొట్టే గోరింట

గోరింటంటే సాక్షాత్తు గౌరీదేవి. స్త్రీల మాంగల్యానికి రక్షణనిచ్చే గౌరీదేవికి ప్రీతికరమైనది తదియ. అతిథి అధిదేవత



కూడా గౌరీదేవినే. వివాహం ఆలస్యమవుతున్నవారు, సంబంధం కుదరాలని భావిస్తున్నవారు గోరింటాకును దానం చేయటం ద్వారా కోరిన కోర్కె సఫలమవుతుంది. శుక్రగ్రహ దోషాలున్న వారు, ఇంకా జాతక దోషాలున్నవారు గోరింటాకు చెట్టుని నాటండి. తక్షణం దోషం పోతుంది. గృహంలో పెంచిన గోరింటాకు చెట్టు ఆకును ముందుగా ముగ్గురు ముత్తైదువులకు ఇవ్వాలి. తర్వాత ఆ చెట్టు గల వారు పెట్టుకుంటే చెడు జాతక దోషాలన్నీ పోయి గౌరీదేవి ఆశీస్సులు లభిస్తాయి.

## నక్షత్ర వనమంటే

మొత్తం మూడు వందల అరవై ఆరు మొక్కలు నాటుతారు. దానికి పెద్ద స్థలం కావాల్సి వస్తుంది. నవగ్రహ దోషాలున్న వారు తొమ్మిది మొక్కలు, రాశిప్రభావాల కోసం పన్నెండు, నక్షత్ర శుభాల కోసం ఇరవై ఏడన్నా నాటండి. లేదా కనీసం వారి నక్షత్రం పేరున నాటవల్సిన మొక్కని నాటండి. అశ్వనికి కరస్కర(జీడిమామిడి) ..... భరణికి ధాత్రి(ఉసిరిక).... కృత్తికకు ఉరంబర, రోహిణికి జంబూ(నేరేడు)... మృగశిరకు ఖదిర... ఆరుద్రకి కృష్ణ.. పునర్వసుకు వంశీ(వెదురు)... పుష్యమికి పిప్పల.... ఆశ్లేషకి నాగ... మఖ, రోహిణికి మర్రి... పూర్వఫల్గుణికి పలాశ... ఉత్తర ఫల్గుణికి ప్లక్ష, హస్తకి అంబష్ట (సన్నజాజి)... చిత్తకి బిల్వ... స్వాతికి అర్జున(మద్ది)... విశాఖకు వికలకట(వెలగ), అనూరాధకు బకుళ(పొగడ)... జ్యేష్ఠకి సరళ.. మూలా నక్షత్రంకు సర్జు... పూర్వాషాఢకు వేప, ఉత్తరాషాఢకు మామిడి... ధనిష్ఠ, శ్రవణ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర వారు నిమ్మ, జమ్మి, కడిమి, మామిడి, వేపలను నాటాలి. రేవడి నక్షత్ర జాతకులు ఇప్పను



నాటాలి. ఆయా జాతకులకు సంబంధించిన మొక్క లభించనిచో గోరింట గానీ, మరువము, పొగడ, దేవకాంచనము గానీ... నేరేడు వృక్షములను గాని నాటిన చాలును.

## రేగిపండ్ల నోము నోస్తే సిరిసంపదలు ఖాయం

సోమవారం తర్వాత వచ్చే అమావాస్యనాడు నూటఎనిమిది రేగిపండ్లతో నూటెనిమిది ప్రదక్షిణలు రావిచెట్టుకి చేసి ఆ చెట్టు కింద పీఠంపై శ్రీలక్ష్మీనారాయణులను ఉంచి పూజాదికాలు చేసి రేగిపండ్లను పదుగురికి పంచితే అపార సిరిసంపదలు కలుగుతాయి. దీన్నే సుమంగళి వ్రతం అనీ, అమావాస్యసోమవార వ్రతమనీ కూడా అంటారు.

## అష్టవినాయకుల ఆలయాలు నిర్మించటమంటే

వెలగ... మారేడు... తెల్లజిల్లేడు... మామిడి ... రావిచెట్టు... తెల్లమద్ది... జమ్మి.. దానిమ్మ. ఈ ఏడు చెట్లను మీరు నాటితే అష్టవినాయక ఆలయాలని ప్రతిష్ఠించినట్టే. సకల కార్యాల్లో మీకు, మీ కుటుంబ సభ్యులకీ ముందు తరాల వారికీ ఎటువంటి విఘ్నాలు కలుగవు.

## కోరుకున్నవాడు, కోరుకున్న పడతి, భార్యగా, భర్తగా లభించాలంటే

శ్రీకృష్ణుడ్ని ఇష్టపడిన రుక్మిణీదేవిలా పరాశక్తి పూజ, వృక్షపూజ, వృక్ష సేవ చేయుటం ద్వారా కోర్కె ఫలిస్తుంది. కృష్ణతులసి.. నిద్రగన్నేరు, పారిజాతం, రామతులసి, కర్పూర తులసి, విష్ణుతులసి, విభూతితులసి, పొన్నచెట్టు, వనతులసిలను నాటండి. సాక్షాత్తు అన్నీ ఒకేచోట పెంచటమంటే ఆ ప్రదేశం శ్రీకృష్ణునికి అత్యంత ప్రీతికరమవుతుంది. శ్రీరామాయణం చెప్పే చోట హనుమంతుల వారు వున్నట్టు ఆ వనంలో శ్రీకృష్ణుడు కొలువై ఉంటాడు. మీరు కోరుకున్న భాగస్వామిని మీకు అందిస్తాడు.



**వేపచెట్టు, రావిచెట్లను నాగదేవత అనగా పుట్టల పరిసరాల్లో, ఆలయ పరిసరాల్లో నాటితే నాగదేవత కరుణించి సంతానప్రాప్తి కలిగిస్తుంది. వేప స్త్రీ చెట్టు అయితే, పురుష చెట్టు రావి. ఆ రెండు మొక్కలను నాటడమంటే వివాహం జరిపినంత పుణ్యఫలం.**

## ఏ రాశి వారు ఏ చెట్టు నాటితే బహువిధవృద్ధి కలుగుతుంది

కర్కాటక రాశి వారు మోదుగ చెట్టు, సింహరాశి వారు రావిచెట్టు, మేషరాశి వారు ఎర్రచందనం, వృషభరాశి వారు మారేడు, మిథునరాశి వారు పనసచెట్టు, కన్యారాశి వారు మామిడిచెట్టు, తులారాశి వారు మల్లె లేదా పొగడ.. వృశ్చికరాశి వారు మునగ, ఉసిరిలను నాటాలి.

## విద్యలో రాణించుటకు, జ్ఞాపకశక్తి కొరకు

చెట్టు మొక్కగా వున్నప్పుడే దానికి దడిచేసి, కంచెకట్టి గేదెలూ, పశువులూ తినకుండా కాపాడితే అది మహావృక్షమై చిన్న తనాన తాను మొక్కగా వున్నప్పుడు తినాలనుకున్న గేదెలకీ, పశువులకీ కూడా నీడనిస్తుంది. అలానే మీ పిల్లల విద్యాభివృద్ధికీ, జ్ఞాపకశక్తికీ నందివర్ధనం, కలువ, కాంచనం, సన్నజాజి, గోరింటవంటి వాటిని నాటించి వాటి పోషణబాధ్యతను వారికి అప్పగించాలి. తెల్లటి పూలచెట్లు ఏవైనా సరే.. అవి వారికి స్వచ్ఛతను పంచుతాయి.

## మన తాతముత్తాతల ధనం

- ఒక రూపాయికి అణాలు పదహారు
- అణాకి నాలుగు కానులు
- ఓ కానీకి మూడు దమ్మిడీలు



- అణాకి పన్నెండు దమ్మిడీలు
- రెండు అణాలకి బేడ
- రెండు బేడాలు పావలా
- రెండు పావలాలు అర్ధరూపాయి
- రెండు అర్ధరూపాయిలు ఎంత?
- **ఆ రూపాయి దగ్గర జాగ్రత్త....**

## ఈ మాసంలో ఈ వృక్షపూజ ఎంతో శ్రేష్ఠం

కార్తీకమాసంలో రావిచెట్టు, ఉసిరిలను... అలాగే శ్రావణంలో బిల్వ, తులసి... ఆషాఢంలో కదంబం, మోదుగ చెట్టు.... ఆశ్వయుజ మాసంలో శమీ, జ్యేష్ఠ మాసంలో మర్రి... లను నాటడం, మరియు పూజించడం వల్ల, యజ్ఞ యాగాది క్రతువుల్లో మీరు నాటిన చెట్ల నుంచి ఆకులని గానీ, బెరడునుగానీ, వూడలను గానీ వాడినంత కాలం...ఆ వృక్షమున్నంత కాలం మీకు పుణ్యం జమ అవుతూనే వుంటుంది. ఆ పుణ్యఫలమే మహాసౌభాగ్యాలని కలిగిస్తుంది.

## గొడవలు వీరితో పెట్టుకోకూడదు

పురోహితుడు.. మేనమామ.. గృహానికొచ్చిన అతిథి.. పిల్లలు.. వృద్ధులు... వ్యాధిగ్రస్థులు... వియ్యంకుడు, తల్లి, తండ్రి, అక్క, చెల్లి, అన్నదమ్ములు, పుత్రిక, పుత్రుడు.. భార్య, వైద్యుడు, సేవకులు, ప్రభుత్వాధికారులు.... వీరితో ఎట్టి స్థితిలోనూ వివాదములతో మాట్లాడరాదని శాస్త్రము.

## ఈ ఏడు మార్గాల ద్వారా సంపాదించిన ధనమే ధర్మమైన ధనం

**సప్త విత్తాగమా ధర్మాదాయో లాభః క్రయో జయః**
**ప్రయాగః కర్మయోగశ్చ సత్ప్రతిగ్రహ ఏవ న ॥**



పెద్దల నుంచి వచ్చిన ధనం.. తన స్థలము వలన వచ్చిన రాబడి.. కొనుగోలు ద్వారా వచ్చినది.. పగవారి నుంచి వచ్చినది.. ధర్మమైన వడ్డీ ద్వారా (పదిరూపాయిల వడ్డీ కాదు), వ్యాపార వ్యవసాయముల ద్వారా.. దానము ద్వారా వచ్చినది మాత్రమే న్యాయార్జితం.

## మృత్యువుకన్నా భయంకరమైనవి పద్దెనిమిది వ్యసనాలు

పద్దెనిమిది వ్యసనాలు కామం వల్లా, క్రోధము వల్లా పుడతాయి.

అవి... హింసించుట.. జూదము.. ఎప్పుడు పడితే అప్పుడు నిద్ర... పరులపై అపనిందలు, కంటికి నచ్చిన స్త్రీతో సంపర్కము కోసం ఆరాటము.. మద్యపానం.. పనీపాటా లేకుండా తిరగటం... నృత్య గీతాలతో సమయాన్ని గడపటం... పక్కవారి మీద నేరాలను మోపటము, మంచి గుణాలని చూసి అసహ్యించుకోవటము, ప్రతివారిలోనూ చెడుని వెతకటము.. ఇవ్వాల్సినవి ఇవ్వకపోవటము... తిట్టడం... చీటికి మాటికి అయిన వారిని దూషించటము, వయసు బలాన్నీ అహంకారాన్నీ చూపించటము. ఇటువంటి గుణాలు కలిగిన వారితో స్నేహం దూడని కట్టిన త్రాడుని దాటినట్టు... వర్షంలో పరిగెడితే, నీటిలో ప్రతిబింబము చూసుకుంటే, నిప్పుని దాటితే.. తన మెడలోని పూలమాలను తనే తీస్తే... ఊరికే గీతలు గీస్తే.. రెండు చేతులతో తలకొట్టుకుంటే కలిగే సకల అనర్థాలు కేవలం అట్టి పై లక్షణాలు కలిగిన వారితో తిరిగితే సంభవించి సంక్రమిస్తాయి.

## నల్లేరు వేలాడదీస్తే

కొట్టు దిష్టి నమసిపోతుంది. నల్లేరు వ్యాపారాన్ని



పెంచుతుంది. అప్పు అడగాలని వచ్చిన వాళ్ళని అడగనీయకుండా చేస్తుంది. మంగళవారం, శుక్రవారం నల్లేరు వేలాడదీయటం, అమావాస్య పౌర్ణమిలకు బూడిద గుమ్మడికాయ రాత్రి కొట్టు మూసిన తర్వాత కొట్టడం చేస్తుండాలి. నరదిష్టి, పక్కన పోటీదారు దిష్టి తగలదు. నిమ్మకాయని లాగితే నాలుగు ముక్కలుగా వచ్చేలా కోసి అందులో కర్పూరం వెలిగించి కొట్టుకి హారతిచ్చి ఆపై నిమ్మకాయని నాలుగుగా విడదీయటం ద్వారా కొట్టు భద్రం.

## సన్మార్గులతో దుర్మార్గుడు చేరేది...

ఏదో బలంగా ఆశించే. విదురుడు తీర్థయాత్రలు చేస్తుంటే మధ్యలో కొంతమంది వేటగాళ్ళు తామూ వస్తామన్నారు. విదురుడు అల్లన నవ్వి 'వద్ద'ని చెప్పాడు. పక్కనున్న వారు రానీయ్ మని అనటంతో సరేనన్నాడు.

గంధమాదన పర్వతం ఎక్కుతుంటే వేటగాళ్ళు 'ఈ పర్వతంపై కుబేరుడు పెంచుతున్న వృక్షముందంట.. దాన్ని పీక్కునిపోతే కావలిసింది కోరుకోవచ్చు' అని విదురుడ్ని అడిగారు. విదురుడు పక్కనున్న మునులని చూసి సన్నగా నవ్వాడు. మహాత్ములతో చేరినా జ్ఞాతి తన బుద్ధి ప్రకారమే నడుచుకుంటాడు. సమయం వచ్చినప్పుడు బైటపడతాడు... అన్నది ఆ నవ్వుకి అర్థం. కాన మీలో, మీతో కొత్తగా చేరుతున్నారంటే ఏదో ఆశించే...

## సంతానం లేనివారికి వృక్షమే పుత్రుడు

అని శాస్త్రం చెబుతోంది. సంతానం కలగక పోవటానికి వృక్షపరమైన దోషం కూడా వుండి వుండచ్చు. వంశంలో వృక్ష



హాని చేసిన దోషం వల్ల కూడా సంతానం ఆలస్యమవ్వచ్చు. కాన మీ భర్త నక్షత్రానికీ, మీ నక్షత్రానికీ సంబంధించిన మొక్కని నాటడం ద్వారా సంతానం కలగని దోషం పోతుంది.

## బియ్యం తింటే పెళ్ళికి వర్షం

పిల్లలూ, పెద్దలూ కొంతమంది పచ్చిబియ్యం కనపడగానే నోట్లో పోసుకుంటారు. వాళ్ళని చూసే పెద్దలు బియ్యం తింటే పెళ్ళికి వానపడుతుంది అని మందిలిస్తారు. నిజానికి బియ్యం తింటే పాండువ్యాధి వస్తుంది. అలా చెబితే వినరని ఇలా చెబుతారు. అలా బియ్యం తింటే వంట్లో రసాభస అవుతుంది. ఆ రసాభసే పెళ్లిరోజు అవ్వకూడదని. కాన బియ్యం తినవద్దు.

## రావిచెట్టు గృహంలో మొలిస్తే..

అరిష్టమని.. నష్టమని భావిస్తారు. నిజానికి చెట్టు మొలవటం అదృష్టమే. అయితే గృహంలో రావిచెట్టు వుండకూడదనటానికి కారణం అది పెరిగిపెద్దయితే పాములు ఇత్యాదివి రావచ్చని... లేదా గృహం యొక్క గోడలకి నష్టమని. మొక్క మొలిస్తే దాన్ని దూరంగా ఇంటికి ఎటువంటి ఇబ్బంది లేని స్థలంలో నాటండి. రావి చెట్టు గాలి వంద రోగ దోషాలని పోగొడుతుంది.

## అత్తిచెట్ల ఆకులను పంచే రోజు

అశ్వీయుజ శుక్ల దశమి రోజు తెల్లఆరె... అనగా అత్తిచెట్ల ఆకులను రక్తసంబంధీకులకు ఇవ్వాలి. తీసుకోవాలి. ఆ రెండు చెట్ల ఆకులు శ్రీలక్ష్మీ స్వరూపాలే. అనగా బంగారమే. ఆ రెండు చెట్లపైన కుబేరుడు కురిపించిన ధనాన్నే తన గురువైన వరతంతుకి ఇచ్చాడు. అది అక్షరాలా నూటనలభై కోట్ల



హిమటంకములు. అందుకే ఆ రోజు ఆ చెట్ల ఆకులని ఇచ్చి పుచ్చుకుంటారు.

## లోక కళ్యాణం అంటే

బ్రతకటం కోసం.. నిలబడటం కోసం చుట్టూ ఉన్న వాళ్ళని తొక్కుకుంటూ ఎదగటం రాక్షసనైజం. అలాంటి వారిపై లక్షల కోట్ల సంవత్సరాలైనా పాడవని గంగానది నీరు చల్లినా ఫలితం ఉండదు. పవిత్రమైన గంగనీరు కూడా పాడవుతుందేమో. రావిచెట్టు దైవ వృక్షం. అది ఎక్కడపడితే అక్కడ మొలవదు. మీ గృహ గోడల్లో మొలిస్తే ఎలా పీకుతారో అలా అలాంటి నీచుడ్ని పీకి పడవేయండి. మీ ధనమూ, శక్తీ, అధికారం, తెలివిలను ఉపయోగించి. అది ఖచ్చితంగా మీకు సుఖాలని ఇస్తుంది.

దాన్నే లోకకళ్యాణం అంటారు. దాన్నిపూర్తి చేసినవారు ఎవరైనా శ్రీమహావిష్ణువు అంశే. కాదని ప్రవర్తిస్తే ... మనకెందుకులే అని అనుకుంటే స్వర్గానికి దారి చూపించే రావిచెట్టు ఆకు మొన కూడా కాలసర్పమై కాటు వేస్తుంది.

## సుబ్రహ్మణ్యస్వామికి పన్నెండు కనులు

ఈశ్వరునికి మూడు కన్నులు. మూడో కన్ను కోపం వస్తే తెరుచుకుంటుంది. అదే సుబ్రహ్మణ్యస్వామికి పన్నెండు కనులు.. సుబ్రహ్మణ్యస్వామిని 'తండ్రి' అని సంభోదిస్తూ, పూజిస్తే జరగబోయేది కూడా కలలో చెబుతాడు. అలాగే ఈశ్వర పుత్రుడు పన్నెండు కనులలో ఓ కన్ను చెట్లకి హాని చేసే వారి గూర్చి చూస్తుంటుంది. అలాంటి వారికి ముందు చూపును సుబ్రహ్మణ్యస్వామి పూర్తిగా తీసివేస్తాడు. వృక్షాలని నాటడం, పూజించటం వంటివి చేస్తే భవిష్యత్తు తెలిసేలా చేస్తాడు. తద్వారా ఏ కష్టమూ దగ్గరికి రాదు.



## అతిగా పూసుకోవద్దు

సృష్టిలో అత్యంత అరుదైన, విలువైన వృక్షం చందనవృక్షం. మహా అరుదైన ఈ వృక్షం మలయ పర్వతంపై విరివిగా పెరుగుతుంది. అక్కడి వారికి అడుగువేస్తే చాలు అందుబాటులో వుంటుంది. అయితే అక్కడి వారు దాన్ని విరిచి వంటలో ఉపయోగిస్తారు. కాన ఎక్కువగా స్థాయి మరిచి తిరిగితే, వెళితే అక్కడ చందన వృక్షానికి పట్టిన గతినే పట్టిస్తారు. చందన వృక్షం కింద శ్రీభాగవతం(భాగవతం అంటే బాగు చేసేది) చదవటం ప్రారంభించి పూర్తి చేస్తే ఎంతటి చెడిపోయిన వాడయినా తిరిగి చందన కర్పూరాలను ఆస్వాదించే స్థాయికి తన వారిని తెస్తాడు.

**పదిలక్షల కోట్ల తులసి మొక్కలు, పదిలక్షల కోట్ల కదంబ మొక్కలు నాటిన ఫలం పోయేది ఓ నీచుడి స్నేహం ద్వారా. కాన పదిలక్షల కోట్ల తులసి మొక్కలు నాటకపోయినా, పదిలక్షల కోట్ల కదంబవృక్షాలు పెంచకపోయినా పర్వాలేదు. అలాంటి నీచులని దూరంగా ఉంచండి. అది పదికోట్ల, లక్షల కోట్ల మొక్కలు నాటినంత ఫలం. అదే ఆ నీచుడ్ని పక్కన పెట్టుకుంటే పదిలక్షల్ల మొక్కలను పాడుచేసిన పాపం.**

**సర్వే భవంతు సుఖనో - సర్వే సంతు నిరామయాః1**
**సర్వే భద్రాణి పశ్యంతు - మాకశ్చిత్ దుఃఖభాగ్భవేత్ ॥**

సకల శుభములతో, ఆరోగ్యంతో వ్యధలూ, దుఃఖాలూ దరి చేరకుండా సుఖంగా అందరూ జీవించాలి

**శుభం**